# ముందు మాట

అంతర్జాతీయ తెలుగు సంస్థ తెలుగులోని ప్రముఖుల పేరిట స్మారకోపన్యాసాలు వివిధ ప్రాంతాలలో నిర్వహించాలని నిశ్చయించింది. సంస్థ యింతవరకు వేర్వేరు ప్రాంతాలలో అయిదు ఉపన్యాసాలను నిర్వహించగలిగింది. శ్రీ కందుకూరి వీరేశలింగంగారి స్మారకోపన్యాసం మద్రాసులోను, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి స్మారకోపన్యాసం బొంబాయి లోను, శ్రీ రఘుపతి వెంకట రత్నంనాయుడుగారి స్మారకోపన్యాసం కలకత్తాలోను, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి స్మారకోపన్యాసం హైద్రాబాద్‌లోను నిర్వహించింది. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగారి పేరిట కొత్త ఢిల్లీలో స్మారకోపన్యాసం అనివార్యకారణాలవల్ల నిర్వహించడం జరగలేదు. కాని అక్కడ నిర్వహించ వలసిన ఉపన్యాస ప్రసంగ పాఠం యిందులో పొందు పరుస్తున్నాం. ఈ ప్రముఖుల పేరిట చేయబడ్డ ఉపన్యాసాలు ఆయా ప్రాంతాల ప్రజలను ఉత్తేజితులను చేశాయనడంలో సందేహంలేదు. ఇవి యీ ప్రముఖుల జీవితాశయాల గురించి క్లుప్తంగా చేయబడ్డ రచనలు.

మూలేటి రామప్ప
డైరెక్టరు

# భారత స్వాతంత్ర్యానికి పూర్వం తెలుగులో పత్రికా రచన

## ప్రారంభ వికాసాలు - సంప్రదాయాలు

దేవులపల్లి రామానుజరావు

బొంబాయిలో ఏర్పాటు చేసిన

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు స్మారకోపన్యాస పాఠము




అంతర్జాతీయ తెలుగు సంస్థ

హైదరాబాద్ - 500 027



శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

1-5-1867 — 11-4-1938

# భారత స్వాతంత్ర్యానికి పూర్వం తెలుగులో పత్రికా రచన

## ప్రారంభ వికాసాలు - సంప్రదాయాలు

అంతర్జాతీయ తెలుగు సంస్థ పక్షాన ఆధునిక యుగంలో భారతదేశాన్ని, తెలుగుసీమను వివిధ రంగాలలో జాగృతము గావించిన వైతాళికుల స్మారక సభలను ఢిల్లీ, కలకత్తా, మదరాసు, బొంబాయి మొదలయిన నగరాలలో ఏర్పాటు చేయవలెనని చేసిన నిర్ణయం ప్రకారం ఈరోజు మన మందరం ఇక్కడ సమావేశమైనాము. ఈ నిర్ణయం సర్వవిధాల సమంజసమైనది. బొంబాయి నగరంలో ఈనాడు జరుగుతున్న సభ స్వర్గీయ, దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారకసభ. ఈ శతాబ్దంలో తెలుగు దేశాన్ని మేలుకొల్పిన మహనీయులలో వీరేశలింగం పంతులుగారి ప్రక్క నిలిచే వ్యక్తి నాగేశ్వరరావుగారు. వాస్తవానికి నేటి తెలుగు సీమకు సూర్యచంద్రుల వంటివారు ఈ ఉభయులు. నాగేశ్వరరావుగారు మనదేశ స్వరాజ్య సంపాదనకు కృషి చేసిన స్వాతంత్ర్య వీరుడు. విదేశ ప్రభుత్వాన్ని ధిక్కరించి, చెరసాలకు వెళ్ళి, లాఠీ దెబ్బలకు గురియై దేశస్వాతంత్ర్య సమరంలో పాల్గొని, గాంధీ మహాత్మునికి అనుచరుడుగా ఉండిన త్యాగమూర్తి నాగేశ్వరరావు. లక్షలు సంపాదించి, లక్షలు ఖర్చుచేసి ప్రజలకు ఉపయోగకరమైన కార్యక్రమాలకు అన్నింటికి తన ఔదార్యాన్ని విస్తరించిన మహనీయ మూర్తి నాగేశ్వరరావు. తెలుగు భాషాసంస్కృతులకు ఆ రోజులలో వెన్నెముకగా నిలిచిన ఉదారచరితుడు నాగేశ్వరరావు. ఆ రోజులలో ఆయన సహాయము పొందని మంచిపని యేమీ లేదు. అందుచేతనే ఆయనను ప్రజలు దేశోద్ధారకుడని పిలిచినారు. గాంధీ మహాత్ముడు ఆయనను విశ్వదాతయని ప్రశంసించినాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను కళాప్రపూర్ణునిగా సత్కరించినది.

అటువంటి నవ్యాంధ్ర నిర్మాతకు బొంబాయి పట్టణముతోగల సంబంధం కూడ సర్వదా చరిత్రలో నిలిచిపోయే సత్యం. ఎందుకనగా ఆయన తొమ్మిదవ

ఆగస్ట్ 1908 నాడు వారపత్రికగా ప్రారంభించి, నిర్వహించిన ఆంధ్రపత్రిక జన్మ స్థానము బొంబాయి నగరమే. కావున ఆయనను సంస్మరించే ఈ సభ బొంబాయిలో జరగడం, ఈ సభలో తెలుగు పత్రికా రచన — దాని వికాసము, అది పాటించిన ఉన్నత సంప్రదాయాలను గూర్చి నాలుగు మాటలు చెప్పుకోవడం సందర్భ శుద్ధీ, ఔచిత్యమూ, శోభస్కరమూ. ఈ నాలుగు మాటలు చెప్పమని నన్ను ఆహ్వానింపడంలో తెలుగుసంస్థ ఉద్దేశ్యమేమిటో నాకు తెలియదు. కాని, నా శక్తి సామర్థ్యాల పరిమితులు నాకు బాగా తెలిసిన సత్యమే. అయినప్పటికిని ఆ మహనీయ మూర్తిని సంస్మరించే అవకాశాన్ని పోగొట్టుకోవడం ఇష్టంలేక, సుమారు పదహారు సంవత్సరాలపాటు తెలుగు దినపత్రికయైన 'గోలకొండ'తో నాకు ఉండిన సన్నిహిత సంబంధాన్ని దృష్టిలో పెట్టుకొని, కొంతకాలం సాహిత్య మాస పత్రికగా 'శోభ'ను నడిపిన సంఘటనను సంస్మరించి, సుమారు తొమ్మిది, పది సంవత్సరాల బాలకునిగా వరంగల్ నగరంలో నాగేశ్వరరావుగారిని ఒక సమావేశంలో చూసిన దృశ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని, ఈ సాహసానికి నేను పూనుకున్నాను. నా యీ కార్య నిర్వహణములోని లోటుపాట్లకు అంతర్జాతీయ సంస్థ బాధ్యత వహించవలసి ఉంటుంది.

తెలుగు ప్రజల సామాజిక, సాంస్కృతిక రాజకీయ, జీవితాన్ని ప్రభావితం చేసిన తెలుగు పత్రికలకు, పత్రికారచనకు ఒక నూరు సంవత్సరాల పైబడిన ఉజ్వలమైన చరిత్ర ఉన్నదని చెప్పవలెను. ఈ నూరు సంవత్సరాలకు పైబడిన కాలంలో తెలుగుపత్రికలు నిర్వహించిన పాత్ర మహెూదాత్తమైనది. దేశాన్నీ, ప్రజలనూ మేలుకొల్పి ముందుకు నడిపించిన ఉద్యమాలకు తెలుగు పత్రికలు వెన్నెముకగా ఉండినవి. ఒకమారు ప్రారంభదశను పరిశీలించినప్పుడు భారత దేశంలోని అన్ని భాషలలోవలెనే తెలుగులో కూడా పత్రికలను స్థాపించి నిర్వహించిన గౌరవం క్రైస్తవ మిషనరీలకే యీయవలసి ఉన్నది. అయితే క్రైస్తవ మిషనరీల మతప్రచారాన్ని అరికట్టి, భారతీయ సంస్కృతిని ప్రబోధించవలెననే ఉద్దేశ్యము కూడా మరొకవైపు దేశభాషలలో పత్రికలను స్థాపించి నిర్వహించ డానికి కారణభూతమైనది. ఇతర భాషలలోవలెనే తెలుగులో కూడా అచ్చు యంత్రశాలల అవతరణ పత్రికారచనను ప్రోత్సహించినది. ఈ అచ్చు యంత్ర శాలలను కూడా మొదటిసారిగా స్థాపించి నడిపినవారు క్రైస్తవ మిషనరీలే. అందు చేత ముద్రణాలయాల స్థాపన పత్రికల నిర్వహణకు ముఖ్య ప్రోత్సాహకారణ మైనది. ఈ విషయంలో పరిశోధన చేసిన విద్వాంసుల అభిప్రాయం ప్రకారం 1746-47 ప్రాంతాలలో తెలుగు ముద్రణా కార్యక్రమము ప్రారంభమైనదని చెప్పవలెను. అయితే యీ అచ్చు తెలుగు లిపిలోనా లేక ఇంగ్లీషు లిపిలోనా అనే ప్రశ్నకు సరియైన సమాధానము లేదు.

తెలుగులో మొట్టమొదట అచ్చువేసిన పుస్తకం బైబిల్ అని అభిజ్ఞుల అభిప్రాయం. మరికొందరు పరిశోధకుల అభిప్రాయం ప్రకారం తెలుగులో ముద్రణ 1806లో ప్రారంభమైనప్పటికిని 1830 వరకు ఎక్కువగా అభివృద్ధి పొందలేదు. 1838లో 'సత్యదూత' అనే ఒక తెలుగు పత్రికను బళ్ళారినుండి క్రైస్తవ మిషనరీలు ప్రకటించినట్లు ఒక అభిప్రాయము కలదు. ఈ సంవత్సరాల నిర్ణయం ఏమైనప్పటికిని 1830 తరువాత తెలుగులో ముద్రణ కార్యకలాపాలు ముందంజ వేసి పత్రికల అవతరణను ప్రోత్సహించినవి. మొట్టమొదటి దశలో దేశభాషలలో పత్రికా రచనను అప్పటి ప్రభుత్వాలు ఎక్కువగా హర్షించినట్లు కనబడదు. ప్రజలలో జాతీయ భావాలు, స్వాతంత్ర్య కాంక్షలు పత్రికలవలన వ్యాప్తి చెందగలవనే ఉద్దేశంతో దేశభాషల పత్రికలపట్ల ప్రభుత్వము చూపవలసినంత సానుభూతి చూపలేదని కూడా చెప్పడానికి మనముందు ప్రబలమైన ఆధారాలున్నవి. ఒక్కమారు వెనుదిరిగి చూస్తే క్రైస్తవ మిషనరీల ప్రచారం, ఆ ప్రచారాన్ని ఎదుర్కొనవలెననే సమకాలిక విద్వాంసుల పట్టుదలా, కృషీ, విదేశ పరిపాలన పట్ల ప్రాతికూల్యం, స్వరాజ్యాన్ని సాధించవలెననే కోరిక, సమాజం అభివృద్ధి చెందవలెననే ఆశయం మన పత్రికల ఆవిర్భావ వికాసాలకు దోహదం చేసినవి. మహాకవి శ్రీశ్రీ ''ఏ జాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం''అన్నాడు కాని, భారత స్వాతంత్ర్యానికి పూర్వం దేశభాషల పత్రికల చరిత్ర మాత్రం నిస్సందేహంగా మనకు గర్వకారణమని చెప్పవలెను. కందుకూరి వీరేశలింగం పంతులువంటి సంఘసంస్కర్త, గాడిచర్ల హరి సర్వోత్తమరావువంటి స్వాతంత్ర్య యోధుడు, కాశీనాధుని నాగేశ్వరరావు వంటి దేశనాయకుడు, ముట్నూరు కృష్ణారావు వంటి మేధావి తెలుగులో పత్రికారచనను ప్రారంభించి ప్రోత్సాహించినారనీ, వారు తెలుగు పత్రికారచనకు ప్రారంభకులనీ చెప్పితే మన పత్రికల ఉన్నత సంప్రదాయాలకు ఉత్తమ ఉదాహరణ కాగలదు.

అన్ని భాషలలోవలెనే తెలుగులో కూడా ముద్రణ సౌకర్యాల విస్తరణలో పత్రికల ప్రారంభ వికాసాలు ముడిపడి ఉన్నవి. తెలుగులో ముద్రణ సౌకర్యాలు 18వ శతాబ్దం చివరిభాగంలోను, 19వ శతాబ్దం తొలిభాగంలోను ప్రారంభమై వ్యాప్తి పొందినవి. 1801వ సంవత్సరం వరకు తెలుగులో చాలా పుస్తకాలు ప్రచురితమైనట్లు, తెలుగులో ఒక వ్యాకరణం కూడా ప్రకటితమైనట్లు మనకు తెలుస్తున్నది. ఉద్దేశ్యమేమైనప్పటికిని ఈ కృషికి ప్రారంభకులు క్రైస్తవ మిషనరీలే. ఈ ప్రసంగంలో మనము ప్రస్తావించవలసిన అంశము తెలుగు పత్రికలు, వాని ప్రారంభ వికాసాలను గూర్చియే. అందుచేత ముద్రణ సౌకర్యాలు, పుస్తక ప్రకటనమును గూర్చి చెప్పిన మాటలు ప్రాస్తావికమైనవి మాత్రమే. తెలుగులో అచ్చు అయిన పుస్తకాలను చూచి, పత్రికలు గూడా నడుపవలెననే కోరిక సహజంగా

ఆనాటి విద్యార్థికులలో ఉత్పన్నమైనది. 1832వ సంవత్సరంలో మదరాసులోని కొందరు ప్రముఖులు తెలుగు, మళయాళ భాషలలో 'మదరాసు క్రానికల్' అనే పేరుతో ఒక పత్రికను స్థాపించడానికి ప్రభుత్వాన్ని అనుమతి కోరినట్లు మనకు తెలుస్తున్నది. కాని ఈ అనుమతి దొరికినట్లు మనకు కానరాదు. బహుశా అప్పటి ప్రభుత్వం దేశభాషలలో పత్రికలు ప్రకటితమైతే, అవి ప్రజలలో జాతీయ భావాలను వ్యాప్తి చేయడానికి ఉపయోగపడగలవని భావించినట్లు తోస్తున్నది. అంతేకాదు; సైనికులలో కూడా తిరుగుబాటు భావాలు ఈ పత్రికలవల్ల కలుగ వచ్చునని అప్పటి ప్రభుత్వం భావించినట్లు కూడా నిదర్శనాలు మనకు కనిపిస్తున్నవి.

1838వ సంవత్సరములో తెలుగులో "వృత్తాంతిని" అనే వారపత్రిక మొదటి పత్రికగా ప్రకటితమైనట్లు సుప్రసిద్ధ పండితులు, పరిశోధకులు శ్రీ ఆరుద్ర గారు తెలుపుతున్నారు. మండిగల వెంకటరాయ శాస్త్రి అనే విద్వాంసుడు ఈ పత్రికకు సంపాదకుడుగా ఉండినట్లు, ఆయన బహుశ కడప జిల్లా వాడైనట్లు, ఈ పత్రికలో ఉన్నతశ్రేణి వ్యాసాలు ప్రకటితమైనట్లు శ్రీ ఆరుద్ర గారు ఒక వ్యాసంలో తెలిపినారు. అప్పటివరకు ఇంగ్లీషు పరిపాలన మనదేశంలో కొంత స్థిరమైనది. అందుచేత ఇంగ్లండు రాజుల జీవితాన్ని గూర్చి ఈ పత్రికలో అప్పు డప్పుడు కొన్ని విషయాలు వెల్లడి చేసినట్లు తెలుస్తున్నది. అంతేగాక, ఆనాటి విద్వాంసులు ఈ పత్రికలో చారిత్రక విషయాలను గూర్చి వ్రాసినట్లుకూడా తెలు స్తున్నది. ఈ పత్రికకు వ్రాసిన విద్వాంసులలో 'బేతపూడి సుందరరావు' ఆ రోజు లలో సుప్రసిద్ధులైన తెలుగు పండితులు. ఈయన ఆ కాలంలో 'ఫోర్టుసెంటు జార్జ్' కళాశాలలో ఉపాధ్యాయులుగా పనిచేసినారు. ఆనాటి సాంఘిక దురాచారా లను గూర్చి కూడా ఈ పత్రికలో తీవ్రమైన విమర్శలు జరిగినట్లు తెలుస్తున్నది. ఇటువంటి విమర్శలకు పాత్రమైన దురాచారాలలో, పెండ్లిండ్లలో జరిగే దుబారా ఖర్చు, బోగము మేళాలు మొదలయినవి ముఖ్యమైనవి. అందుచేత ఈ పత్రిక ప్రజలలో కొంత ప్రచారము పొందినది. ఈ ప్రచారము ప్రభుత్వానికి ఆందోళన కలిగించినట్లు కూడా తెలుస్తున్నది. అప్పుడే తెలుగు నేర్చుకొన్న ఇంగ్లీషు ఉద్యో గులు కూడా ఈ పత్రికా పాఠకులలో ముఖ్యులుగా ఉండిరి. ఒకానొక ఇంగ్లీషు ఉద్యోగి ఈ పత్రికల్లో ప్రచురితమైన వార్తలను, వ్యాఖ్యానాలను గూర్చి ప్రస్తా విస్తూ గవర్నర్ గారిచ్చిన విందులను గూర్చి, రాణుల, రాణుల అంతఃపురాలను గూర్చి ఈ పత్రికలో సమాచారం ప్రకటితమైనట్లు తెలియజేసినారు. తెలుగుభాషకు మహోపకారం చేసిన సి. పి. బ్రౌన్‌గారు సేకరించిన తెలుగు గ్రంథాల వ్రాత ప్రతులను గూర్చి కూడా ఈ పత్రికలో సమీక్షలు జరిగినట్లు మనకు తెలుస్తు న్నది. ఏమైనప్పటికిని ఈ పత్రిక కొన్ని సంవత్సరాలు నడిచి 1841లో ఆగి పోయినది.

ఈ వృత్తాంతిని తరువాత తెలుగులో ప్రకటితమైన మరొక వారపత్రిక 'వర్తమాన తరంగిణి' 1842వ సంవత్సరములో ప్రారంభమైనట్లు తెలుస్తున్నది. ఆశ్చర్యమేమనగా ఈ పత్రిక సంపాదకుడు తెలుగు తెలియని సయ్యద్ రహమతుల్లా అనే ముస్లిం పౌరుడు. ఆయన మదరాసు నగరంలోని మౌంట్‌రోడ్డుమీద ఉన్న తన ముద్రణాలయంలో ఈ పత్రికను అచ్చు వేసినాడు. ఈ పత్రిక ప్రకటించడానికి కారణాలను తెలుపుతూ 'వృత్తాంతిని' ఆగిపోయినందువలన మరొక తెలుగు పత్రిక అవసరమైనదని ఆయన పేర్కొన్నాడు. ''మేము ఎక్కువ సంపన్నులము కాకపోయినప్పటికిని, తెలుగులో తగినంత వైదుష్యము లేకపోయినప్పటికిని, హిందువులతో స్నేహ సహకారాలు వృద్ధి పొందించుకోవడానికి ప్రజలలో ప్రచారం కలిగించుకోవడానికి, తెలుగు టైపులను, పరికరాలను సేకరించుకొని కొన్ని నూర్ల రూపాయలను ఖర్చు చేయడానికి సిద్ధమైనాము'' అని ఆయన తెలిపినాడు. ఆయన అనుకున్నట్లుగానే తెలుగు మాట్లాడే హిందువులలో ఈ పత్రికకు బాగా ప్రచారం వచ్చింది. పువ్వాడ వెంకటరావు అనే విద్వాంసుడు ఈ పత్రికకు పది సంవత్సరములకు పైగా సంపాదకుడుగా పనిచేసినాడు. ఆయనకు ముందు వెలువడిన 5, 6 సంచికలకు సంపాదకులెవరో తెలియదు. తన మొదటి సంపాదకీయంలో తాము ఈ పత్రిక మతసంబంధమైన వివాదాలకుగానీ, విమర్శలకుగానీ, విద్వేష ప్రచారానికి గాని చోటు ఈయదని, దుష్టమైన విషయాలను గూర్చి ప్రస్తావించదని ఈ సంపాదకుడు తెలిపినాడు. ఆయన ఈ పత్రికను సులభమైన, సరళమైన భాషలో నడిపినట్లు, ఆయన వాక్యరచనమీద ఇంగ్లీషు భాషాప్రభావం గోచరించినట్లు, ఆ కాలంలోని ఇంగ్లీషు పత్రికల ఒరవడిలోనే ఈ పత్రిక కూడా నడచినట్లు పరిశోధకులు అభిప్రాయపడినారు. వృత్తాంతిని పత్రికను ఆదరించిన వారందరు కూడా ఈ 'వర్తమాన తరంగిణి'ని ఆదరించినట్లు తెలుస్తున్నది. ఈ పత్రికలో వ్రాసినవారు "జనమనోరంజకుడు, లోకోపకారి, న్యాయవాది, సకలజన సమ్మతుడు, వికటసంకటకవి" అనే ప్రచ్ఛన్న నామాలతో వ్రాసినట్లు తెలుస్తున్నది. ఈ పత్రికను గూర్చిన మరికొన్ని వివరాలు గమనించదగినవి. ఈ పత్రిక 1/8 డెమ్మీ సైజులో, 12 పేజీలతో, పేజీకి రెండు కాలములతో, కొన్నినాళ్ళు బుధవారాలలో, మరికొన్నినాళ్ళు గురువారాలలో ప్రకటితమైనది. ఈ పత్రికలో ప్రకటన చార్జీలు ఒక కాలానికి మూడణాలు. అనాటి ప్రభుత్వ గెజెట్‌లో ప్రకటితమైన ముఖ్య విషయములన్నీ ఈ పత్రికలో చేరుస్తుండేవారు. పదిమంది చందాదారులను చేర్చిన వారికి ఒక పత్రిక ఉచితంగా లభించేది. అనాటి సాంఘిక దురాచారాలు ఇంగ్లీషు ఉద్యోగులు చేసిన అవినీతికరమైన హద్దుమీరిన చర్యలు, సివిలియన్ ఉద్యోగులు సాహిత్యానికి, కళలకు ఇచ్చిన ప్రోత్సాహం, మిషనరీలు క్రైస్తవ మతానికి పరివర్తనం చేయడంలో అవలంబించిన మార్గాలు, విద్యాసంస్థల వ్యవహారాలు, సమస్యాపూరణలవంటి సాహిత్య విషయాలు, ఈ 'వర్తమాన

తరంగిణి'లో ప్రముఖంగా కనిపించేవి. ప్రకటనలలో కూడా సాహిత్యానికి, చరిత్రకు సంబంధించిన ప్రభావం గోచరించేది.

1851వ సంవత్సరము జూలై నెలలో ఈ పత్రికలో ప్రకటితమైన ఒక వ్యాసాన్ని గూర్చి ప్రస్తావిస్తూ సి. పి. బ్రౌన్ "ఈ వ్యాసంలోని కొన్ని సంగతులు హిందువులలో వివేకవంతమైన ప్రస్తుత ప్రభుత్వాన్ని గూర్చి వ్యాపించియున్న అపోహలకు, భ్రమలకు తార్కాణమని, ఇందులో కృత్రిమమైన శైలి ఉపయోగించినారని, వ్యవహారంలో లేని పదజాలాన్ని, వర్ణక్రమాన్ని ఉపయోగించినారని" తన లేఖలలో ఒకచోట వ్రాసినాడు. 'వర్తమాన తరంగిణి' సంపాదకుడైన పువ్వాడ వెంకటరావు గారికి, సి. పి. బ్రౌన్‌కు మధ్య కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచినట్లు కూడా మనముందు ఉదాహరణలున్నవి. ఈ పత్రిక 1852 వరకు బాగా నడిచినట్లు తెలుస్తున్నది. కాని 1852 తరువాత ఈ పత్రిక ఎంత కాలం నడిచిందో తెలియదు.

ఈ విధంగా మదరాసులో 'వర్తమాన తరంగిణి' బాగా ప్రచారంలోకి వస్తుండగా మచిలీపట్టణం నుండి 1848వ సంవత్సరంలో 'హితవాది' అనే తెలుగు సచిత్ర మాస పత్రిక ప్రారంభమైనది. ఈ పత్రికా సంపాదకుడు ఎడ్మండ్ షార్కె. ఆయన ఆంగ్లో ఇండియన్, మచిలీపట్టణంలోనే జన్మించెను. ఈ పట్టణంలోనే క్రైస్తవ మిషనరీగా ఆయన పనిచేసినాడు. అప్పటివరకు మచిలీపట్టణంలో అచ్చు సౌకర్యాలు లేనందున ఈ పత్రికను మదరాసులోనే అచ్చు వేసినారు. షార్కె స్వయంగా రచయిత. హిందూస్త్రీల స్థితిగతులను అభివృద్ధిచేసే ఆశయంతో కొన్ని కథలు వ్రాసినాడు. మరికొన్ని పుస్తకాలను ఇంగ్లీషునుండి తెనిగించినాడు. 'హితవాది' పత్రిక కాపీలు కొన్ని ఈనాటికి లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నట్లు తెలుస్తున్నది, ఆ రోజులలో ముద్రణ సౌకర్యాలు మదరాసులో కాక మరి రెండుచోట్ల మాత్రమే ఉండేవి. ఒకటి బళ్ళారి, మరొకటి విశాఖపట్టణం. 1835వ సంవత్సరం ప్రాంతంలో బళ్ళారిలో మొట్టమొదటి తెలుగుపత్రిక 'సత్యదూత' అనే పేరుతో వెలువడినట్లు ఒక అభిప్రాయం కలదు. తరువాత ఇదే పేరుతో మదరాసునుండి క్రిశ్చియన్ లిటరరీ సొసైటీవారు 1888 నుండి ఒక పత్రికను నడిపినట్లు తెలుస్తున్నది. ఏమైనప్పటికిని ఆ రోజులలో తెలుగు పత్రికలకు ప్రధాన కేంద్రము మదరాసు నగరమే. 1836వ సంవత్సరములోనే మదరాసులో 20 ముద్రణాలయాలు ఉన్నట్లు తెలుస్తున్నది. ఇవన్నీ వ్యాపారపద్ధతిలో నడిపిన ముద్రణాలయాలు. తెలుగు భాషలో వ్యాకరణ, ఛంద శ్శాస్త్రాలు, వాచకాలు, నిఘంటువులు, కథలు మొదలయిన అనేక గ్రంథాలు ఈ అచ్చు శాలలలో ముద్రించినవే. పురాణం హయగ్రీవ శాస్త్రిగారి తండ్రియైన పురాణం నారాయణ

శాస్త్రిగారు మదరాసులో మొట్టమొదట తెలుగు ముద్రణాలయాన్ని స్థాపించినట్లు తెలుస్తున్నది. పూదూరు శ్రీరామశాస్త్రిగారు రచించిన 'పెద్దబాలశిక్ష' 1847లో ఈ ముద్రణాలయంలోనే ప్రచురితమైనది. వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు కూడా ఇదేకాలంలో తెలుగు పుస్తకాల ప్రచురణ కార్యక్రమాలను చేపట్టి ఒక అచ్చుశాలను క్రమక్రమంగా స్థాపించినారు. వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు తెలుగు భాషావికాసానికి చేసిన కృషి సుప్రసిద్ధమైనది. తరువాత చిన్నయసూరి 1853వ సంవత్సరములో ఒక తెలుగు ముద్రణాలయాన్ని ప్రారంభించి నిర్వహించినట్లు తెలుస్తున్నది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారుకూడా మదరాసులో తెలుగు ముద్రణాలయాన్ని "సంజీవనీ ముద్రాక్షరశాల" అనే పేరుతో స్థాపించి నిర్వహించినారు. వావిళ్ళ రామశాస్త్రులు గారి అల్లుడు చదలవాడ సుందర రామశాస్త్రిగారు ఈ కాలంలోనే మరొక ముద్రణాలయాన్ని స్థాపించి నిర్వహించినారు.

ఈ విధంగా ముద్రణాలయాలు పెట్టిన చాలామంది తెలుగు పత్రికలను కూడా నడిపినారు. ఆ రోజులలో తెలుగు ముద్రణశాలను పెట్టవలెనంటె రెండు వేల రూపాయలు ఖర్చు చేయవలసి వచ్చేది. ఆనాటి పరిస్థితులలో ఇది చాలా గొప్ప మొత్తమే. ఆనాటి పండితులు నడిపిన తెలుగు పత్రికలలో చాలామట్టుకు గ్రాంథిక భాషనే ఉపయోగించేవారు. సరళమైన భాషను పత్రికలలో ఉపయోగించవలెననే ఉద్దేశ్యం కలిగినవారు వీరేశలింగం పంతులుగారే. ఆయన 1874లో "వివేక వర్ధని" అనే మాసపత్రికను ప్రారంభించి అనేక సంవత్సరాలు నడిపిరి. నిజానికి ఆధునిక పద్ధతిలో నడిచిన మొట్టమొదటి పత్రిక 'వివేక వర్ధని' అనే చెప్పవలెను. వివేకవర్ధనితోపాటు "హాస్యసంజీవని, సతీ హితబోధిని, సత్య సంవర్ధిని" అను పత్రికలను గూడా వీరేశలింగంగారు నడిపినారు. ఇవన్నీ స్పష్టమైన ఆదర్శాలతో, సులభశైలిలో సమకాలిక సమాజాన్ని గూర్చి చేసిన వ్యాఖ్యలతో నడిచినవి. ఈ పత్రికల నిర్వహణలో వీరేశలింగంగారు అనేక కష్టాలను ఎదుర్కొన్నట్లు తమ స్వీయచరిత్రలో వ్రాసినారు. అందుచేత ఆధునిక పత్రికా రచనకు కూడా వీరేశలింగంగారు జనకులని చెప్పితే అతిశయోక్తి కాదు.

19వ శతాబ్దం రెండవ భాగంలో అనగా, 1850-1900 మధ్యన క్రమక్రమంగా పత్రికల సంఖ్య అభివృద్ధి చెందింది. క్రైస్తవ మిషనరీలతో పాటు సంస్కృతాంధ్రాలలో గట్టి పాండిత్యంగల విద్వాంసులు ముద్రణాలయాలను నడుపడానికి, పత్రికలను నిర్వహించడానికి ముందుకు వచ్చినారు. వర్తమాన తరంగిణిని గూర్చి ఇంతకు ముందు విపులంగా తెలిపినాను. 'సంవాద కౌముది ఒకటి ఈ కాలంలో నడిచినట్లు బ్రౌన్‌గారు తమ నిఘంటువులో కౌముది అనే

పదానికి అర్థం ఇచ్చే సందర్భంలో తెలిపినారు. 1862వ ప్రాంతంలో క్రైస్తవ మిషనరీలు 'దినవర్తమాని' అనే వారపత్రికను కూడా కొంత కాలం మదరాసు నుండి నడిపినారు. ఈ పత్రికలో వ్యావహారిక భాషలోనే వార్తలు ప్రకటించి నారు. ముదలి త్యాగయ్య అనే పండితుడు 1863లో 'యక్షిణి' అనే పత్రికను బళ్ళారిలో స్థాపించి నడిపినాడు. 1864-67 మధ్యన 'సుజన రంజని' అనే పత్రి కను వి. కృష్ణమాచార్యులు, బి. సీతారామాచార్యులు, కె. సుబ్బరాయులునాయుడు సంయుక్త సంపాదకత్వంలో నడిపినారు. ఈ ముగ్గురులోని సీతారామాచార్యుల వారు తరువాత శబ్ద రత్నాకరానికి గ్రంథకర్తయైన బహుజనపల్లి సీతారామా చార్యులే. ఈ సుజన రంజని పత్రికలో చిన్నయ సూరిగారి కొన్ని వ్యాసాలు ప్రక టితమైనవి. 'తత్వబోధిని' అనే పత్రిక 1864-70 మధ్యన బ్రహ్మసమాజ ఆద ర్శాలతో ప్రకటితమైనది. 1870లో 'గోదావరిమండల విద్యాప్రబోధిని'అనే పత్రిక రాజమండ్రి నుండి ప్రకటితమైనది. ఈ పత్రికకు వీరేశలింగం గారు కూడా వ్రాస్తుండేవారు. 1871వ ప్రాంతంలో కొక్కొండ వెంకట రత్నం పంతులుగారు 'ఆంధ్రభాషా సంజీవని' అనే పత్రికను ప్రారంభించిరి. ఈ పత్రికలో శుద్ధ గ్రాంథిక భాషనే ఉపయోగించినారు. ఇంగ్లీషులోని సాంకేతిక పదాలకు సమా నార్థకాలు కఠినమైన పదాలుగా ఈ పత్రికలో ఉపయోగించబడినవి. సాహిత్య విషయాలకే కాక సాంఘిక విషయాలకు కూడ ఈ పత్రిక ప్రాధాన్యమిచ్చేది. పుస్తకాల సమీక్షలు కూడా ఈ పత్రికలో ప్రకటితమైనవి. అప్పుడప్పుడు ప్రత్యేక సందర్భాలలో విశేష సంచికలను కూడ ఈ పత్రిక ప్రకటించినది. మొదట్లో వీరేశలింగం పంతులుగారు ఈ పత్రిక నిర్వహణతో సహకరించి, ఈ పత్రికను ప్రశంసించి కొన్ని వ్యాసాలను వ్రాసిరి. తరువాత వారి ఇద్దరి మధ్య అభిప్రాయ భేదాలు వచ్చినవి. వితంతు వివాహం, స్త్రీ విద్య, సంఘ సంస్కరణ మొదలయిన వానిమీద కలిగిన అభిప్రాయ భేదాలతోపాటు సాహిత్య విషయా లలో కూడ అభిప్రాయ భేదాలు వీరిద్దరి మధ్య కలిగినవి.

1872లో ఉమారంగ నాయకులు నాయుడు అనేవారు తాము కొంత కాలము నుండి నిర్వహిస్తున్న జైనసమాజం అనే సంస్థ పక్షాన 'పురుషార్థ ప్రదా యని' అనే పత్రికను మచిలీపట్టణం నుండి ప్రారంభించిరి. ఈ పత్రికలో వార్త లకు, వ్యాఖ్యలకు, సాహిత్యానికి, జానపద వాఙ్మయానికి, చేతి పరిశ్రమలకు, దేశచరిత్రకు, జీవిత చరిత్రకు, న్యాయశాస్త్రమునకు, సైన్సుకు ఇంకా అనేక విష యాలకు ప్రాధాన్యమీయబడినది. గొప్ప ఆదర్శాలతో అనేక విషయాలకు ప్రాధాన్యమిస్తూ ఈ పత్రిక నడిచినది. సంఘసంస్కరణకు, అవినీతి నిర్మూలనకు ఈ పత్రిక ప్రాధాన్యమిచ్చేది. క్రైస్తవుల మతపరివర్తన కార్యక్రమాలను ఈ పత్రిక వ్యతిరేకించినది. దాదాభాయి నౌరోజీ గారివంటి నాయకుల ఉపన్యాసాలను

ఈ పత్రిక ప్రచురించి జాతీయ భావాల ప్రచారానికి తోడ్పడింది. వీరేశలింగం పంతులుగారు అప్పుడప్పుడు ఈ పత్రికకు వ్రాస్తుండేవారు. వివేకవర్ధనిని గూర్చి ఇంతకు ముందు ప్రస్తావించినాను. వీరేశలింగం గారి సంఘ సంస్కరణ ఉద్యమానికి వివేకవర్ధని పెట్టని కోటగా ఉండేది. సాంఘిక దురాచారాలను, అవినీతిని విమర్శించి ఈ పత్రిక దేశంలో ఒక జాగృతిని కలిగించినది. ఈ పత్రిక సుమారు 16 సంవత్సరాలు నడిచినది. 'సత్యసంవర్ధని, సత్యవాదిని' అనే మరో రెండు పత్రికలను కూడా వీరేశలింగం పంతులు గారు 1891–1905 సంవత్సరాల మధ్య నడిపినారు. 1885లో ఎ. సి. పార్థసారధి నాయుడుగారు 'ఆంధ్ర ప్రకాశిక' అనే పత్రికను ప్రారంభించినారు. అప్పటి ప్రభుత్వ విధానాలను, పరిపాలనలోని లోపాలను, అవినీతిని ఈ పత్రిక ప్రజల ముందు పెట్టి వాని నిర్మూలనకు కృషి చేసినది. ఈ పత్రికా సంపాదకులు లోకమాన్య బాలగంగాధర తిలక్‌గారి అనుయాయులు. 45 సంవత్సరాలు నడిచిన ఈ పత్రిక ప్రజలలో మంచి వ్యాప్తి పొంది, స్వరాజ్య ఉద్యమాన్ని, స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరిచినది. 'శశిలేఖ' అనే పత్రికను గట్టుపల్లి శేషాచార్యులుగారు 1894లో వారపత్రికగా ప్రారంభించి తరువాత ద్వైవారపత్రికగా నడిపిరి. 1896లో దేవగుప్తం శేషాచలపతిగారు బెజవాడనుండి 'దేశాభిమాని' అనే పత్రికను ప్రారంభించిరి. ఈ విధంగా ఇన్ని పత్రికలు 19వ శతాబ్దంలో బయలుదేరి తెలుగులో పత్రికారచనకు బలమైన పునాదులు నిర్మించి, ఉత్తమ సంప్రదాయాలను నెలకొల్పినవి. భాషకు, దేశానికి, ప్రజలకు సేవ చేయవలెననే మహోన్నత లక్ష్యాలతో ఈ పత్రికలు నడిచినవి. సంఘ సంస్కరణ ఉద్యమాన్ని ఈ పత్రికలు బలపరిచినవి. ఈ పత్రిక సంపాదకులలో చాలామంది గొప్ప విద్వాంసులు, బహుగ్రంథ రచయితలు. జాతీయ భావాలు ప్రజలలో వ్యాపింపజేసి దేశాన్ని జాగృతం చేయడానికి ఈ పత్రికలు మార్గదర్శకమైన కృషి చేసినవి. ఈ విధంగా 19వ శతాబ్దంలో పత్రికారచన సాగినది. ఇది మహోజ్వలమైన అధ్యాయము.

20వ శతాబ్దం ఆరంభంలో తెలుగు పత్రికా రచన రంగంలో క్రొత్త మలుపు తిరిగింది. 19వ శతాబ్దం చివరలో దేశంలో జాతీయ భావాలు బాగా ప్రబలినవి. ప్రజలలో సాంఘిక చైతన్యము, రాజకీయ చైతన్యము వ్యాప్తి చెందినవి. విదేశప్రభుత్వాన్ని తొలగించి స్వరాజ్యం సాధించవలెననే గాఢమైన కాంక్ష దేశంలో సర్వత్రా కనిపించింది. భారతజాతీయ కాంగ్రెస్ ఉద్యమం ఆసేతు హిమాచలం విజృంభించింది. దాదాభాయి నౌరోజీ, బాలగంగాధరతిలక్, గాంధీమహాత్ముడు మొదలయిన నాయకుల ప్రబోధము పల్లె పల్లెలకు ప్రాకిపోయినది. ఇంగ్లీషు భాషను చదువుకున్న విద్యాధికుల సంఖ్య పెరిగినది. వ్యావహారిక భాషలో రచనలు చేయవలెననే ఉద్యమం కొనసాగినది. సామ్యవాద

భావాలు తలయెత్తి యువకులను ఆకర్షింపసాగినవి. సామాజికంగా సమాజంలో స్త్రీ పురుషులు సమానులనే భావం ప్రబలసాగింది. ఈ పరిస్థితులన్నీ 20వ శతాబ్దంలో పత్రికా రచనను ప్రోత్సహించినవి. అంతకు ముందు చిన్న అచ్చు శాలలు, అవీ కొన్ని పట్టణాలలోన మాత్రమే ఉండినవి. 20వ శతాబ్దం ప్రారంభంనుంచి అచ్చుశాలలు అన్ని పట్టణాలలో అవతరించి పెద్దయెత్తున ముద్రణ కార్యక్రమాల నిర్వహణ ప్రారంభమైనది. సాంఘిక భాషా రంగాలకు మాత్రమే పరిమితమైన పత్రికలు, రాజకీయరంగానికి కూడ విస్తరించి ముందడుగు వేసినవి.

ఇటువంటి పరిస్థితులలో 1902వ సంవత్సరాన కృష్ణాడిస్ట్రిక్ట్ అసోసియేషన్ పక్షాన మచిలీపట్టణంలో కృష్ణాపత్రిక ప్రారంభమైనది. అనాటి దేశనాయకులలో ప్రముఖులు, న్యాయవాద శిరోమణులు అయిన దేశభక్త కొండా వెంకటప్పయ్య గారు, దాసు నారాయణరావుగారు అనే మిత్రునితో కలసి ఈ పత్రికకు సంపాద కులుగా ఉండిరి. ఈ పత్రిక వందేమాతరం ఉద్యమాన్ని బలపరచినది; రైతులహక్కుల కొరకు పోరాడినది; ప్రభుత్వంలోని అవినీతిని ప్రజలకు తెలియజేసి తీవ్రంగా విమర్శించినది. 1907వ సంవత్సరంలో కొండా వెంక టప్పయ్యగారు న్యాయవాద వృత్తి అవలంబించడానికి గుంటూరు వెళ్లిపోయి నందున ముట్నూరి కృష్ణారావుగారు ఈ పత్రికకు సంపాదకులైరి. తెలుగు పత్రికా రచనారంగంలో ఇదొక చరిత్రాత్మకమైన ఘట్టం. ముట్నూరి కృష్ణారావు గారు తెలుగు పత్రికా సంపాదకులలో సర్వవిధాల అగ్రగణ్యుడు. అయన గొప్ప విద్వాంసుడు, సాహిత్య విమర్శకుడు, కళోపాసకుడు, వేదాంతి, విజ్ఞాని, మేధావి. అన్నిటికన్న మిన్నగా దేశభక్తుడు. కొన్నిసార్లు కత్తికన్నా పదునుగా ఉండిన ఆయన కలం జాతీయోద్యమాన్ని, స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరిచినది. ఆయన తన సంపాదకీయాలలో వెల్లడి చేసిన స్వాతంత్ర్య భావాలు సకలాంధ్ర దేశాన్ని ఉత్తేజ పరిచినవి. తత్ఫలితంగా ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసిన సంఘటనలు కూడా ఉన్నవి. యువకులకు, రచయితలకు, కళోపాసకులకు కృష్ణాపత్రిక నూతనోత్సాహాన్ని కలగజేసింది. ఎందరో దేశనాయకులను కృష్ణా పత్రిక సృజించినది. కృష్ణాపత్రిక అవతరణతో పత్రికారంగంలో సువర్ణాక్ష రాలతో లిఖించదగిన నూతన అధ్యాయం ప్రారంభమైనది.

ఈ సందర్భంలో మరి ఇద్దరు మహా పురుషులను గూర్చి కూడా ప్రస్తా వించవలసి ఉన్నది. 1908వ సంవత్సరంలో బెజవాడ నుండి 'స్వరాజ్య' పత్రి కను ప్రారంభించి నడిపిన గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు ఈ ఇద్దరిలో ఒకరు. సర్వోత్తమరావుగారు సార్థక నామధేయులు. గొప్ప విజ్ఞాని, మహా విద్వాం

సుడు, నిష్కళంక దేశభక్తుడు, గ్రంథాలయోద్యమ పితామహుడు. మొట్టమొదటి సారి తెలుగుదేశంలో స్వరాజ్యం కొరకు జైలుకు వెళ్ళిన గౌరవం హరి సర్వోత్తమ రావుగారికే దక్కుతున్నది. విద్యార్థి దశలోనే వందేమాతరం ఉద్యమంలో పాల్గొనినందున రాజద్రోహ నేరం ఆయనపై ఆరోపించి అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను నిర్బంధంలో పెట్టినది. రెండవ వ్యక్తి ఈనాడు మనము సంస్మరిస్తున్న దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథ నాగేశ్వరరావుగారు. ఆ మహనీయుని గూర్చి నేను ఈ ప్రసంగ ప్రారంభంలో కొన్ని మాటలు చెప్పినాను. తిరిగి ఒకమాటలో చెప్పవలెనన్నచో ఆధునిక ఆంధ్ర నిర్మాతలలో వీరేశలింగం ప్రక్కన ఉండవలసిన మహాపురుషుడు ఆయన. ఆయన సంపాదకత్వంలో నేటి 'ఆంధ్ర పత్రిక' వారపత్రికగా 1908 ఆగస్ట్ 9వ తేదీనాడు బొంబాయి పట్టణంనుండి వెలువడినది. తరువాత 1914 ఏప్రిల్ ఒకటవ తేదీనాడు ఆంధ్ర పత్రికను మదరాసుకు తరలించి క్రమక్రమముగా దీనిని దినపత్రికగా రూపొందించినారు.

సూర్యుని రశ్మివలె ఆంధ్రపత్రిక తెలుగు మాట్లాడే ప్రతి పల్లెకు వెలుతురు నిచ్చినది. అనేక రచయితలకు, పండితులకు ఆంధ్రపత్రికను నాగేశ్వరరావుగారు ఉచితంగా పంపినారు. ఆంధ్రపత్రిక పక్షాన సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక, కళాసాహిత్య రంగాలకు సంబంధించిన ఉత్తమ వ్యాసాలతో సర్వాంగ సుందరంగా సంవత్సరాది సంచికల ప్రకటనను కూడా నాగేశ్వరరావుగారు ప్రారంభించిరి. నాటికి నేటికి ఆంధ్రపత్రిక నిరంతరాయంగా నడుస్తున్నదంటే దానికి కారణం నాగేశ్వరరావుగారి చేతిచలువ, అమృత హృదయమే అని చెప్పవలెను. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రికకు సంపాదకులుగా కొంత కాలం పని చేసినారని ఈ సందర్భంలో ప్రత్యేకంగా చెప్పవలెను. 1923లో నాగేశ్వరరావుగారు 'భారతి'ని మాసపత్రికగా ప్రారంభించి ఇందులో సాహిత్యానికి, కళలకు, సంస్కృతికి ప్రాధాన్యమిచ్చి ఎందరో రచయితలను, పండితులను ప్రోత్సహించిరి. భారతి తెలుగు సాహిత్యానికి యిప్పటివరకు చేసిన, ఈనాటికి చేస్తున్న సేవ నిరుపమానమైనది, చరిత్రాత్మకమైనది. 1922లో 'శారద' అనే మాసపత్రికను మచిలీపట్టణం నుండి కౌతా శ్రీరామశాస్త్రిగారు కొంతకాలం అత్యుత్తమంగా నడిపిరి. కాని ఆర్థిక ఇబ్బందులవల్ల అది కొన్ని సంవత్సరాలలోనే ఆగిపోయినది. 1909-24 మధ్యన తెలుగుదేశంలో దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు పుంఖానుపుంఖంగా వెలువడినవి. 'సమదర్శిని' అనే పత్రిక కొంత కాలం వారపత్రికగాను, దినపత్రికగాను మొదలు పింజల సుబ్రహ్మణ్యశెట్టి, తరువాత గూడవల్లి రామబ్రహ్మంగార్ల సంపాదకత్వంలో వెలువడినది. గూడవల్లి రామబ్రహ్మంగారు 'ప్రజామిత్ర' అనే వారపత్రికను కూడా కొంతకాలం నడిపి

నారు. ఆయన తెలుగు పత్రికా రచయితలలో ప్రముఖులు. మాలపల్లి, రైతుబిడ్డ అనే సినిమాలను తీసిన కళోపాసకుడు. సాహిత్యము, సంస్కృతి, రాజకీయాలు, సంఘ సంస్కరణ, మతం, వ్యాపారము మొదలయిన సమస్త విషయాలకు సంబంధించినవి ఈ పత్రికలు. మన మిత్రులు, సుప్రసిద్ధులైన వావిలాల గోపాల కృష్ణయ్యగారు 1930వ సంవత్సరమున భారతికి ఒక వ్యాసం వ్రాస్తూ తెలుగు పత్రికల సంఖ్యను గూర్చి కొన్ని అంకెలు సిద్ధము చేసినారు. అంకెల ప్రకారం 1875-1926 సంవత్సరాల మధ్య 516 పత్రికలు వెలువడినవని తెలిపినారు. కాని ఇందులో చాలా పత్రికలు ఏ కారణం వల్లనో ఎక్కువకాలం నిలువలేదు. 1940లో వేసిన అంచనా ప్రకారం ఆ సంవత్సరంలో 184 పత్రికలే మిగిలిన వని తెలుస్తున్నది.

1938వ సంవత్సరంలో రామనాథ్ గోయంకా అనే పెట్టుబడిదారు మద రాసులో 'ఆంధ్రప్రభ' దినపత్రికను స్థాపించినాడు. దానికి మొదట్లో ఖాసా సుబ్బారావుగారి వంటి ఆదర్శజీవి, ఉత్తమ పత్రికా రచయిత సంపాదకులుగా పనిజేసినారు. తరువాత ఆ పత్రికకు న్యాయపతి నారాయణమూర్తిగారు సంపా దకులుగా ఉండిరి. 1942లో నార్ల వెంకటేశ్వరరావుగారు ఆ పత్రిక సంపాద కత్వ బాధ్యతలను స్వీకరించి 'ప్రభ'ను అత్యుత్తమ స్థాయిలో తీర్చిదిద్దినారు. తెలుగు పత్రికారంగంలో నార్ల వెంకటేశ్వరరావుగారిది అద్వితీయమైన స్థానం. ఆయన శైలి విశిష్టమైనది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 1959లో నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంధ్రప్రభ అధిపతులతో అభిప్రాయ భేదాలు కలిగినందువలన సంబంధాలు తెగతెంపు చేసుకొని 'ఆంధ్రజ్యోతి' అను దినపత్రికను విజయవాడలో స్థాపించిరి.

ఇప్పటివరకు ప్రస్తావించిన పత్రికలు చాలాభాగం మదరాసునుండి, మరి కొన్ని మచిలీపట్టణం, విజయవాడ మొదలయిన ఆంధ్ర జిల్లాలనుండి వెలువడి నవి. రాయలసీమలోని బళ్ళారి తెలుగు సాహిత్యానికి, సంస్కృతికి చిరకాలం నుండి ముఖ్య కేంద్రముగా నుండినది. అక్కడనుండి 1835వ సంవత్సరములో 'సత్యదూత' అనే పత్రికను క్రైస్తవ మిషనరీలు నడిపినారని ఇంతకు ముందే చెప్పినాను. దాని తరువాత 1840లో. 'వృత్తాంతిని' పత్రిక వెలువడినది. ఇంతకు ముందే మనము ప్రశంసించుకొన్న గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు రాయల సీమ వారే. ఆయన కొంతకాలం అనంతపూరు జిల్లాలోని తాడిపర్తి నుండి 'మాతృసేవ' అనే పత్రికను నడిపినారు. ఇది రాయలసీమలోని స్వాతంత్ర్యోద్య మానికి బలమైన చేయూత నిచ్చినది. పప్పూరి రామాచార్యులు గారు భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న దేశభక్తుడు. ఆయన అనంతపూరు నుండి

"హాస్య మంజూష" అనే పత్రికను ప్రారంభించి కొంతకాలము నడిపినారు. 1930వ సంవత్సరంలో ఆచార్యులుగారు "శ్రీసాధన" పత్రికను స్థాపించి చాలా కాలము నడిపినారు. ఈ పత్రిక భారత స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరిచినది. ఆచార్యులుగారు మరొక మిత్రునితో కలిసి కొంతకాలము 'పినాకిని' అనే పత్రికను కూడా నడిపినారు. రామాచార్యులుగారి సమకాలికుడు కల్లూరి సుబ్బారావుగారు కూడా 1920లో ఒక రాజకీయ పత్రికను నడిపినట్లు తెలుస్తున్నది. వనం శంకరం శర్మగారు నడిపిన 'ఇంద్రావతి' ఆ రోజులలో ప్రభుత్వానికి పక్కలో బల్లెంగా ఉండెను. తరువాత ఆయనే 'హితవాది' అనే పత్రికను నడిపినాడు. మూల నారాయణస్వామిగారు 'విజయవాణి' అనే పత్రికను అనంతపురంనుండి నడిపి నారు. అవధానం కృష్ణమునిగారు కడపనుండి 'బ్రహ్మానందిని' అనే పత్రికను నడిపినారు. ఇందులో ప్రసిద్ధకవులు దుర్భా రాజశేఖర శతావధాని వంటివారు వ్రాస్తుండేవారు. 1940లో శ్రీ యన్. శంభురెడ్డి గారు కడపనుండి 'ఆజాద్ హిందు' అనే పత్రికను నడిపినారు. 'దివ్యజీవనం, స్నేహజీవనం' అనే పత్రికలు మదనపల్లినుండి వెలువడినవి. ప్రస్తుత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు 1940లో "ఆకాశవాణి" అనే రహస్య పత్రికను నడిపినట్లు తెలుస్తున్నది. రాయలసీమ పత్రికా రచయితలలో 'వాహిని' పత్రికను కొంతకాలము నడిపిన పి. తిమ్మారెడ్డి గారితోపాటు, ఎ. యస్. రామన్ గారిని, విద్వాన్ విశ్వంగారిని, తిరుమల రామచంద్రగారిని, కె. సభాగారిని పేర్కొనవలెను. వీరందరు జాతీయో ద్యమాన్ని బలపరిచినవారే. రామాచార్యులుగారు తెలుగు వచన రచయితలలో గణనీయుడు. ఇంకా రాయలసీమలో అనేక పత్రికలు - అనంతపురము, కడప, కర్నూలు, తిరుపతి, చిత్తూరు ప్రాంతాలనుండి వెలువడినవి.

1833 ప్రాంతంలో ప్రారంభమైన తెలుగు పత్రికా జీవితంలో మొదటి అధ్యాయము 1900 వరకు పూర్తియైనది. ఆరుద్రగారు సేకరించిన సమాచారం ప్రకారం మొదటి భాగంలో సుమారు 60 పత్రికలకు పైగా ప్రారంభమై నడిచి నవి. రెండవ అధ్యాయమైన 1900 నుండి 47 మధ్యకాలంలో ఈ పత్రికల సంఖ్య ఎన్నో రెట్లు పెరిగినది.

మాసపత్రికలు, దినపత్రికలు, వారపత్రికలు పుష్కలంగా వెలువడినవి. ఈ కాలంలో ఒక కోటి తెలుగు మాట్లాడే ప్రజలు నివసిస్తున్న తెలంగాణా ప్రాంతం భిన్న పరిపాలనలో 1951 వరకు ఉండెను. ఇంతకు పూర్వం నేను ప్రస్తావించిన పత్రికలన్నీ రెండు కోట్లకు పైగా తెలుగు ప్రజలు నివసిస్తూ ఉండిన మదరాసు రాష్ట్రానికి సంబంధించినవి. మదరాసు రాష్ట్రం ప్రత్యక్షంగా ఇంగ్లీషు పరిపాలన క్రింద ఉండినది. కాని తెలంగాణ ప్రాంతం అప్పుడు, ఇంగ్లీషువారికి

పరమ విధేయుడై, సామంతుడైన నిజాం రాజుక్రింద ఉండెను. మన ఆస్థానకవి వర్ణించినట్లుగా ఆ నిజాము నిజంగా ప్రజలకు జన్మజన్మాల బూజు. సాంఘిక, సాహిత్య విషయాలను గూర్చి వ్రాసిన పత్రికలను బ్రిటిష్ ప్రభుత్వం నిరోధించ లేదు. కాని నైజాంరాజు ఈ మాత్రం స్వేచ్ఛకూడ తెలంగాణ ప్రజలకు ఈయ లేదు. అందుచేత నిజాం పరిపాలితమైన తెలంగాణాలో ప్రజలలో చైతన్యం కొంత ఆలస్యంగా వచ్చినది. ఇక్కడి పత్రికా రచన ఇరువయ్యో శతాబ్దంలోనే ప్రారంభమైనదని చెప్పవలెను. క్రైస్తవ మిషనరీల పత్రికలు తెలంగాణాలో వెలువడలేదు. అచ్చు యంత్రాలు కూడా కొంత ఆలస్యంగానే వచ్చినవి. వనపర్తి, గద్వాల సంస్థానాలలో ముద్రణశాలలు స్థాపితమై విస్మృత రాజకవులవంటి కొన్ని అముద్రిత గ్రంథాల అచ్చు జరిగినది. నిజానికి ఈ ప్రాంతంలోని మొట్ట మొదటి తెలుగు పత్రిక 'హితబోధిని'. శ్రీనివాస శర్మగారి సంపాదకత్వంలో 1913లో వెలువడినది. కాని ఈ పత్రిక సుమారు ఒక సంవత్సరం మాత్రమే జీవించినది. ఆ రోజులలో హైదరాబాదు రాష్ట్రంలోని తెలంగాణా ప్రజలకు ఏ విధమైన ప్రాథమిక స్వత్వాలు లేకుండెను. పత్రికలు స్థాపించి నడుపడానికి కావలసిన స్వేచ్ఛాయుత వాతావరణం లేకుండెను. ఇటువంటి పరిస్థితులలో 1920వ సంవత్సరమున రెండు పత్రికలు వెలువడినవి. ఒకటి వరంగల్ జిల్లా మానుకోట తాలూక ఇనుగుర్తి గ్రామము నుండి వెలువడిన 'తెనుగు పత్రిక'. రెండవది నల్లగొండ నుండి వెలువడిన 'నీలగిరి పత్రిక'. తెనుగు పత్రికకు సంపాదకులు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు సోదరులు. ఉభయులు సంస్కృతాంధ్ర భాషలలోనే కాక ఉర్దు, ఇంగ్లీషు, ఫారసి భాషలలో కూడ ప్రవీణులు. ఈ పత్రికను వీరు సుమారు అయిదు సంవత్సరాలు నడిపినారు. నల్లగొండ నుండి వెలువడిన 'నీలగిరి' పత్రికకు షబ్నవీస్ నరసింహారావుగారు సంపాదకులు. తెలంగాణను జాగృతం చేయడానికి వెలువడిన మొట్టమొదటి పత్రికలు ఈ రెండు. తెలంగాణానుండి వెలువడిన పత్రికలలో 'గోలకొండ' నిస్సందేహంగా ప్రముఖమైనది. సురవరం ప్రతాపరెడ్డిగారు 1925వ సంవత్సరంలో గోలకొండను ద్వైవార పత్రికగా స్థాపించి 1947 వరకు నిర్వహించినారు. గోలకొండ తెలంగాణ ప్రజలను మేలుకొలిపిన మహా సంస్థ. ఆంధ్రోద్యమానికి, జాతీయోద్యమానికి ఆయువు పట్టుగా ఉండినది ఈ పత్రిక. ప్రజోపయోగకరమైన ఉద్యమాలను అన్నింటిని సమర్థించిన గౌరవం గోలకొండ పత్రికకు చెందుతున్నది. బి. ఎ., బి. యల్. పట్టభద్రులై న్యాయవాద వృత్తిని అవలంబింపక, ప్రభుత్వ ఉద్యోగాన్ని కాంక్షించక, తెలంగాణా ప్రజల సర్వతోముఖాభివృద్ధినే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని, సాంఘిక, సాంస్కృతిక రాజకీయ రంగాలలో జాగృతిని కలిగించిన సురవరం ప్రతాపరెడ్డిగారు, తెలుగు పత్రికా సంపాదకులలో సర్వదా సంస్మరణీయులైన గాడిచర్ల హరి సర్వోత్తమరావు, కాశీనాథుని నాగే

శ్వరరావు, ముట్నూరి కృష్ణారావుగార్ల ప్రక్క నిలువదగినవాడు. తెలంగాణనుండి వెలువడిన సాహిత్య మాసపత్రిక 'సుజాత' మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డిగార్ల ప్రోత్సాహంతో శ్రీ పి. యన్. శర్మగారు సుజాత పత్రికను 1927లో స్థాపించి కొన్ని సంవత్సరాలు నడిపినారు. 1936 తరువాత తెలంగాణాలో చాలా పత్రికలు వచ్చినవి. దీనబంధు, దక్కన్‌కేసరి, తెలుగుతల్లి, విభూతి, దివ్యవాణి, తరుణ ఇందులో పేర్కొనదగినవి. తెలుగుతల్లి పత్రికకు రాచమళ్ళ సత్యవతీదేవి అనే విదుషీమణి దేశసేవిక సంపాదకురాలుగా పని చేసినది.

భాగ్యరెడ్డిగారు అనే హరిజన నాయకుడు 'భాగ్యనగర్' అనే వారపత్రికను హైదరాబాదులో సుమారు 15 సంవత్సరాలు నడిపినారు. 1938లో అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో ప్రాథమిక స్వత్వాల కొరకు పోరాటం జరిగినది. ఆ కాలంలో ఈ పోరాటాన్ని సమర్థిస్తూ హైదరాబాదులో పత్రికలను స్వతంత్రంగా నడిపే అవకాశాలు లేనందున శ్రీ బి. యన్. శర్మగారు విజయవాడకు వెళ్ళి అక్కడనుండి 'ఆంధ్రవాణి'ని నిర్వహించినారు. కమ్యూనిస్టు భావాలను ప్రచారం చేస్తూ 'ఆంధ్రకేసరి' అనే పత్రిక కొంతకాలం నడిచినది. 1943-44లలో 'తెలంగాణ' అనే దినపత్రిక వెలువడి కొన్ని సంవత్సరాలు నడిచినది. ఈ పత్రిక జాతీయోద్యమాన్ని సమర్థించినది. ఈ కాలంలోనే అడవి బాపిరాజుగారు సంపాదకులుగా 'మీజాన్' అనే తెలుగు దినపత్రిక ఒక ముస్లిం పెట్టుబడిదారు అధిపత్యంలో నిర్వహించబడినది. కాని ఈ పత్రిక ప్రజల ఆశయాలకు దూరంగా ఉండినది. 1946లో 'శోభ' అనే సాహిత్య మాస పత్రికను ప్రారంభించి, కొంత కాలం వరంగల్‌నుండి నడిపే అవకాశం ఈనాటి ఉపన్యాసకునికి లభించినది.

1938లో ప్రారంభమైన ప్రాథమిక హక్కుల పోరాటం క్రమక్రమంగా బలపడి స్టేట్‌కాంగ్రెస్ అవతరించి ప్రజలలో జాతీయ భావాలు ఉప్పొంగినవి. 1947లో బ్రిటిష్‌వారు మన దేశంనుండి వెళ్ళిపోయి స్వరాజ్య స్థాపన జరిగినది. అయితే నిజాంరాజు భారత యూనియన్‌లో చేరడానికి నిరాకరించి, దమననీతిని అవలంబించి ప్రజల ఉద్యమాలను అణచివేయడానికి ప్రభుత్వ బలాలనేగాక రజాకార్లు అనే ప్రైవేటు సాయుధదళాన్ని కూడ ప్రోత్సహించడం జరిగింది. ఈ పరిస్థితులలో 1947 ప్రారంభంలో గోలకొండ పత్రిక దినపత్రికగా అవతరించినది. అప్పటినుండి పోలీస్ చర్య జరిగేవరకు సురవరం ప్రతాపరెడ్డిగారు దానికి సంపాదకులుగా ఉండిరి. అప్పుడే నిజాం కళాశాలనుండి యం. ఏ. పట్టము పొందిన యన్. నరోత్తమ రెడ్డిగారు దీనికి మేనేజింగ్ ఎడిటర్‌గాను, ఆ కాలంలోనే యం. ఏ. పట్టము పొందిన వనపర్తి సంస్థానాధీశ్వరులు రాజా రామేశ్వర

రావుగారు ఈ పత్రిక డైరక్టర్ బోర్డుకు అధ్యక్షులుగాను ముందుకు వచ్చి దిన పత్రిక నిర్వహణ బాధ్యతను స్వీకరించినారు. ఈ దినపత్రిక సంపాదక బాధ్యత నిర్వహణలో ఈనాటి ఉపన్యాసకుడు కూడా పాల్గొనినాడు. గోలకొండ దిన పత్రిక భారత జాతీయోద్యమాన్ని, హైదరాబాదు ప్రజల విమోచనోద్యమాన్ని బలపరిచి 1966 వరకు నడిచినది. 1948 సెప్టెంబర్‌లో పోలీస్‌చర్య జరిగిన తరువాత తెలంగాణానుండి చాలా పత్రికలు వెలువడినవి.

దేశ స్వాతంత్రోద్యమ ప్రభావం, జాతీయ భావాల ప్రచారం తెలుగు పత్రికల మీద బాగా పడింది. హరి సర్వోత్తమ రావుగారి స్వరాజ్య పత్రికను గురించి, ఆంధ్ర కృష్ణాపత్రికలను గురించి మనము మాట్లాడుకొన్నాము. 1920-21వ ప్రాంతంలో ప్రసిద్ధ సోషలిస్టు నాయకులైన మద్దూరి అన్నపూర్ణయ్య గారు కాంగ్రెస్ అనే పేరుతో ఒక వారపత్రికను రాజమండ్రినుండి 'సత్యాగ్రహి అనే పేరుతో ఆత్మకూరి గోవిందాచార్యులు గారు ఏలూరునుంచి నడిపిరి. ఈ రెండు పత్రికల పైన ప్రభుత్వం ఆంక్షలు విధించి సంపాదకులను సకల బాధలు పెట్టినది. ఈ పత్రికా సంపాదకులు ఉభయులు స్వరాజ్య సాధన కొరకు సత్యాగ్రహం చేసి చెరసాలకు వెళ్ళి అనేక బాధలు అనుభవించిన త్యాగ మూర్తులు. జన్మభూమి, వీరభారత్ అనే మరికొన్ని పత్రికలు ఈ శ్రేణిలో చేరినవే. తెలుగు సాహిత్య పత్రికలు ఎన్నో వెలువడినవి. 'వృత్తాంతిని, వర్తమాన తరంగిణి, హితవాది, సుజనరంజని, యక్షిణి, ఆంధ్రభాషా సంజీవని, పురుషార్థ ప్రదాయని, వివేకవర్ధని' మొదలయిన వాటిని గూర్చి ఇదివరకే ప్రస్తావించినాను. ఈ శ్రేణిలో చేరినవే 'ప్రబంధ కల్పవల్లి, అముద్రిత గ్రంథ చింతామణి, చింతామణి, విజయవాణి, రత్నాకరము, సరస్వతి, మంజువాణి, వాగ్వల్లి, కళావతి, ఉదయని, జయంతి, సఖి, ఆంధ్రి, కల్పలత, మనోరమ, అభినవ సరస్వతి, ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, త్రిలింగ, గ్రంథాలయ సర్వస్వము, ప్రబుద్ధాంధ్ర, సాహితి, ప్రతిభ, కిన్నెర, పరిశోధన, విభూతి, సుజాత, శోభ మొదలయినవి. ఈ పత్రికలలో అముద్రిత గ్రంథాలు ప్రకటితమైనవి. సాహిత్యపరమైన వాదోపవాదాలు జరిగినవి. సారస్వత విమర్శలు వెలువడినవి. సృజనాత్మకమైన రచనలు ప్రకటితమైనవి. పండితులు, కవులు ఈ పత్రికలలో తమ రచనలను ప్రచురించినారు. సాహిత్యపరమైన పత్రికలు ఆంధ్ర భాషావికాసానికి చేసినటువంటి సేవ చరిత్రాత్మకమైనది, అమోఘమైనది.

తెలుగులో హాస్యపత్రికలు కొన్ని వెలువడినవి. చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు నడిపిన 'దేశమాత'లో ఆయన ప్రహసనాలు ప్రకటితమైనవి. 'నవ్వుల తోట' అనే పత్రిక కొంతకాలం వెలువడినది. 'వినోదిని, చిత్రగుప్త,

ఢంకా, ఆనందవాణి, జ్వాల, జ్యోతి' మొదలైన వారపత్రికలను ఈ సందర్భంలో పేర్కొనవలెను. ప్రత్యేకంగా పిల్లల కొరకు 'బాల' అనే పత్రిక 1944లో ప్రారంభమైనది. ఈ సందర్భంలో స్త్రీల కొరకు వెలువడిన కొన్ని పత్రికలను గూర్చి ప్రస్తావింపవలెను. 1893లో 'జనానా' పత్రిక రాజమండ్రి నుండి వెలువడి మొదలు మల్లాది వెంకటరత్నంగారు సంపాదకులుగాను, తరువాత రాయసం వెంకట శివుడుగారు సంపాదకులుగాను 1900 వరకు కొనసాగినారు. మొసలికంటి రామబాయమ్మ గారు సంపాదకురాలుగా 'హిందూ సుందరి' రాజమండ్రి నుండి 1908 నుండి 1920 వరకు నడిచినది. వింజమూరి వెంకట రత్నమ్మ గారి సంపాదకత్వంలో 1914లో 'అనసూయ' అనే పత్రిక కాకినాడలో ప్రారంభమై కొంతకాలము నడచినది. పులుగుర్తి లక్ష్మీనరసమ్మ గారి సంపాదకత్వాన 'సావిత్రి' అనే పత్రిక 1910-1918 వరకు నడచినది. ఇవన్నీ స్త్రీల సమస్యలకు ప్రాధాన్యమిచ్చిన పత్రికలు. కె. యన్. కేసరిగారి ఆధ్వర్యంలో 'గృహలక్ష్మి' 1928లో ప్రారంభమై 1960 వరకు నడిచినది. స్త్రీలరచనలను ఈ పత్రిక ప్రోత్సహించినది. 1944లో శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారి ఆధ్వర్యంలో 'ఆంధ్ర మహిళ' ప్రారంభమైనది. ఫిలిం పత్రికలు తెలుగులో అవతరించినవి.

ఈ ప్రసంగంలో నేను పేర్కొనిన పత్రికలు కొన్ని మాత్రమే. పేర్కొనక విడిచిన పత్రికలు ఎన్నో ఉన్నవి. ఈ స్వల్ప వ్యవధిలో పత్రికలన్నింటిని పేరు పేరుతో పేర్కొనడం సాధ్యమైన పనికాదు. ప్రతి పత్రికను గూర్చి ప్రస్తావించడానికి ఇంతకన్నా విశాలమైన పరిధి అవసరం. మన దేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం వెలువడిన పత్రికా వాఙ్మయానికి సుమారు 110 సంవత్సరాల వయసు ఉన్నది. ఉజ్వలమైన చరిత్ర ఉన్నది. త్యాగశోభితమైన ఉదాత్త సంప్రదాయాలు ఉన్నవి. ఈ ఉపన్యాసంలో నేను పేర్కొన్నట్లు ఈ 110 సంవత్సరాలను రెండు భాగాలుగా విభజింపవచ్చును. మొదటిది — గత శతాబ్దం వరకు, రెండవది — ఈ శతాబ్దాది నుండి స్వాతంత్ర్య ప్రాప్తి వరకు. ఈ రెండు దశలలోను వెలువడిన పత్రికలను స్థూలంగా పరిశీలించినప్పటికిని ఇందులో మనజాతి జీవనము సమగ్రంగా ప్రతిబింబితమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చును. విదేశ పరిపాలన నుండి విముక్తి పొంది స్వరాజ్యాన్ని సాధించడానికి చేసిన కృషి పూర్తిగా యీ పత్రికలలో మనము చూడవచ్చును. 100 సంవత్సరాలకు పైబడిన మన సాంఘిక, రాజకీయ, ఆర్థిక జీవనాన్ని యీ పత్రికలు పూర్తిగా వివరిస్తున్నవి. జాతీయ జీవనానికి సంబంధించిన ఏ అంశమును కూడా యీ పత్రికలు విస్మరించలేదు. ప్రజల మనోరథాలను, ఆశయాలను, విశ్వాసాలను, దౌర్బల్యాలను, కష్టసుఖాలను, సాధక బాధకాలను, పోరాటాలను, సంఘర్షణలను

ఒక్కటేమిటి అన్నింటిని యీ పత్రికలు చిత్రిస్తున్నవి. అన్ని రంగాలలో జరిగిన వికాసానికి యీ పత్రికలు దర్పణములుగా ఉన్నవి. వాస్తవానికి యీ 110 సంవత్సరాలలో మన దేశాన్ని, ప్రజల జీవితాన్ని ఒకసారి సినిమా చూసినట్లు చూడవలెనంటే అందుకు సాధనమొక్కటే. అదే మన పత్రికలు. తెలుగు పత్రికలను గూర్చి చెప్పిన మాటలన్నీ ఇంచుమించుగా ఇతర భాషల పత్రికలను గూర్చి కూడా చెప్పవచ్చును.

తెలుగువారు ఇతర భాషలలోకూడ పత్రికలను నడిపినారు. ముఖ్యంగా ఇంగ్లీషు, ఉర్దూ భాషలలోని పత్రికలను నడిపిన తెలుగువారిని మనము పేర్కొనవచ్చును. తెలుగు పత్రికలు ఏ ఆశయాలకు ప్రాతినిధ్యం వహించినవో, తెలుగు సంపాదకులు నడిపిన ఇంగ్లీషు, ఉర్దూ పత్రికలు కూడా ఆ ఆశయాలకే ప్రాతినిధ్యం వహించినవి. ఈ 110 సంవత్సరాల కాలం దేశంలో చరిత్ర నిర్మాణం జరిగినకాలం; చీకటినుండి వెలుగులోకి అడుగు పెట్టిన కాలం; అవసరమైన సమయాలలో ధైర్య సాహసాలతో ఎటువంటి ఆపదలనైన ఎదుర్కొని ముందడుగు వేయడానికి జంకని కాలం; ఉన్నతమైన ఆశయాలతో జాతిని మేలుకొలిపిన కాలం; భవిష్యత్తునుగూర్చి కలలుగన్న కాలం. ఈ దృశ్యాలన్నీ మన పత్రికలలో ప్రతిబింబిస్తున్నవే. ఆ కాలాన్ని, ఈ కాలాన్ని - ఆనాటి పత్రికలను, ఈనాటి పత్రికలను పోల్చి పరిశీలించి సమీక్షించడం అసందర్భం, అనవసరం కాజాలదు. అయితే ఇది ప్రస్తుతాంశము కాదు.

ఈ నూటపది సంవత్సరాల పత్రికలను గురించి ఆలోచించినప్పుడు వివిధ దృక్కోణాలనుంచి ఈ పత్రికలచరిత్రను, ప్రారంభ వికాసాలను సమీక్షించడం అవసరమని తోస్తున్నది. యం.ఏ. పట్టభద్రులైన యువకులు కొన్ని పరిశోధన వ్యాసాలు వ్రాయడానికి కావలసినంత సామగ్రి పుష్కలంగా యీ పత్రికలలో లభ్యమౌతున్నది.

-: O :—

Printed at Krishna Printers & Packagers, Barkatpura, Hyderabad - 500 027

# ఆంధ్రదేశం పైన
# బ్రహ్మసమాజం ప్రభావం

(26-7-1960 న కలకత్తాలో ఏర్పాటుచేసిన శ్రీ రఘుపతి
వెంకటరత్నం నాయుడు స్మారకోపన్యాస పాఠం)



ఉపన్యాసకర్త
శ్రీ యం. ఆర్. అప్పారావు
ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళా పరిషత్తు వాల్తేరు




అంతర్జాతీయ తెలుగు సంస్థ
హైదరాబాదు
1980



సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు

జననం : 1.10 1861 నిర్యాణం : 26.5.1939

ఇవాళ భారతదేశం ఇంత ముందడుగు వేయడానికి మూలకారణం బ్రహ్మ సమాజం. అజ్ఞానాంధకారం ఆవరించిన సమయంలో, మూఢవిశ్వాసాలు ముమ్మరంగా వున్న తరుణంలో, విగ్రహారాధన విపరీతచర్యలకి పాల్పడినకాలంలో, బహుభార్యాత్వం బలిసిన వేళల్లో, బాల్యవృద్ధవివాహాలు ప్రబలిన దినాల్లో, సహగమన దురాచారం సాగినరోజుల్లో, అస్పృశ్యతాపిశాచం ఆవహించిన విషఘడియల్లో బ్రహ్మ సమాజం అవతరించింది. నిజంగా అవతార పురుషుడు రాజారామమోహనరాయలు. ఆయన మహాసంఘసంస్కర్త; అక్షరాలా నవభారతపిత (Father of the modern India). బెంగాల్ రాష్ట్రంలోని రాధానగర్‌లో 1772 లో జన్మించిన రాజారామమోహనరాయలు బెంగాలీ, సంస్కృతం, ఫారసీ, ఇంగ్లీషు, మొదలైన బహుభాషల్లో పండితుడై 1825 లో ఆధునికవిద్యా విధానానికి అంకురార్పణ చేయించాడు. 1812 లోనే ప్రారంభించిన సహగమన దురాచార నిషేధాన్ని 1829 లో చట్టబద్ధం చేయించాడు. ఆయన 1828 లో స్థాపించిందే బ్రహ్మ సమాజం.

ఇద్దరు తెలుగు వేదపండితులు వేదాశీర్వాదం చేయగా, ఉత్సవానందవాగీశుడు ఉపనిషత్‌సూక్తులు చదవగా, రామచంద్రవాగీశుడు బెంగాలీభాషలోకి అనువదించగా, తారాచంద్ చక్రవర్తి కార్యదర్శిగా బ్రహ్మసభ లేదా బ్రహ్మసమాజం కలకత్తాలోని చిత్‌పూర్ వీధిలో ప్రారంభమయింది. అంతకుముందున్న ఆత్మీయసభలోని ప్రార్థన సమావేశాలు బ్రహ్మసభలో లీనమయ్యాయి. బ్రహ్మసభ లేదా బ్రహ్మ సమాజం అనే మాటలోని బ్రహ్మ శబ్దానికి అర్థం పరబ్రహ్మ. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అన్నది బ్రహ్మసమాజానికి మకుటం. వేదమతంలోని అద్వైతసిద్ధాంతం, బౌద్ధమతంలోని విశ్వమానవ సౌభ్రాతృత్వం (Universal brotherhood), ఇస్లాం మతంలోని హేతువాదసరణి, క్రైస్తవమతంలోని కారుణ్యం బ్రహ్మ సమాజానికి మూలకందాలు. ప్రాచ్య పాశ్చాత్య విద్యావిధానాల సమ్మేళనం బ్రహ్మ సమాజానికి ఆదర్శం. రాజారామమోహనరాయల బ్రహ్మ సమాజ భావాల్ని ద్వారకానాథఠాకూరు బాగా ప్రచారం చేశాడు రామమోహనరాయల అనంతరం మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు బ్రహ్మసమాజాన్ని తీర్చిదిద్దాడు. కేశవచంద్రసేన్ బ్రహ్మసమాజాన్ని బహుళ వ్యాప్తికి తెచ్చాడు.

కేశవచంద్రసేన్ 1864 లో మదరాసు వచ్చి బ్రహ్మసమాజం గురించి మహోపన్యాసాలు ఇచ్చాడు. ఫలితంగా రాజగోపాలాచార్యులు, సుబ్బరాయలుశెట్టి ఆకర్షితులయ్యారు. మదరాసులో 'వేదసమాజం' వెలసింది. 1871 లో శ్రీధరులు నాయుడు అనే యువకుడు బ్రహ్మసమాజధర్మ ప్రబోధితుడై బెంగాల్‌రాష్ట్రం పర్యటించి వచ్చి మద్రాసులో దక్షిణభారత బ్రహ్మసమాజం నెలకొనడానికి కారకుడయ్యాడు. 1878 లో మన్నవ బుచ్చయ పంతులు గారి దీక్షవల్ల మద్రాసులో బ్రహ్మ సమాజ భవనం ఏర్పడింది. ఆ భవననిర్మాణానికి తెలుగువాడైన రాజా గజపతిరావు గారు భూరివిరాళం ఇచ్చారు అంతకుముందే 1870 లో బరంపురంలోనూ, 1875 లో బందరులోనూ, 1878 లో బాపట్లలోనూ, రాజమండ్రిలోనూ, 1898 లో కాకినాడలోనూ బ్రహ్మసమాజాలు వెలిశాయి. దామోదరయ్యగారి సహకారంవల్ల బందరులోను, వారణాసి రామబ్రహ్మంగారి పూనికవల్ల బాపట్లలోను, కందుకూరి వీరేశలింగం గారి కృషివల్ల రాజమండ్రిలోను, దుగ్గిరాల సూర్యప్రకాశ రావు గారి దోహదంవల్ల కాకినాడలోను బ్రహ్మసమాజాల స్థాపన జరిగింది. 1905 నుంచీ బ్రహ్మర్షి సర్‌రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు కారణంగా, పిఠాపురం మహారాజా రావు వేంకటమహీపతి సూర్యరాయబహద్దరు గారు ప్రేరణంగా, ఆంధ్ర దేశంలోని బ్రహ్మసమాజోద్యమానికి కాకినాడ ప్రధాన కేంద్రక్షేమయింది బ్రహ్మ సమాజోద్యమం అంటే మానవతా మహోద్యమం మానవతా మహోద్యమ లత మూడుపువ్వులూ, ఆరుకాయలూ కాయడానికి రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగంగారు, బ్రహ్మర్షి సర్ రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు, పిఠాపురం మహారాజా రావు వేంకటమహీపతి సూర్యరాయలుబహద్దరుగారు త్రిమూర్తులు.

కందుకూరి వీరేశలింగం గారు మొదట్లో అందరిలాగే సంప్రదాయపద్ధతికి చెందిన ఆంధ్రపండితుడు. అవధానాలు చేస్తూ, అచ్చ తెనుగు కావ్యాలు వ్రాస్తూ, చిత్రకవిత్వాన్ని చిత్రికలు పడుతూ వచ్చినవారే కాని కేశవచంద్రసేన్‌గారి గ్రంథాలు చదివి, మానసిక పరివర్తనం చెంది మహాసంఘసంస్కర్త అయ్యారు; నవ్యాంధ్రజనకులయ్యారు (Father of the modern Andhra). ఆయన సంఘసంస్కరణోద్యమం యావత్తూ బ్రహ్మసమాజోద్యమం అడుగుజాడలోనే సాగింది. వీరేశలింగంగారు 1872 లోనే మూఢవిశ్వాసాల్ని ఖండించడం మొదలుపెట్టారు. కన్యాశుల్కం, అతిబాల్య వివాహం, అతివృద్ధవివాహం, నిర్బంధ వైధవ్యం, వేశ్యాలోలత్వం, అవినీతి, మొదలైన దురాచారాల్ని తొలగించడానికి

1876 నుంచీ ప్రయత్నించారు. అందుకు 1874 లో వివేకవర్ధని అనే పత్రికని స్థాపించారు. 1874 లోనే ధవళేశ్వరంలో బాలికాపాఠశాల స్థాపించి స్త్రీవిద్యా వ్యాప్తికి ఎంతో కృషిచేశారు. ఇక స్త్రీ పునర్వివాహం గురించి వీరేశలింగంగారు చేసిన సాహసకృత్యం సర్వవిదితం. పూర్వాచారపరాయణులతో హోరాహోరి యుద్ధంచేసి, వెలివేస్తామని బెదిరించినా, కొట్టడానికి సిద్ధపడినా లెక్క చేయకుండా 1881 లో వీరేశలింగంగారు రాజమండ్రిలో స్వగృహంలో మొట్టమొదటి వితంతు వివాహం జరిపించారు. తర్వాత నాలుగైదు రోజుల్లోనే మరొకటి, 1882 లో ఒకటి, 1888 లో ఆరు వితంతువివాహాలు జరిపించారు. 1883 లో జరిపించిన ఒక వితంతువివాహం మదరాసులో జరిగింది. 1881 మొదలు 1911 వరకూ వీరేశ లింగంగారు జరిపించిన వివాహాలు సుమారు నలభై వరకూ వుంటాయి. ఒక్క వ్యక్తి అన్ని స్త్రీ పునర్వివాహాలు ఆ కాలంలో చేయించడం సామాన్యవిషయం కాదు. వివాహాలు చేయించడమేగాక వారికి జీవిక కల్పించడంకూడా వీరేశలింగంగారు చేసిన పని. 1893 నుంచి వీరేశలింగంగారు దేశాభిమానం ప్రబోధం చేశారు. 1893 లోనే దేశమంటే మనుష్యులని ప్రవచనం చేశారు. మనుష్యుల్లో వర్ణభేదం వుండకూడదని కలలుగన్నారు. 1905 లో వీరేశలింగంగారు అనుష్ఠాన బ్రహ్మ మతావలంబి అయ్యారు. 1906 లో ఆయన మిత్రుడు చల్లపల్లి బాపయ్యగారి ఇంట్లోనూ వీరేశలింగంగారి ఇంట్లోనూ సర్వజాతి సహపంక్తి భోజనాలు (Cosmo-politan Dinners) జరిగాయి. 1906 లోనే వీరేశలింగంగారు యజ్ఞోపవీతాన్ని పరిత్యజించారు 1907లో ఇతర బాలురతో సరిసమానంగా హరిజనబాలుల్ని ఆస్తి కోన్నతపాఠశాలలో చేర్చుకున్నారు. ఇవన్నీ బ్రహ్మసమాజం ఆధారంగా వీరేశలింగం గారు సాధించిన ఆనాటి అభ్యుదయ కార్యక్రమాల్లోనూ వీరేశలింగంగారి సతీమణి రాజ్యలక్ష్మి గారు అక్షరాలా సహధర్మచారిణి. బసవరాజు గవర్రాజుగా రొకరు వీరేశలింగం గారికి కుడిభుజం.

అర్ధాంగి సహకారంతో, ఆప్తమిత్రుని అండదండలతో బ్రహ్మసమాజోద్యమం ప్రచుర ప్రచారం కావడానికి వీరేశలింగంగారు రాజమండ్రిలో 1890 లో పురమంది రాన్ని కట్టించారు అక్కడే 1897లో ప్రార్థనామందిరాన్ని నిర్మించారు. వీరేశలింగం గారు మద్రాసులో వున్నప్పుడే స్వగృహం లోనే వితంతు శరణాలయాన్ని స్థాపించారు. 1905 లో రాజమండ్రి వచ్చింతర్వాత విక్టోరియా బాలికాపాఠశాల స్థాపించారు అది వితంతు శరణాలయానికి అనుబంధం వంటిది. 1906 లో

హితకారిణీ సమాజాన్ని స్థాపించారు. హితకారిణీసమాజం వారి ఉన్నతపాఠశాలలో సహవిద్యను (Co-education) ప్రవేశపెట్టారు. 1908లో ఇప్పుడున్న వితంతు శరణాలయాన్ని నిర్మించారు.

బ్రహ్మసమాజోద్యమంవల్ల విద్యారంగంలోను, సాంఘికరంగంలోనూ మాత్రమే కాక సాహిత్యరంగంలోనూ వీరేశలింగంగారు పెద్ద మార్పుని తీసుకొచ్చారు. ప్రాచీనసాహిత్యానికి భరతవాక్యంపలికి నవీనసాహిత్యానికి నాందివాక్యం పలికారు. సాంఘికప్రయోజనాన్ని సాహిత్యానికి ఒక లక్షణం చేసింది వీరేశలింగంగారే. పూర్వ సాహిత్యానికి వీరేశలింగంగారి సాహిత్యానికి పూర్తిభేదం వుంది. వీరేశలింగంగారి సమకాలంలోనూ అనంతరకాలంలోనూ వీరేశలింగంగారి అడుగుజాడలోనే సాహిత్యసృష్టి జరిగింది. అందుకే వీరేశలింగంగారు నవ్యాంధ్రసాహిత్యయుగకర్త. కృతకమైన గద్యరచనకి స్వస్తిచెప్పి సహజమైన వచనరచన సాగించి గద్యతిక్కన అనిపించుకున్నారు. సరళ గ్రాంధికభాషలో వీరేశలింగంగారు వ్రాసిన వ్యాసాలూ, చేసిన ఉపన్యాసాలూ, పండిత పామర రంజకంగా ప్రజల్ని ప్రభావితుల్ని చేశాయి. నవీనప్రక్రియ నవలారచనలో వీరేశలింగంగారే మార్గదర్శి. ఆయన 'రాజశేఖరచరిత్ర' తొలి నవల. ప్రాచీనప్రక్రియ అయినా ఆంధ్రసాహిత్యంలో అంతవరకూ ఇంచుమించు లేని నాటకరచన చేయడమేగాక ప్రదర్శనభాగ్యం కూడా కలిగించారు వీరేశలింగంగారు. 1876 లో వీరేశలింగంగారు హాస్య సంజీవని పత్రికలో ప్రకటించిన 'బ్రాహ్మవివాహం' నిజమైన ప్రథమాంధ్ర నాటకం. 1880 లో 'వ్యవహారధర్మబోధిని' అనే నాటకం వ్రాయడమేగాక అదే సంవత్సరం రాజమండ్రిలో ఆయనే ప్రదర్శించారు. సరిగా వంద సంవత్సరా లయింది. తెలుగు నాటకానికి శతజయంతి జరుపుకోవలసిన సంవత్సరం ఇది. ఈ నాటకాలూ అనేక ప్రహసనాలూ వీరేశలింగంగారు వ్యావహారికభాషలోనే వ్రాశారు. తెలుగు కవిత్వం తీరుతెన్నులు సరిగా లేవని 'అభాగ్యోపాఖ్యానం, సరస్వతీనారదవిలాపం' అనే వ్యంగ్య కావ్యాలు కూడా రచించారు. స్వీయచరిత్రకి శ్రీకారం చుట్టిందిఆయనే. స్త్రీలకు సన్మార్గప్రవర్తనం నేర్పే గ్రంథాలు ఎన్నో వ్రాశారు. వారి 'ఆంధ్రకవుల చరిత్ర' అపూర్వమైన గ్రంథం. 1875 నుంచి 1919 వరకూ వీరేశలింగంగారు కావించిన సాహిత్యసృష్టి సహస్రముఖాలుగా వుంది. అదంతా నవ్య సాహిత్యం. అందులోని అంతర్వాణి బ్రహ్మసమాజోద్యమం.

ఆధునిక సాహిత్యానికి మాత్రమే గాక ఆధునిక పత్రికారంగానికి సైతం వీరేశలింగంగారు వ్యవస్థాపకులే. 1874లో వివేకవర్ధని పత్రిక స్థాపించి ఆగిపోలేదు. 1876లో హాస్యసంజీవని అనుబంధం చేశారు. అంతేగాకుండా న్యాపతి సుబ్బారావు గారి చింతామణి అనే పత్రికకీ, రాయసం వెంకటశివుడు గారి తెలుగుజనానా అనే పత్రికకీ సంయుక్త బాధ్యత వహించారు. ఇలా బహురంగాల్లో బ్రహ్మసమాజోద్యమం సంఘసంస్కరణాత్మకంగా వీరేశలింగంగారు నిర్వహించారు. ఉపదేశాలు ఉపన్యసించడమేగాక ఉదాహరణ ప్రాయంగా ఆచరణలో అమలు జరిపి, వీరేశలింగంగారు పందొమ్మిదో శతాబ్ది తుది భాగంలో ఆంధ్రదేశమంతటా బ్రహ్మ సమాజోద్యమాన్ని సజీవం చేశారు.

ఇక రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు. వీరు ఆంధ్రదేశంలోని కృష్ణా జిల్లా వారైనా, తండ్రిగారి ఉద్యోగాన్నిబట్టి ఉత్తరప్రదేశ్‌లోని బందాజిల్లా ఉన్నత పాఠశాలలో మొదట ప్రవేశించారు. అక్కడే ఆయన పర్షియన్, ఉర్దూ, హిందూ స్తానీ భాషలు నేర్చుకున్నారు. అక్కడ చదువుతూ ఉండగానే అనూచానంగా వస్తూవున్న పూజాపురస్కారాలమీద ఆయనకి సందేహాలు కలగసాగాయి. ఏకేశ్వరో పాసనను ప్రబోధించే పర్షియన్ పద్యాలు ఆయన్ని ఎంతగానో ఆకర్షించాయి. తర్వాత ఆయన తండ్రిగారికి హైదరాబాదు బదిలీకాగా, చాదరుఘాటులోవున్న నిజాం ఉన్నత పాఠశాలలో చదువు కొనసాగించడం జరిగింది. అప్పుడు అక్కడ పనిచేస్తున్న సరోజినీనాయుడు తండ్రి డా॥ అఘోరనాథచటోపాధ్యాయగారి వద్ద విద్య నభ్య సించారు. ఆ తర్వాత నాయుడుగారు మదరాసు క్రైస్తవకళాశాలలో చేరారు. చదువు సంధ్యల విషయంలో అయితేనేమి, శీలసంపదల విషయంలోనేమి ప్రతిభా వంతులుగా ఉంటూ ఉండేవారు. బ్రహ్మసమాజనాయకుడు పండితశివనాథశాస్త్రిగారు 1881లో మదరాసు వచ్చి బ్రహ్మసమాజం గురించి వరుసగా ఎన్నో ఉపన్యాసాలు ఇచ్చారు. అప్పుడు యఫ్. ఎ. చదువుతున్న నాయుడుగారికి పండితశివనాథశాస్త్రి గారి ప్రబోధామృతంవల్ల బ్రహ్మసమాజంపట్ల మిక్కిలి ఆసక్తి ఏర్పడింది. బ్రహ్మ సమాజంద్వారా తన ఆధ్యాత్మికజీవనాన్ని గడపాలని నిర్ణయించుకున్నారు. 1885లో మదరాసులో బ్రహ్మ సమాజమందిర నిర్మాణం జరుగుతున్నప్పుడు అంత పిన్న వయస్సులోనే నాయుడుగారు ఎక్కువగా కృషిచేశారు. ఆ మందిరానికి నిత్యం వెళుతూవుండేవారు. బ్రహ్మసమాజసాహిత్యాన్ని విరివిగా చదివారు. బ్రహ్మసమాజ ములో చేరిన రోజున ఆయన ఆత్మ సంపూర్ణసంతృప్తిని పొందగలిగింది. ఆయన

డబ్బుపైగాని అధికారంపైగాని ఆసక్తి చూపించలేదు. సంఘం ఆధ్యాత్మికంగా పునరుద్ధరింపబడటంమీదనే శ్రద్ధవహించారు. సూఫీ వేదాంతాన్ని, హిందూమతాన్ని, క్రైస్తవమతాన్ని క్షుణ్ణంగా ఆకళించుకున్నారు. బ్రహ్మసమాజంద్వారా వసుధైక మతాన్ని సాధించాలని సంకల్పించారు. అందుకు 1881 లోనే ఒక ముద్రణాలయాన్ని స్థాపించి బ్రహ్మప్రకాశిక , ఫెలోవర్కర్ అనే పత్రికల్ని నడిపారు.

వెంకటరత్నంనాయుడు గారికి 1884లో వివాహం జరిగింది. 1889 లో అమ్మాయి పుట్టింది కాని నాయుడుగారి సతీమణి శేషమాంబగారు మరణించారు. ఆమె మరణించిన తర్వాత నాయుడుగారు మళ్ళీ పెళ్లి చేసుకోలేదు. 50 సంవత్సరాలపాటు కఠినమైన బ్రహ్మచర్యాన్ని అనుసరించారు. హిందూవితంతువుల మాదిరిగా ఉండాలని ఆయన ఎల్లప్పుడూ తెల్లటిదుస్తుల్ని ధరించేవారు. ఆవిధంగా ఆయనకు ఆంధ్రదేశ శ్వేతాంబరఋషి అనే పేరొచ్చింది. మద్రాసు బ్రహ్మసమాజానికి అధ్యక్షులయ్యారు. 1905 నుంచి 1919 వరకూ కాకినాడ పి. ఆర్. కాలేజీ ప్రిన్సిపాలుగా ఉండి విద్యార్థుల్ని ఉత్తేజపరచారు. వీరేశలింగం గారు స్థాపించిన రాజమండ్రి హితకారిణీసమాజానికి అధ్యక్షులుగా పనిచేశారు. నాయుడుగారి ప్రోత్సాహంతోనే పిఠాపురం మహారాజావా రొక అనాథశరణాలయాన్ని స్థాపించారు. పిఠాపురం మహారాజావారి సహాయంతోనే కాకినాడ బ్రహ్మసమాజమందిరం నిర్మింపబడింది. మహారాజావారిచ్చిన లక్షరూపాయల నిధితో ఆంధ్రబ్రహ్మప్రచారకనిధి ఏర్పడింది.ఈ మూడు సంస్థలతోనూ నాయుడుగారికి అత్యంత సన్నిహితసంబంధం వుండేది 'ఈ మూడు సంస్థలలో ఒకటి మానవుని ఆత్మను పెంపొందించేది. రెండోది వికసింపజేసేది, మూడోది పరిపక్వంగావించేది' అని వారు అంటూవుండేవారు.

రఘుపతి వెంకటరత్నంనాయుడు గారు పరమ దయాళువు. వారు అనాథులను కనికరించి ఉదారంగా సహాయం చేసేవారు. ఒకనాడు ఆయనకు త్రోవలో ఒక అనాథబాలిక కనిపించింది. ఆ బాలికను ఇంటికి తీసుకవెళ్లి తన కుటుంబంలో చేర్చుకుని పెంచారు. సొంతకూతురులా పెంచారు. 1936 లో ఒకే నెలలో ఆయన విద్యార్థులు కాలేజీలో చేరడానికిగానూ సుమారు 1500 రూపాయలు పంపారు. ఆయన స్త్రీని ఒక మాతృమూర్తిగా, సోదరిగా, గృహలక్ష్మిగా భావించారు. ఎప్పుడూ ఒక స్త్రీని వ్యభిచారిణిగా ఎంచలేదు. ఆయన స్త్రీని వంచించే మతాన్ని గర్హించారు. మతానికి సంబంధించిన అక్రమాన్ని తీవ్రంగా నిరసించారు. పవిత్ర

దేవదాసీల స్థానంలో సందేహాస్పదమైన శీలంకలవారు రాగానే పతనమైన దేవదాసీ వ్యవస్థని నిర్మూలించారు భోగం మేళాలు వుండే పెళ్ళిళ్లకుగాని, సాంఘికకార్య క్రమాలకిగాని వారెప్పుడూ హాజరు కాలేదనే విషయం సర్వవిదితం. సాంఘిక మతైక విషయాల్లో నిర్మలత వుండవలసిన అవసరాన్ని గుర్తించి సానివృత్తి నిర్మూలన ఉద్యమాన్ని తలపెట్టారు. ఆంధ్రదేశంలోని వేశ్యల గురించి వ్యథాపూరిత మైన తమ హృదయాన్ని ఆయన వ్యక్తంచేశారు. సంగీతం, నాట్యం, నటనలను దుర్మార్గం, అపవిత్రం, నిషేధయోగ్యం అనే ఆంక్షలనుంచి రక్షించడంలో కృత కృత్యు లయ్యారు. అన్నిటికంటె ముఖ్యమైంది అస్పృశ్యతానివారణం. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు అస్పృశ్యతానివారణాచరణం మూర్తీభవించిన మహా వ్యక్తి. ఆయన ఎందరో అస్పృశ్యుల్ని కన్నబిడ్డలుగా పెంచి పెద్దచేశారు. కాదు. కన్నబిడ్డలకంటె మిన్నగా పెంచి పెద్దచేశారు. అగ్రకులాలవారితో వివాహాలు జరి పించారు. ఆ మహత్తరకార్యంకోసం ఆయన జీవితం అంకితం చేశారు.

నాయుడుగారు గొప్ప విద్యావేత్త ఉపాధ్యాయవృత్తికి ప్రాధాన్యమిచ్చారు. లెక్చరర్‌గా, ప్రిన్సిపల్‌గా నాయుడుగారి కృషి గణనీయమేగాక ఆదర్శప్రాయ మైనది. విద్యార్థుల్ని పరీక్షకి తర్ఫీదుచేసినప్పటికీ, వారి శీలసంపదనూ సంస్కార వికాసాన్నీ ప్రధానంగా లక్షించేవారు. మొదటినుంచి నాయుడుగారు మద్యపాన వ్యతిరేకి. తుదివరకూ మద్యపానం వ్యతిరేకిస్తూ వచ్చారు. 1923 లో మద్రాసు శాసనపరిషత్తు సభ్యులుగా వుండి రాష్ట్రంలో మద్యనిషేధాన్ని ప్రవేశపెట్టనందుకు గాను ఆబ్కారీశాఖ బడ్జెటును నిశితంగా విమర్శించారు. ఆబ్కారి ఆదాయంలో అధికభాగం ఏ తరగతి ప్రజానీకం నుంచి వస్తుందని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. అబ్కారి ఆదాయం సమాజపు భౌతికశక్తిని దెబ్బతీస్తూ శీలాన్ని క్షీణింపజేస్తూ ఆర్థిక స్థిరత్వాన్ని దుర్బలంచేస్తుందనీ, అది అన్యాయమని బ్రిటిషుపరిపాలనకే కళంకమని నొక్కి వక్కాణించారు. పొగత్రాగడం, కల్లుత్రాగడం నిషేధించే కార్యకలాపం, హరిజనోద్ధరణ, కళావంతుల సంస్కరణ, స్వదేశవస్తువుల వాడకం, మొదలైన నిర్మాణాత్మక కార్యక్రమానికి, కాంగ్రెస్సు ప్రారంభించడానికి అర్థ శతాబ్ది ముందే, నిష్కామంగా, ఈశ్వరార్పణంగా, తపోదీక్షగా సుస్థిరమైన పునాదులు వేసినారు సర్‌రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు.

వంగదేశం నుంచి ప్రసిద్ధబ్రహ్మసమాజప్రచారకులు పండిత శివనాథశాస్త్రి, హేమచంద్రసర్కార్, సతీశ్‌చంద్రచక్రవర్తి ప్రభృతులు, నవవిధాన ప్రచారకులు

అమృతలాల్‌బోసు, నిర్భర ప్రియ ఘోషు మొదలైనవారు, రాజకీయ ధురంధరుడు విపినచంద్రపాల్, విశ్వకవీంద్రుడు రవీంద్రుడు, బొంబాయి నుంచి షిండే, అమెరికా నుంచి పౌల్‌వర్తు, డ్రమెండ్ నెట్‌ఫీల్డు, మొదలైనవారు వచ్చి ఆంధ్రదేశంలో బ్రహ్మసమాజ ధర్మప్రబోధం చేయడానికి కారకులు నాయుడుగారే. వెంకటరత్నం నాయుడు గారిని 1932 లో 70 వ జన్మదినంనాడు ఆయన శిష్యులు, అనుయాయులు బ్రహ్మర్షి అనే బిరుదుని ఇచ్చి సత్కరించారు. ఆ బిరుదు నాయుడు గారికి సార్థకం. ఆయన మన ప్రాచీన మహర్షులకు ఏమాత్రం తీసిపోని మహనీయుడు. బౌద్ధమతం బోధించిన దయాగుణం, క్రైస్తవమతం బోధించిన మానవసేవా పరాయణత అంతర్లీనమైన బ్రహ్మ సమాజానికి బ్రహ్మర్షి ప్రతీక.

బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడు గారి రచనా వ్యాసంగం ఆంగ్ల భాషలో జరిగింది. అమూల్యమైన నాయుడుగారి ఆంగ్లోపన్యాసాలకి తెలుగులో భావానువాదాలు వారి శతజయంతి సందర్భంలో శతజయత్యుత్సవసంఘం వారు వెలుగులోకి తీసుకువచ్చారు. నాయుడుగారి ప్రార్థనగీతాలు కూడా కొన్ని తెలుగులోకి అనువదించారు. అవన్నీ చంద్రుడికో నూలుపోగు అన్నట్లు కొన్నిమాత్రమే. వారి ఆంగ్లరచనలు సంపుటాలుగా వెలువడ్డాయి. అవన్నీ నాయుడుగారి అచరణాత్మకమైన ఉపదేశాలకి అద్దాలు.

పవిత్రమైన శీలం, పరమమైన భక్తి, అమితమైన ప్రేమ, అనంతమైన ఔదార్యం మూర్తీభవించిన బ్రహ్మర్షి సర్‌రఘుపతి వెంకటరత్నంనాయుడు గారు సర్వశక్తుల్నీ సర్వసంపదల్నీ మానవసేవకి ధారపోసి బ్రహ్మసమాజానికి జీవితాన్ని అంకితం చేయటం వల్ల ఇరవయ్యో శతాబ్ది తొలిభాగంలో ఆంధ్రదేశంలో ఒక నూతనశకం వెలుగొందింది.

పిఠాపురం మహారాజు రావు వేంకటమహీపతి సూర్యరాయబహద్దర్ గారు రాజ్యం స్వీకరించిన మొదటిసంవత్సరాల్లోనే ప్రజాహితకార్యాలకి పూనుకున్నారు. అందునిమిత్తం రఘుపతి వెంకటరత్నంనాయుడు గారితో సమాలోచన చేస్తున్న సమయంలో అనాథల ప్రసంగం రాగానే, తల్లిదండ్రులులేని బిడ్డల స్థితి ఎలాంటిదో తమకు అనుభవపూర్వకంగా తెలుసుననీ, అనాథశరణాలయం స్థాపించడం తమకు చాలా ప్రియతమమైన విషయమని ఎంతధనమైనా ఖర్చుపెట్టడానికి నిశ్చయించారు. వెంటనే అనాథశరణాలయం నిర్మించడం మొదలుపెట్టి 1911 నాటికి అనాథ బాల

బాలికలకు రాజమందిరం వంటి భవనం నిర్మింపజేశారు. 'మేము అనాథులం కాము' అనే భావం వాళ్ళకి కలగడానికి ఎన్నోఏర్పాట్లు చేశారు. రాజాగారూ, రాణిగారూ వాళ్లని స్వంతబిడ్డల్లా చూచుకునేవారు. కోటలో జరిగే ఉత్సవాలన్నిటికి వాళ్ళని పిలుస్తూ కుటుంబసభ్యులుగా పెంచి పెద్దవాళ్ళని చేశారు. విద్యాబుద్ధులు నేర్పించి వివాహాలు చేయించి ఉద్యోగాలు కల్పించారు. రాజావారి అనాథశరణాలయంలో పెరిగిన బిడ్డలెందరో ఉన్నతమైన ఉద్యోగాలు చేసి, సమాజంలో ఉన్నతస్థానాన్ని అలంకరించారు.

పిఠాపురం మహారాజావారు అనేకమైన విద్యాసంస్థలు నెలకొల్పారు. విద్యాభి వృద్ధికి ఎంతో కృషిచేశారు. ముఖ్యంగా స్త్రీవిద్యకు, నిమ్నజాతులవారి విద్యకూ ఎంతో పాటుపడ్డారు. అనేకగ్రామాల్లో హరిజనులకోసం ప్రాథమికపాఠశాలలు స్థాపించడమేగాక, ఉన్నతపాఠశాలల్లోనూ ఉచితంగా విద్యనేర్పుతూ, దుస్తులూ పుస్తకాలూ కూడా ఉచితంగా ఇస్తుండేవారు. ఉన్నతపాఠశాలలో చదువు పూర్తి చేసినవారికి కాకినాడలోని కళాశాలలో చదువుకోడానికి వసతిసౌకర్యాలు కలిగించే వారు. హరిజనబాలురకోసం 1918లో వసతిగృహాలు కూడా నిర్మించి భోజన సదుపాయాలు ఏర్పాటు చేశారు. మహారాణివారు కూడా ఒక స్త్రీ సమాజం ఏర్పాటుచేసి, దాని కనుబంధంగా మధ్యతరగతి స్త్రీలనిమిత్తం ఒక పాఠశాల నిర్మించి అందులో సంగీతమూ, నాట్యమూ చేతిపనులూ, మొదలైన వృత్తి విద్యలు కూడా నేర్పించేవారు పిఠాపురం, రాజమండ్రి, కాకినాడలలో బాలికలకోసం ప్రత్యేకపాఠశాలలు ఉన్నప్పటికీ, ప్రభుత్వం సహవిద్యను ప్రతిపాదించినపుడు ఆ మూడు పట్టణాల్లో ఉన్న తమ పాఠశాలల్లోనూ ఉన్నత పాఠశాలల్లోనూ మహారాజా వారు సహవిద్య ఏర్పాటుచేసి, స్త్రీలకు ఉచితవిద్యా సౌకర్యాలు కల్పించారు.

బ్రహ్మసమాజోద్యమంలో భాగమైన మద్యపాననిషేధానికి కూడా మహారాజా వారు దోహదంచేశారు. సాలీనా లక్షరూపాయలకుపైగా ఆదాయంపోయినాసరే లెక్క సేయకుండా సంస్థానంలోని ఈతచెట్లనూ, తాడిచెట్లనూ కల్లుతీయరాదని కట్టడి చేశారు. లక్షరూపాయలు విరాళమిచ్చి ఆంధ్రబ్రహ్మ ధర్మప్రచారనిధి ఏర్పాటు చేశారు. కందుకూరి వీరేశలింగంగారు రాజమండ్రిలో నిర్మింపదలచిన పాఠశాల భవనానికి మొదట ఇరవైవేలరూపాయలు ఇస్తామని వాగ్దానంచేసి తర్వాత నలభై వేలరూపాయలు ఇచ్చారు. 'కల్పతరువువలె శ్రీపిఠాపురపు రాజుగారు మా పెరటి చెట్టయి నిలిచిరి' అని వీరేశలింగంగారు స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. అంతే

గాకుండా ఎవ్వరికీ గ్రంథాలు అంకితమివ్వని వీరేశలింగంగారు వారి ఆంధ్రకవుల చరిత్రని పిఠాపురం మహారాజావారికి అంకితమిచ్చారు.

పిఠాపురం మహారాజా వారి ఉదారమైన ఆర్థికసహకారంతోనే ఆంధ్ర దేశంలో బ్రహ్మ సమాజోద్యమం బహుముఖాలుగా విస్తరించింది. దానివల్ల ప్రాథమిక పాఠశాలలు, భోజన వసతి గృహాలు ఏర్పడి ఉచితవిద్యకు అవకాశం ఏర్పడింది. కాకినాడ, రాజమండ్రి, మొదలైన పట్టణాల్లో అనాథశరణాలయాలు, వితంతు శరణాలయాలు వెలసి దీనజనోద్ధరణ జరిగింది. పిఠాపురం మహారాజావారి ఆర్థికసహకారంతో వెలసిన పిఠాపురం, కాకినాడ, రాజమండ్రి పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ బాలికలందరికిని, హరిజనబాలురికిని, ఉచితవిద్య (free education) కొనసాగించడం ఒక ప్రత్యేకమైన విశేషం. భోజన వసతిగృహాల్లోనూ, అనాథశరణాలయాల్లోనూ హరిజనవిద్యార్థుల్ని తీసుకోవడం అపూర్వమైన విశేషం. పిఠాపురం మహారాజావారి ఆర్థికసహకారం లేకపోతే కందుకూరి వీరేశలింగంగారి, రఘుపతి వెంకటరత్నంగారి బ్రహ్మసమాజోద్యమం సాగేదికాదనడం అతిశయోక్తి కాదు.

కందుకూరి వీరేశలింగంగారి అనుయాయుల్లో చిలకమర్తి లక్ష్మి నరసింహం, కొమర్రాజు హనుమంతరావు, దేశిరాజు పెదబాపయ్య, బసవరాజు గవర్రాజు, జయంతి గంగన్న, పైడా వెంకటనారాయణ, నాళం కృష్ణారావు, రెబ్బాప్రెగడ సూర్య ప్రకాశరావు, పెద్దాడ సుందరశివరావు, యస్. కామేశ్వరమ్మ, మొదలైన వారు బ్రహ్మసమాజోద్యమాన్ని బలపరిచారు. అలాగే రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి అనుయాయుల్లో డాక్టర్ వేమూరి రామకృష్ణారావు, దివాన్ కోకా వెంకట సుబ్బారావు, గుడిపాటి వెంకటచలం, మొక్కపాటి రామమూర్తి, దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి, పెద్దాడ రామస్వామి, తారకం, మొదలైనవారు బ్రహ్మసమాజోద్యమాన్ని బలవత్తరం చేశారు. వల్లూరు నరసింహరాయడు, దుగ్గిరాల రామమూర్తి, చిలుకూరి వీరభద్రరావు, టేకుమళ్ల రాజగోపాలరావు మొదలైనవారు కూడా నాయుడుగారు నడిపించిన బ్రహ్మసమాజ సభా కార్యక్రమాల్లో పాల్గొనేవారు.

వీరేశలింగం గారి అడుగుజాడల్లో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, కథలూ, ప్రహసనాలూ, అసంఖ్యాకంగా

రచించారు. చిలకమర్తి వారి రచనల్లో బ్రహ్మసమాజం అవ్యక్తంగావున్నా సంస్కారప్రియత్వం, సహృదయత్వం, విశ్వప్రేమ ప్రతివాక్యంలోనూ వ్యక్త మవుతూ వుంటాయి. మంగిపూడి శర్మగారు బాలవితంతువుల మర్భరస్థితిని 'బాలవితంతువిలాపం' అనే కావ్యంలో కరుణరసనిర్భరంగా వర్ణించారు. వారి 'సానుభూతి' మొదలైన ఇతర గ్రంథాల్లో బ్రహ్మసమాజతత్త్వం ప్రస్ఫుటంగా వుంది. ఆయన అస్పృశ్యతా నివారణకోసం, నిమ్నజాతి సముద్ధరణకోసం నిరంతరం కృషిచేశారు. వారి 'నిరుద్ధ భారతం' అనే గ్రంథం అందుకు నిదర్శనం. రాయసం వెంకటశివుడుగారు గురువు గారైన వీరేశలింగం గారి చరిత్ర వ్రాశారు. స్త్రీవిద్య ఆయన అభిమాన విషయం. స్త్రీలకోసం తెలుగు జనానా అనే పత్రికని నడిపారు. ఆదిపూడి సోమనాథరావు గారు వితంతు వివాహోద్యమంలో పాల్గొన్నారు. బహుగ్రంథాలు రచించారు. విశ్వకవి రవీంద్రుని 'గీతాంజలి' ని మొట్టమొదట తెలుగులోకి అనువదించింది వీరే దయానంద సరస్వతి 'సత్యార్థప్రకాశిక' ను కూడా తెనిగించారు. కవుతా శ్రీ రామశాస్త్రిగారు స్వయంగా సంస్కరణోద్యమంలో పాల్గోవడమే గాకుండా తమ సర్వస్వాన్ని ధారపోసి శారద అనే మాసపత్రికను బందరులో స్థాపించారు. బంకించంద్రుని వందేమాతరం గీతం పాడటంలో ఆయన దిట్ట. ఇక వీరేశలింగంగారి స్త్రీవిద్యా వ్యాప్తిని అందుకొని నిర్వర్తించిన స్త్రీలలో కొటికలపూడి సీతమ్మ, పులుగుర్తి లక్ష్మీనరసమాంబ, బాలాంత్రపు శేషమ్మ, మొదలైనవారు హిందూ సుందరి, సావిత్రి మొదలైన పత్రికలు నడిపారు. పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు ఎన్నో నవలలు వ్రాశారు. కొటికలపూడి సీతమ్మ గారు వీరేశలింగంగారి జీవితచరిత్రను రచించారు. బండారు అచ్చమాంబ గారు స్త్రీలకోసం చాలా పాటుపడ్డారు. వీరి 'అబలాసచ్చరిత్ర రత్నమాల' చాలా ప్రసిద్ధమైన గ్రంథం.

అనాథశరణాలయాల్లోను, భోజనవసతిగృహాల్లోను చేరి అభివృద్ధికి వచ్చిన పిళ్ళారిసెట్టి సీతారామయ్య, పి. పి. రాజ్, నాభి జగన్నాథరావు, ఆకురాతి చలమయ్య, రొక్కం బాలకృష్ణరావు, పెద్దాద సత్తిరాజు, టి. యస్. శర్మ, ఆర్. పద్మనాభం, యమ్. జానకిరామయ్య, మొదలైనవారు తీవ్రమైన బ్రహ్మసామాజికులు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రఘుపతి వెంకటరత్నంనాయుడు గారు కవల సోదరుల్లా నిర్వహించిన బ్రహ్మ సమాజోద్యమం సాంఘిక, సాహిత్య,

పత్రికా రంగాలకి మాత్రమేగాక రాజకీయరంగానికి సహితం వ్యాపించింది. భారత దేశాన్ని విదేశీయపరిపాలన అనే కబంధహస్తాల నుంచి విడిపించి స్వాతంత్ర్యం సంపాదించడానికి ప్రేరణ కలిగించింది. కొండా వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశంపంతులు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, బులుసు సాంబమూర్తి, అయ్యగారి కాశేశ్వరరావు, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, మాగంటి బాపినీడు, అన్నపూర్ణాదేవి, వేదాంతం కమలాదేవి జయంతి నారాయణ, తల్లాప్రగడ ప్రకాశరాయడు, గరిమెళ్ల వీరభద్రరావు, మొదలైన స్వాతంత్ర్య సమరయోధులు బ్రహ్మసమాజోద్యమం వల్ల ప్రభావితులైనవారే. బ్రహ్మసమాజ కార్యక్రమాలు కాంగ్రెస్ కార్యక్రమాల్లో అంతర్గతం కావడం చారిత్రక సత్యం.

ఆంధ్రదేశంలోని బ్రహ్మసమాజోద్యమానికి రాజమండ్రి ప్రథమకేంద్రమూ, కాకినాడ ప్రధానకేంద్రమూ అయినా, క్రమంగా ఇతరకేంద్రాల్లో కూడా అభివృద్ధి చెందింది. 1832 లోనే బందరులో కోకా వెంకటరత్నంనాయుడుగారు బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. దాన్ని రఘుపతి వెంకటరత్నంనాయుడు, డాక్టర్ వేమూరి రామకృష్ణారావు, గుడిసేవ సుబ్బయ్య మొదలైనవారు బాగా అభివృద్ధికి తెచ్చారు. 1898లో జి. వెంకటనారాయణనాయుడుగారు గుంటూరులో బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. పాలపర్తి నరసింహం మొదలైనవారు దానికి ప్రాణంపోశారు. బాపయ్యగారు బాపట్లలోను, పిల్లారిసెట్టి సీతారామయ్యగారు చీరాలలోనూ బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. 1904లో నమశ్శివాయ మొదలైనవారు విశాఖపట్టణం లోను, 1906లో పావకేశ్వరరావు మొదలైనవారు ఏలూరులోను నరసాపురంలోను, 1909లో మొక్కపాటి సుబ్బారాయుడు కోకా వెంకటసుబ్బారావు పిఠాపురంలోను, బ్రహ్మసమాజం స్థాపించారు. నాళం కృష్ణారావుగారు కూడ ఏలూరులో బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. బొంబాయి వాస్తవ్యులైన వాడియాగారు ఏలూరు బ్రహ్మ సమాజమందిర నిర్మాణానికి భూరివిరాళం ఇచ్చారు. శ్యామలాంబ, కలగల పిచ్చమ్మ అనేవారు స్త్రీలకోసం ప్రత్యేకంగా ఒక సంస్థను నడిపారు. ఇలా పట్టణాల్లోనే గాకుండా పల్లెపట్టులికి సైతం బ్రహ్మసమాజోద్యమం వ్యాపించింది. తూర్పుగోదావరిజిల్లాలోని పశువుల్లంక, యానాం, రామచంద్రపురం, ఆలమూరు, కందికుప్ప అనే గ్రామా ల్లోను పశ్చిమగోదావరిజిల్లాలోని మాధవరం, కుముదవల్లి, రేలంగి, మొదలైన గ్రామాల్లోనూ చిన్న చిన్న బ్రహ్మసమాజాలు బయలుదేరాయి. విశాఖపట్టణం, పిఠాపురం, కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, విజయవాడ, మచిలీపట్టణం,

గుంటూరు, చీరాల, మొదలైన ముఖ్యనగరాల్లో బ్రహ్మసమాజ మందిరాలు నిర్మింపబడ్డాయి.

ఆంధ్రుల బ్రహ్మసమాజోద్యమం ఇప్పటి ఆంధ్రేతర ప్రాంతాలైన మదరాసులోను బరంపురంలోనూ మాత్రమేగాకఅప్పటి ఆంధ్రేతర ప్రాంతమైన హైదరాబాదులోను, కన్నడప్రాంతంలోని బెంగుళూరులోనూ విరివిగా సాగింది. బరంపురంలో జయంతి వెంకటనారాయణగారు బ్రహ్మసమాజాన్ని స్థాపించారు · దానికి ఎ. పి. పాత్రో మంచి భవనం కట్టించారు. రొక్కం బాలకృష్ణారావుపంతులు బరంపురం బ్రహ్మసమాజాన్ని బాగా అభివృద్ధికి తెచ్చారు, మదరాసులో మొదటినుంచి బ్రహ్మసమాజోద్యమాన్ని తెలుగువారే నిర్వహించారు. కందుకూరి వీరేశలింగంగారి బ్రహ్మసమాజోద్యమానికి కొంతకాలం మదరాసు, మరికొంతకాలం బెంగుళూరు విడిది గృహాలు. హైదరాబాద్‌లో దక్కన్ బ్రహ్మసమాజం ఏర్పడింది. ప్రొఫెసర్ యన్. జి. విల్లింకర్, గాదేపల్లి సూర్యప్రకాశం, నిత్యానంద మొదలైనవారు హైదరాబాదు బ్రహ్మసమాజాన్ని బాగా అభివృద్ధికి తెచ్చారు.

ఇలా ఆంధ్రదేశంలోనూ చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ ఆంధ్రుల బ్రహ్మసమాజోద్యమం అభివృద్ధిపథంలో నడిచి సాధించిన అనేక ఘనకార్యాల్లో హరిజనోద్ధరణ ఒకటి. అందుకు గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణదంపతులు చేసిన సేవ అసామాన్యమైనది వారి 'మాలపల్లి' నవల అందుకు ప్రబల నిదర్శనం.

1927 నుంచీ ఆంధ్రబ్రహ్మసమాజనిధి ఒక ఇరవై సంవత్సరాలపాటు ప్రచారకుల్ని పోషించింది. అందులో స్త్రీలు, పురుషులు ఉన్నారు. గౌణంబ, పాలావజ్ఝల లక్ష్మీనారాయణ, గుడిపాటి సత్యనారాయణ, వెంపలి సుబ్బయ్య, ఊట్ల సుబ్బయ్య, మొదలైనవారు ఉద్యోగులైన ప్రచారకులు. కలకత్తాలో లాగే అరవైసంవత్సరాలపాటు ఆంధ్రబ్రహ్మసాధనాశ్రమం అనే ఒక అనుబంధసంస్థ ఒకటి నిర్వహించబడింది. ఈ ఆశ్రమం కొందరు సాధకుల్ని ఎన్నుకొని ధ్యానాధ్యయనమార్గాల్లో తర్ఫీదు ఇచ్చేది. ఈ ఆశ్రమానికి ప్రధానకార్యస్థానం కాకినాడలో వుండేది. ఆశ్రమసభ్యులు అప్పుడప్పుడు వివిధప్రదేశాల్లో సమావేశమై ప్రార్థన కార్యక్రమాలు నిర్వహిస్తూ అనుభవాన్ని వినిమయం చేసుకునేవారు. ఆంధ్ర బ్రహ్మసమాజం తరపున ఆంధ్ర బ్రహ్మసాధనాశ్రమం తరపున ధర్మసాధని, ధర్మజ్యోతి అని రెండు పత్రికలు నడపబడ్డాయి. కె. కల్యాణస్వామిగారు సాధన అనే

ఆంగ్లపత్రికను నడిపేవారు. నివేదన అని మరో పత్రిక వచ్చేది. ఆంధ్రదేశంలోని బ్రహ్మసమాజం అప్పుడు తాత్త్వికవిషయాల్లో వ్యాసరచనలో పోటీలు నిర్వహించి విద్యార్థులకి బహుమతులు ఇచ్చేది.

బ్రహ్మసమాజోద్యమం బహుళవ్యాప్తి చెందడానికి కందుకూరి వీరేశలింగం గారి తెలుగుగ్రంథాలు, రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి ఇంగ్లీషు గ్రంథాలు మాత్రమే గాక, ఇతరభాషల్లోని అనేక గ్రంథాలు అనువదించడం జరిగింది. మహర్షి దేవేంద్రనాథ్ ఠాకూరు ఆశువుగా చెప్పగా, అక్షయకుమార్‌దత్ గ్రంథస్థం చేసిన 'బ్రాహ్మధర్మం' అనే ఉద్గ్రంథాన్ని పాలావజ్ఝల లక్ష్మీనారాయణ, పాలపర్తి నరసింహం కలిసి తెలుగుచేశారు. కేశవచంద్రసేన్ వ్రాసిన 'జీవన్‌వేద, బ్రహ్మ గీతోపనిషత్' అనే గ్రంథాన్ని సాధు కవికొండల సాంబశివరావు గారు అనువాదం చేశారు. పాలపర్తి నరసింహంగారి 'బ్రాహ్మమతం' ప్రముఖమైన గ్రంథం తల్లా ప్రగడ ప్రకాశరాయుడు గారి 'గీత నివేదికలు, జీసస్ సందేశము' మొదలైన గ్రంథాలు ముఖ్యమైనవి. పాలపర్తి నరసింహంగారు ధర్మసాధని అనే పత్రికని, తల్లావజ్ఝల ప్రకాశరాయుడుగారు ధర్మజ్యోతి అనే పత్రికని ప్రకటించారు. కామ రాజు హనుమంతరావుగారు ప్రాక్ప్రతీచి అనే పత్రికని ప్రచురించి బ్రహ్మసమాజ భావవ్యాప్తికి బాగా తోడ్పడ్డారు. ఆకురాతి చలమయ్యగా రొకరు అనేక గ్రంథాలు ప్రచురించారు. తారకంగారు రాజారామమోహనరాయల పండిత శివనాథశాస్త్రి గార్ల జీవితచరిత్రల్ని రచించారు. ఆయన బహుకాలం ధర్మసాధని పత్రికకి సంపాదకత్వం వహించారు సర్వమతసమత్వం గురించి, సంఘసంస్కరణల గురించి, హరిజనోద్ధరణల గురించి అనేకవ్యాసాలు వ్రాశారు ఆదిపూడి సోమనాథరావుగారు, అనేక గ్రంథాలు అనువాదంచేశారు ఆదిపూడి సోమనాథరావుగారు, పిల్లారిసెట్టి సీతారామయ్యగారు హరికథలద్వారా బ్రహ్మసమాజోద్యమాన్ని బహుళ ప్రచారం చేశారు. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి వల్ల ప్రబోధితులైన గుడిపాటి వెంకటచలంగారు ఎన్నో పాటలు రచించారు. నాయుడుగారి వల్ల నవ చైతన్యం చెందిన దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి గారు అసంఖ్యాకంగా ప్రార్థన గీతాలు రచించారు. ఆయన 'మహతి,' ఋగ్వీధి, మొదలైన గ్రంథాలు ప్రసిద్ధాలు. గురుదేవులైన రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి గురించి దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారు చేసిన ఉపన్యాసాలు, వ్రాసిన వ్యాసాలూ అమూల్యమైనవి.

రవీంద్రుని శాంతినికేతన్ ప్రసాదించిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, మల్లవరపు విశ్వేశ్వరరావు, ఆకురాతి చలమయ్య గార్లు రవీంద్రుని సాహిత్యాన్ని తెలుగు చేయడంద్వారా బ్రహ్మసమాజభావాల్ని ప్రసారం చేశారు. ముట్నూరి కృష్ణారావుగారి కృష్ణాపత్రిక వ్యాసాలూ, పాలావజ్ఝల సీతారామబ్రహ్మంగారి ఆంధ్రప్రభ వ్యాసాలూ కూడా బ్రహ్మ సమాజోద్యమం వ్యాప్తికి దోహదం చేశాయి. డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు కాంగ్రెస్ వేదికమీద తమ గురువైన రఘుపతి వెంకటరత్నం నాయుడు గారికి శ్రద్ధాంజలి ఘటిస్తూ కావించిన అధ్యక్షోపన్యాసం బ్రహ్మసమాజోద్యమానికి గర్వకారణం.

బెంగాల్ మొదలైన ఇతరరాష్ట్రాలనుంచి ప్రసిద్ధులు ప్రముఖులు అయిన బ్రహ్మ సామాజికులు తరుచూ ఆంధ్రదేశానికి వచ్చి అమూల్యమైన ఉపన్యాసాలు ఇవ్వడంవల్ల బ్రహ్మసమాజోద్యమం బలపడింది. అలా వచ్చిన మహనీయుల్లో పండిత శివనాథశాస్త్రి, సీతానాథతత్త్వభూషణ్, బిపినచంద్రపాల్, రామనాథఛటర్జి, బ్రజగోపాల్‌నియోగి, ప్రమోద లాల్‌సేన్, నిర్భరప్రియఘోష్, దేవేంద్రనాథమిత్రా, జైమినికాంతకర్, ప్రఫుల్లచంద్రసేన్, పి. ఆర్. షిండే, జి.యల్. చందవర్కర్, రివరెండ్ డ్రూమండ్, డాక్టర్ రట్టర్, రివరెండ్ సుందర్‌లేండ్ ప్రభృతులు ఎందరో ఉన్నారు. వారి ఆగమనంవల్ల ప్రబోధంవల్ల బ్రహ్మసమాజపద్ధతుల్ని అవలంబించిన కుటుంబాల్లో నూతన చైతన్యం కలుగుతుండేది. ప్రజాసామాన్యంలోకూడా ప్రత్యేకాసక్తి కలిగేది. మతపరమైన విశాలదృక్పథంతోపాటు సంఘపరమైన సహజీవనదృక్పథం సర్వవ్యాప్తమయింది.

ఇరవయ్యో శతాబ్దిలో బ్రహ్మ సమాజం సమావేశాలు స్వల్పవ్యవధిలో వివిధ స్థలాల్లో జరుగుతుండేవి. 1929 నుంచి తప్పనిసరిగా వార్షికోత్సవాలు జరుగుతుండేవి ఏడాదికోసారి వార్షికసభలు నిర్వహించినా దాని ప్రయోజనం దాని కుండేది. సమష్టి జీవనదృక్పథంతోపాటు ఆధునిక జీవన విధానం అలవడడానికి ఆంధ్రదేశంలో బ్రహ్మ సమాజోద్యమం ఎంతో ఉపకరించింది.

ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ జరిగే బ్రహ్మసమాజ కార్యక్రమాల్ని ఏకీకృతం చేసి ఒక కేంద్ర ఆధ్వర్యంలో నిర్వహించడానికి ప్రయత్నం జరిగింది. లభించిన విజయం తక్కువైనా ఫలించిన ప్రయోజనం ఎక్కువ. 1916 లోఆంధ్ర బ్రహ్మ మండలి అనే సంస్థ స్థాపించబడింది. తర్వాత ఆంధ్రబ్రహ్మ సంఘం

అని మరో సంస్థ, ఆ తర్వాత ఆంధ్రబ్రహ్మసభ అని ఇంకో సంస్థ వెలువడ్డాయి. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు జస్టిస్ పార్టీలో చేరినపుడు కొంత ప్రతిఘటన వచ్చింది కాని మహామేధావి, మహాఋషికల్పుడు అయిన మహావ్యక్తి సుదీర్ఘమైన సమాలోచనచేసి ఒక నిర్ణయం తీసుకొన్నప్పుడు దాని మంచిచెడ్డలు నిర్ణయించడం మంచిపనికాదు. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు ఎంత సంఘసంస్కర్తో అంత దేశభక్తుడు. ఆయన ప్రధానంగా మానవతావాది. జాతీయతాభావంలో ఆయన ఎవ్వరికీ తీసిపోరు. వందేమాతరం ఉద్యమం పతాకస్థాయిని వెళ్లిన సమయంలో ఆయన పోలీసుజులుంని ప్రతిఘటించారు 'నా కళాశాల ఆవరణలో నేనే సర్వాధికారిని. ఈ ఆవరణలో మీరు అడుగుపెట్టరాదు. నా విద్యార్థుల్ని నిర్బంధించరాదు' అని నాయుడుగారు సింహగర్జన చేస్తే ఏ పోలీసు అధికారి అందుకు సాహసించలేదు. సహాయనిరాకరణోద్యమం సాగినపుడు సమకాలిక రాజకీయాలతో ఆయనకు గల అభిప్రాయభేదాల్ని నిర్ద్వంద్వంగా ప్రకటించారు. నైతికబలం కల వ్యక్తి ఆయన. వీరేశలింగం గారిని, వెంకటరత్నంనాయుడుగారిని బ్రిటిషు ప్రభుత్వానికి దాసులనడం దారుణమైన విషయం. వారే నిజమైన ప్రథమ జాతీయ వాదులు. ప్రప్రథమాంతర్జాతీయ వాదులు. బ్రహ్మ సమాజనాయకులు. రఘుపతి వెంకటరత్నంనాయుడుగారికి నైట్‌హుడ్ బహూకరించినపుడు ఆయన విద్యుక్తమైన 'రోబ్' ధరించడానికి తిరస్కరించడం, కుచ్చులపాగా తొలగించకపోవడం గమనించవలసిన విషయం ఏదోలోపాన్ని వీరేశలింగంగారికి వెంకటరత్నంనాయుడు గారికి ఆపాదించడం ఆంధ్రదేశంలోని బ్రహ్మసమాజోద్యమానికి వక్రభాష్యం చెప్పడమే అవుతుంది. వారిద్దరే ఆంధ్రదేశంలోని బ్రహ్మ సమాజోద్యమానికి మూలస్తంభాలు.

ఆంధ్రదేశంలోని బ్రహ్మసమాజోద్యమానికి ఆదర్శం బ్రాహ్మధర్మం. అది హిందువుల పవిత్రగ్రంథాలకి, ప్రస్థానత్రయానికి మేలు కలయిక. బ్రహ్మ సమాజానికి ఋక్కులవంటి గీతాలు వున్నాయి అవి ఆంధ్రదేశమంతటా పాఠశాలల్లోనూ, సమావేశాల్లోనూ పాడబడేవి. వాటికి విశ్వజనీనత ప్రముఖలక్షణం. బ్రహ్మ సమాజానికి సభ్యులసంఖ్య తక్కువైనా వారందరూ బ్రహ్మ సమాజోద్యమానికి జీవితాల్ని అంకితం చేసినవారు. బ్రహ్మసమాజనాయకులు కోటీశ్వరులు కాకపోయినా నిజాయితీకి కొరతలేదు. పైగా ఉన్నంతలో స్వంతధనాన్ని అందరూ ధారపోసినవారే. రఘుపతి వెంకటరత్నంగారి సంపాదనంతా సమాజానికి వార

సత్యం అయింది. వీరేశలింగం గారు సర్వస్వాన్నీ ప్రజలికి ధారపోశారు. కోశా వెంకటసుబ్బారావుగారు గుప్తదానానికి ప్రసిద్ధులు. డాక్టర్ వేమూరి రామకృష్ణా రావుగారు బ్రహ్మబంధునిధిని ఏర్పరిచారు. పెద్దాడ రామస్వామిగారు ఇవ్వడానికి దాచుకొన్నదిలేదు. నాభి జగన్నాథరావుగారు బ్రహ్మసమాజానికి అందజేసిన సహాయసంపత్తి అందరికీ తెలిసిందే. ఇంకా ఎందరో తమ ఆస్తిపాస్తుల్ని త్యాగం చేసిన మహానుభావులు వున్నారు. పిఠాపురం మహారాజుగారు సరేసరి.

బ్రహ్మసమాజం నిర్వహించిన ఉత్సవాల్లో 1945లో పిఠాపురం మహారాజా గారికి చేసిన వజ్రోత్సవం ఒకటి. 1948లో వీరేశలింగంగారి శతజయంతి, 1962లో వెంకటరత్నంనాయుడుగారి శతజయంతి ముఖ్యమైనవి. అంతేగాకుండా 1928లో బ్రహ్మసమాజస్థాపన శతజయంతి, 1930లో రాజారామమోహనరాయల శతవర్థంతి, 1972లో రాజారామమోహనరాయల ద్విశతజయంతికూడా ప్రముఖ మైనవి. రాజారామమోహనరాయల ద్విశతజయంత్యుత్సవం తాత్కాలికంగా పునరుద్ధ రణోత్సాహానికి పునాది వేసింది. భారతదేశంలో ఏ విశ్వవిద్యాలయంలోనూ రాజా రామమోహనరాయల పేరుతో బహుమతికాని పతకంకాని లేకపోయినా, ఒక్క ఆంధ్రవిశ్వవిద్యాలయం మాత్రం ఆయన ద్విశతజయంతి సందర్భంగా ప్రవేశ పెట్టింది. అదొక చరిత్రాత్మక సంఘటన.

రాజారామమోహనరాయల ద్విశతజయంతి సందర్భంగా జరిగిన మరొక విశేషం రాజారామమోహనరాయల రచనలలోని ప్రముఖఘట్టాల తెలుగు అను వాదాల్ని ప్రకటించడం. అది ఇప్పుడు సర్వోదయ నాయకులుగా వున్న తల్లాప్రెగ్గడ ప్రకాశరాయుడుగారి కృషిఫలితం. ఈ సందర్భంలో గుర్తుపెట్టుకోవలసిన అంశం మరొకటి వుంది. అది ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సంకేతముద్రలోవున్న 'తేజస్వి నావధీతమస్తు' అనే శాసనసూక్తం బ్రహ్మసమాజానికి చెందిన గొప్పవిద్యావేత్త డా॥ వేమూరి రామకృష్ణరావుగారు రూపొందించడం. ఆంధ్రబ్రహ్మసమాజంవారి పతాక 'ఏకమేవాద్వితీయమ్'. 'సత్యమేవజయతే', 'బ్రహ్మకృపాహి కేవలమ్' అనే ఉపనిషత్ సూక్తులతో ఆకాశవీథిలో రెపరెపలాడింది. స్వతంత్ర భారతప్రభుత్వ సంకేతముద్రలో సహితం 'సత్యమేవ జయతే' అనే సూక్తి వుండటం ఆంధ్రబ్రహ్మ సమాజానికి గర్వకారణం.

ప్రతి ఉద్యమంలోనూ పతనోత్థానాలు పరిపాటి. అలాగే ప్రస్తుతం బ్రహ్మ సమాజోద్యమం పతనావస్థలోవుండటం పరమసత్యం కాని బ్రహ్మసమాజం అనేకులకు

సర్వసమ్మతం కాకపోయినా, బ్రహ్మసమాజం ఆదర్శాలు సర్వశిరోధార్యాలు అయ్యాయి. ఒక సంస్థగా బ్రహ్మసమాజం పతనోన్ముఖం అయినా ఒక ప్రభావంగా అది సజీవం. సర్వజనీనం. బ్రహ్మసమాజం నిర్వహించిన వర్ణాంతర వివాహాలు ఇప్పటికీ ఆదర్శమే. పిఠాపురం మహారాజా తమ కూతుళ్లకి రాష్ట్రాంతర వివాహాలు చేశారు. కోకా వెంకటసుబ్బారావుగారి కొడుకులూ కూతుళ్లూ కేరళ, కర్ణాటక, ఉత్తరప్రదేశ్‌లలో వివాహాలు చేసికొన్నారు. నాభి జగన్నాథ రావు గారి అమ్మాయి, మనుమరాలు కూడా మహమ్మదీయుల్ని పెండ్లిచేసికొన్నారు. ఆకురాతి చలమయ్యగారు బెంగాలీస్త్రీని వివాహమాడారు. కె సి. పాత్రోగారు తెలుగు బాలవితంతువుని పెళ్ళిచేసికొన్నారు. కవికోకిల సరోజినినాయుడు గారు ఆంధ్రుల కోడలు కావడం ఆంధ్రులికి గర్వకారణం. ఇటువంటి వర్ణాంతర వివాహాలు ఈనాడు భారీఎత్తున జరగవలసి వుంది. అలాగే బ్రహ్మసమాజం ఆరంభించిన హరిజనోద్ధరణ కార్యక్రమం ఇంకా మిగిలివుంది. ఆంధ్రదేశంలో జరిగిన, జరగవలసిన ఆర్థిక, సాంఘిక, విద్యావిషయక, రాజకీయ సంస్కరణలకి ప్రత్యేకంగానూ పరోక్షంగానూ బాధ్యతకలది బ్రహ్మసమాజం. జాతిమతకులభేదంలేని, వర్ణభేదంలేని, వర్గభేదంలేని సమసమాజం బ్రహ్మసమాజం రూపాంతరమే.

ముద్రణ :- శివాజీప్రెస్, సికింద్రాబాదు.

# బౌద్ధ తాత్త్విక చింతన - ఆంధ్రుల సేవ

డా॥ యస్. రాధాకృష్ణన్ స్మారకోపన్యాసము

(న్యూఢిల్లీలో ఏర్పాటు చేయబడినది)




ఉపన్యాసకర్త

ఆచార్య కె. సచ్చిదానందమూర్తి

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు





అంతర్జాతీయ తెలుగు సంస్థ

హైదరాబాదు

1980

# ప్రస్తావన



(ఆచార్య కె. సచ్చిదానందమూర్తిగారి ఆంగ్ల మూలమునకు
తెలుగు అనువాదము, డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు)



డా. సర్వేపల్లి రాధాకృష్ణమూర్తి

జననం: 5-9-1888 నిర్యాణం: 17-4-1975

స్వస్తి "జితం భగవతా తేన సమ్బుద్ధేన కృపాత్మనా
నిర్వాణప్రాప్తయే యేన సద్యోమార్గః ప్రదర్శితః"[1]

"డా॥ యస్. రాధాకృష్ణన్ స్మారకోపన్యాసము" అనేదానిని స్థాపించి, ప్రథమోపన్యాసానికి ఈ విషయాన్ని ఎన్నుకొన్న అంతర్జాతీయ తెలుగుసంస్థవారు చాలా అభినందనీయులు. వాస్తవంలో రాధాకృష్ణన్‌ను ఎక్కువగా ప్రభావితుని చేసినదీ, ఆయనను ఒక తాత్త్వికవిచారమార్గంలో నడిపించినదీ, అద్వైత వేదాంతమే అయినా, ఆధునిక భారతీయ తత్త్వ శాస్త్ర పండితులలో ప్రప్రథమంగా, సదవగాహనతో బౌద్ధ సిద్ధాంతాన్ని బాగా అధ్యయనం చేసినది ఈయనే. "ఇండియన్ ఫిలాసఫీ" అనే తన గ్రంథంలో బౌద్ధమతాన్ని గూర్చి సవిస్తరంగా నిరూపించడమే కాకుండా ఆయన 1938 వ సంవత్సరంలో "మహామేధావి గౌతమ బుద్ధుడు" అనే శీర్షికతో "బ్రిటిష్ అకాడమీ ఉపన్యాసం" ఇచ్చారు. కొంతకాలం తరువాత టిప్పణికూడా చేర్చి 'ధమ్మపదం' ఆంగ్లంలోకి అనువదించారు. అందుచేత ఈ ఉపన్యాస పరంపరలో మొదటి ఉపన్యాసం బౌద్ధ మతాన్ని గూర్చి ఏర్పరచడం ఎంతైనా సమంజసంగా ఉంది. ఈ ఉపన్యాసం ఇవ్వవలసిందిగా నన్ను ఆహ్వానించినందుకు నేను అంతర్జాతీయ తెలుగుసంస్థ అధికారులకు కృతజ్ఞుడను.

బౌద్ధమతం బుద్ధుని జీవితకాలంలోనే ఆంధ్రదేశంలో ప్రవేశించింది. క్రీస్తుశకం ఆరవ శతాబ్దంవరకూ కూడా[2] దీని చరిత్ర ఈ ప్రాంతంలో మహోజ్జ్వలంగా నడిచింది. ఐతే, బుద్ధుని ఆరాధన మాత్రం ఇక్కడ పన్నెండవ శతాబ్దంవరకూ అవిచ్ఛిన్నంగా జరిగింది.[3] పురావస్తుతత్త్వ విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని ప్రప్రథమంగా జరిగిన ఆంధ్రదేశీయ బౌద్ధమత పరిశోధనల ప్రకారం "జాతిమీద ఏ ఆంధ్ర సంస్కృతి చెక్కబడిందో, గోతిలోనుంచి ఏ ఆంధ్రసంస్కృతి వెలికి తీయబడిందో అది అంతా బౌద్ధ సంస్కృతియే"[4]. ఆంధ్రదేశంలో అడుగడుగునా బౌద్ధమతావశేష చిహ్నాలు లభించాయి. బహుశా ఇంత అధిక సంఖ్యలో భారత దేశంలోని మరి ఏ ప్రాంతంలోనూ ఇవి లభించలేదని చెప్పవచ్చు. "ఆంధ్రులు అత్యుత్తమమైన శక్తి సామర్థ్యాలు గల జాతిగా కనబడతారు. అమరావతీ శిల్ప

సంపద విషయంలోనూ, నాగార్జునుని తత్త్వశాస్త్రం విషయంలోనూ, మనం ఆంధ్రులకు ఋణపడి ఉన్నాం. ఇండోచైనా, జావా-సుమాత్రా దేశాలకు నాగరికత నేర్పిన ఓడలు బహుశా ఈ ఆంధ్రదేశంలోని రేవులనుంచే బయలుదేరి ఉంటాయి"[5] అని జి. జోవో డుబ్రుయిల్ ( G. JOUVEAU - DUBREUIL ) వ్రాసి ఉన్నాడు. ఈ ఫ్రాన్సు దేశపండితుడు ఈనాడు వ్రాస్తే అంధకుల సిద్ధాంతాన్ని, ప్రజ్ఞాపారమితా సిద్ధాంతాన్ని, రత్నకూట వాఙ్మయాన్ని, మహాయానాన్ని, నాగార్జునితో సరితూగే మహా పండితులు రూపొందించిన ఇతరమైన ఉత్తమ సిద్ధాంతాలనీ కూడా బౌద్ధమతానికి ఆంధ్రులు చేసిన అపూర్వసేవగా పేర్కొని ఉండేవాడు.

# 1. పింగియ బౌద్ధమతాన్ని ఆంధ్రదేశంలోనికి తీసుకువచ్చాడు

ఇంక నేను బౌద్ధమతం ఆంధ్రదేశంలో ఎట్లా ప్రవేశించిందో ఆ కథ చెప్పడానికి ఉపక్రమిస్తాను. ఈ వృత్తాంతం మనకు 'సుత్తనిపాతము' అనే అతి ప్రాచీన బౌద్ధమత గ్రంథంలో లభిస్తుంది. దీన్ని చాలా చక్కగా అనువదించిన లార్డ్ ఛాల్మెర్స్ అభిప్రాయం ప్రకారం ఇది అతి పురాతన బౌద్ధసిద్ధాంతాలన్నింటినీ పొందుపరచిన ప్రాచీనగ్రంథం. బుద్ధుని కాలంలో గోదావరీ నదీతీరాన ఉన్న అశ్మక దేశంలో 'ములకము'[7] దగ్గర బావరీ గోత్రానికి చెందిన ఒక బ్రాహ్మణుడు ఉంఛవృత్తితో నివసిస్తూ ఉండేవాడు. (పొలాలలో పంటలు కోసివేసి ఇంటికి తీసికొని పోయిన తరవాత అక్కడ రాలిన ధాన్యపు గింజలూ, వెన్నులూ ఏరుకొని, వాటిమీదనే జీవించడానికి 'ఉంఛవృత్తి' అని పేరు). నూట ఇరవై సంవత్సరాల వయస్సుగల ఆ బ్రాహ్మణుడు, మూడు వేదాలలోనూ, ఇతిహాసంలోనూ మహా పండితుడు. ధర్మతత్త్వం చక్కగా తెలిసినవాడు. ఐదువందల మంది విద్యార్థులు ఆయన దగ్గర విద్యాభ్యాసం చేస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో శ్రావస్తిలో నివసిస్తూన్న సర్వద్రష్ట (చక్షుమా), సర్వధర్మ పారంగతుడూ అయిన సర్వజ్ఞ భగవానుని గూర్చి ఒక దేవత ద్వారా ఆ బ్రాహ్మణునికి తెలిసింది. చాల అరుదుగా భూలోకంలో అవతరించే సర్వజ్ఞుడైన ఆ బుద్ధభగవానుని దర్శనంచేసి రావలసిందిగా ఆ బ్రాహ్మణుడు తన దగ్గర ఉన్న విద్యానిష్ణాతులైన, పదహారుగురు శిష్యుల్ని పంపించాడు. ఆ పదహారుగురిలో ప్రతిఒక్కరివెంటా వారి వారి శిష్యులు ఉన్నారు. ఈ పదహారుగురు శిష్యులు కేవలం పండితులే కాకుండా ధ్యాన శీలులు

కూడా (ఝాయీ). వారు నిత్యమూ ధ్యానం (ఝాన) చేస్తూండేవారు. వాళ్లలో పింగియ అనే శిష్యుడు, వార్ధక్యంచేత దుర్బలంగా ఉండేవాడు కాని అతడు మహర్షి (మహఇసి). వారు బుద్ధుని దర్శనంచేసి, తమ గురువుగారు చెప్పిన జగదుద్ధారకుడు ఆయనే అని నిశ్చయించుకొన్నారు. అయన్ని కొన్ని ప్రశ్నలు వేయగా వారికి సంతృప్తి కరమైన ప్రత్యుత్తరాలు లభించినాయి. బుద్ధుడు వారికి చేసిన ధర్మోప దేశంవల్ల (ధమ్మపరియాయ) సందేహాలన్నీ తొలగి, వారు ఆయన చూపిన జ్ఞాన మార్గాన్ని అవలంబించారు. పింగియమాత్రం అశ్మక ప్రాంతానికి తిరిగి వచ్చి, శ్రావస్తిలో తమకు కలిగిన అనుభవాన్ని గూర్చి బావరీకి చెప్పడంతో ఆయనకూడా ఆ ధర్మమార్గాన్ని స్వీకరించినాడు.

పింగియకీ, ఆతని సహచరులకీ బుద్ధుడు ఉపదేశించిన ధర్మం శాశ్వతమూ, యథార్థమూ, అనుపమానమూ అయిన ధర్మం. ఇది తృష్ణలన్నింటినీ పోగొట్టి నిర్వాణం అందచేస్తుంది. (ధమ్మం సదిట్ఠికం అకాలికం తణ్హాక్ఖయం అనీతికం యస్స నాత్థి ఉపమా క్వచి). బుద్ధుడు పింగియనుండి కోరినదల్లా శ్రద్ధావిశ్వాసాలు. అవే ఆతన్ని (పింగియను) మృత్యువు అవతలి ఒడ్డుకు చేరుస్తాయి. (త్వం పి పముంచస్సు సద్ధం గమిస్ససి త్వం, పింగియ, మచ్చుధేయ్యపారం). మళ్లా జన్మలేకుండా ఉండాలంటే అన్నివిధాలైన తృష్ణలనూ ప్రయత్నపూర్వకంగా పెకిలించివేయాలి అనికూడా బుద్ధుడు ఆతనికి బోధించినాడు. (తువం అప్పమత్తో జహస్సు తణ్హం అపునబ్భవాయతి). ఈ ఉపదేశాన్ని గ్రహించి అత్యానందభరితు డైన పింగియ, "నేను తప్పకుండగా అవ్యయమూ, అసాధారణమూ అయిన ఆ అత్యుత్తమ స్థితిని పొందగలను" అని ఉద్ఘోషించాడు. (అసంహీరం అసంకుప్పం యస్స నాత్థి ఉపమా క్వచి). బుద్ధుడు పింగియను ఎంతగా ప్రభావితుణ్ణి చేశాడో, ఆతడు తన గురువైన బావరీతో పలికిన మాటలను పట్టి తెలుస్తుంది.—"బుద్ధుడు నిష్కల్మషుడు; మహాబుద్ధిశాలి; తృష్ణారహితుడు; వాంఛలు లేనివాడు; ముక్తుడు; అజ్ఞాన నాశకుడు; సర్వజ్ఞుడు. ఈ ప్రపంచానికీ, జనన మరణరూప బంధనాలకీ అతీతుడు (లోకాతిగు సబ్బ భావాతివత్తో); పాపరహితుడు (అనాసవో); సకలదుఃఖ దూరుడు. సత్యమాత్రోపదేష్ట". రాత్రింబగళ్లు నిశ్చలమైన మనోనేత్రంతో బుద్ధుణ్ణి దర్శిస్తూ, రాత్రులన్నీ ఆ బుద్ధుని ఆరాధనలో గడిపిన (నమస్సమానో వివసేమి రత్తిం) పియంగుడు "నేను బుద్ధుణ్ణి ఆరాధిస్తున్నాను" అని స్పష్టంగా చెప్పినాడు. "ఆ బుద్ధుని అత్యద్భుతమైన జ్ఞానంనుంచీ, బుద్ధినుంచీ నేనెన్నడూ, ఒక్కక్షణ

మైనా, దూరంగా ఉండడం అనేది లేదు. బుద్ధుడు సర్వదా నాలోనే ఉన్నాడు. ఆ సర్వజ్ఞుడు ఏయే దిక్కున ఉంటాడో నేనుకూడా ఆయాదిక్కువైపు తిరిగి అభివాదనంచేస్తూ ఉంటాను (యం యందిశం వజతి భూరిపన్నో, సతేన తేన ఏవ నతోఽహం అస్మి)'' అనికూడా పింగియ చెప్పినాడు. ఈ కథ అంతా సుత్తని పాతంలోని పారాయన వగ్గలో ఉన్నది. జరామరణాల్ని దాటించే ధర్మమార్గాన్ని బోధించడంచేత దీనికి ''పారాయన వగ్గో'' అని పేరు (జరామరణస్స పారంగమ నీయా ఇమేధమ్మా). ఇది జన్మజరాదుల్ని తొలగిస్తుంది (జాతిజరాయ ఇధ విప్పహానం). బుద్ధుని జీవితకాలంలోనే, ఆంధ్రదేశంలోని అశ్మకజనపదంలో పింగియ ప్రవేశపెట్టిన "ఆవలికి తీసికొనిపోయే మార్గం'' (మగ్గోపారంగమనాయ) ఇదే.

మూలంలోని కొన్ని వాక్యాలు ఉదాహరిస్తూ ఈ కథకు సంబంధించిన విషయాలను ఇంత విస్తృతంగా చెప్పడానికి కొన్ని కారణాలు ఉన్నాయి. "నిరంతర ప్రయత్నమూ, ధ్యానమూ, శ్రద్ధా - వీటిద్వారా జన్మ జరామరణాలనుంచి విముక్తి పొందడమే కాకుండా, నిరతిశయమూ, అవ్యయమూ, అసాధారణమూ అయిన స్థితిని కూడా పొందవచ్చును'' అనేదే ప్రప్రథమంగా బుద్ధుడు చేసిన ఉపదేశం అనే విషయం దీనివల్ల స్పష్టం ఔతుంది. దీనివల్ల తెలిసే రెండవ విషయం ఏమిటంటే, బుద్ధుని నుంచి ప్రత్యక్షంగా ఉపదేశం పొందగలిగిన పింగియ వంటివారికి, బుద్ధుడు, ఆ ఉపదేశం పొందినది మొదలు చివరిదాకా సర్వదా ఎదుట నిలిచి ఉండే ప్రత్యక్ష వ్యక్తిగా ఏర్పడినాడు. వారి దృష్టిలో బుద్ధుడు మూర్తీభవించిన పవిత్రత్వం; శరీరం దాల్చిన దుఃఖ విమోచనం; ఆకారం దాల్చిన జ్ఞానం; దేహం ధరించిన సర్వలోకాతీతస్థితి. ఎక్కడ ఉన్నా వారు ఆతని సాక్షాత్కారం పొందుతూ ఉండేవారు; ఆతనిని ఆరాధిస్తూ ఉండేవారు; (పింగియుడు బుద్ధుని ఉపాసించేవాడు) ఆతని ఉపాసనలోనే రాత్రులు గడిపేవాడు. అతి ప్రాచీనకాలంనుంచీ కూడా బుద్ధుణ్ణి ఆయన శిష్యులు భగవానుని గానే భావించేవారు అనే విషయం కూడా దీనివల్ల మనకు స్పష్టం అవుతూన్నది. మనకు ఇప్పుడు లభ్యం అయే అతి పురాతనమైన పాళీగ్రంథాలుకూడా ఈ విషయాన్ని ధ్రువపరుస్తున్నాయి. ఆంధ్రదేశంలోని బౌద్ధులు ప్రధానంగా ధాన్యకటక అమరావతీ శ్రీపర్వత (నాగార్జునకొండ) ప్రాంతాల్లోనూ, వేంగిదేశం లోనూ నివసించే బౌద్ధులు మతానికి సంబంధించిన అనేకమైన ఇతరవిషయాలతో

పాటు పైన పేర్కొన్న విషయాలనూ, బుద్ధునిగూర్చిన ఈ అభిప్రాయాలనూ ఎక్కువగా ప్రచారంలోనికి తీసుకొనివచ్చారు.

ఈ బావరీగోత్రజుడైన బ్రాహ్మణుడూ, అతని పదహారుగురు శిష్యులూ ప్రప్రథమంగా బౌద్ధమతం స్వీకరించిన ఆంధ్రులు. వారి గొప్ప పాండిత్యమూ, వారి పరిశుద్ధమైన ఆధ్యాత్మిక జీవనమూకూడా తెలంగాణా ప్రాంతంలో ఉన్న వారిని ప్రభావితుల్ని చేసి బౌద్ధమతంవైపు తిప్పిఉండాలి. మరొక విషయ మేమి టనగా బుద్ధుని ప్రధాన శిష్యులలో ఒకడైన మహాకాత్యాయనుడు అశ్మకజనపద రాజుచేత బౌద్ధమతం స్వీకరింపజేసినట్లుగా 'విమానవత్థు'[8] నుంచి తెలుస్తూన్నది. అశోకుని సామ్రాజ్యంలో అంతర్గతమైన ఆంధ్రదేశంలోని ఆంధ్రులు బౌద్ధధర్మా వలంబులని అతని పదమూడవ శిలాశాసనం ద్వారా తెలుస్తూన్నది అశోకుని రాజప్రతినిధి ఒకడు సువర్ణగిరిలో నివసించేవాడు. ఇది నేటి కర్నూలు జిల్లాలో, పత్తికొండ తాలూకాకు చెందిన జొన్నగిరి. దీని సమీపంలోనే యెఱ్ఱగుడి శిలా శాసనమూ రాజులమందగిరి శిలాఫలకశాసనమూ లభించాయి. దిగువ కృష్ణా లోయ లోని మజెరిక (మంజిర మాసాలదేశములు)లో ఉన్న బౌద్ధ స్తూపాన్ని గూర్చి బౌద్ధ వాఙ్మయంలో చెప్పబడి ఉంది.[9] బుద్ధుడు నిర్వాణం చెందిన కొద్ది కాలానికే అమరావతిలోని మహాచైత్యం[10] బుద్ధుని అవశేషాలమీద[11] నిర్మింపబడింది. కొంత కాలంతరువాత దీనిని పూజించేవారు. కొన్ని సిద్ధాంతాల్ని పాటిస్తూ ఇలాంటిచైత్యాల పూజలు చేయడంచేత బౌద్ధులలో 'చైత్యకులు' లేదా 'చైత్యపూజకులు' అనే ఒక శాఖ ఏర్పడింది. ఈ పూజాదుల్ని గూర్చి మున్ముందు స్పష్టీకరిస్తాను. ఆంధ్ర దేశంలోని వీరి చైత్యాలకు ఒక వైశిష్ట్యం ఉంది. ధర్మచక్రాన్ని అనుకరిస్తూ చక్రాకారంలో కట్టిన ఇక్కడి చైత్యాలు చాలా పెద్దవిగా ఉంటాయి. హెచ్. సర్కారు చెప్పినట్లు, ఒక ధర్మచిహ్నానికి (చక్రానికి) వాస్తునిర్మాణ స్వరూపం ఇవ్వడానికై వీరు చేసిన ప్రయత్నం సర్వధా సఫలమైనదని చెప్పవచ్చును. అమరావతీ స్తూపనిర్మాణంలో అశోకుని చేయికూడా కొంత ఉంది. ఐతే దీనికి ఒక ఆవారభిత్తి కట్టించినవాడు నాగార్జునుడు. ''అత్యుత్తమస్థాయిని అందుకొన్న భారతీయ శిల్పచాతుర్యం" అయిన ఈ ఆవారభిత్తి నిర్మాణం వాస్తు శిల్పంలో భారతీయులు సాధించిన ప్రశంసనీయాంశం అని చెప్పవచ్చు. ఆంధ్రదేశంలోని ఇతర ప్రాంతాల్లో, అనగా భట్టిప్రోలు (గుంటూరు జిల్లా), జగ్గయ్యపేట (కృష్ణా జిల్లా), గుంటుపల్లి (పశ్చిమగోదావరిజిల్లా), సాలిహుండం (శ్రీకాకుళంజిల్లా),

శంకరం (విశాఖపట్నంజిల్లా), నాగార్జునకొండ (గుంటూరు జిల్లా) మొదలైన ప్రదేశాల్లో, ఉన్న స్తూపాలు క్రీ. పూ. రెండవశతాబ్దానికి పూర్వమే నిర్మింపబడినవి.

ఈ ప్రాంతాల్లో లభించిన శిలాశాసనాల ద్వారా ఆంధ్రదేశంలోని ప్రాచీన బౌద్ధులను గూర్చిన ఎన్నో విషయాలు తెలుస్తున్నాయి. ఉదాహరణకు — బుద్ధుడు లోకాతీతుడనీ, ఆతని శరీరాలు పూజ్యమైనవనీ (బుద్ధ శరీరాణి మహనీయాని) భట్టిప్రోలు శాసనంలో వర్ణింపబడింది. నాగార్జునకొండ శాసనం బుద్ధుని సౌందర్యాన్ని గూర్చి చెపుతూ ఆతడు భానుతుల్య ప్రకాశవంతుడనీ, శరచ్చంద్రునివంటి శరీర కాంతి కలవాడనీ వర్ణిస్తుంది. ఆతడు - ధ్యానంచేసే వారిలో వృషభము: మానవులలో గంధగజము (గంధహస్తి). గుంటూరు జిల్లా, వేల్పూరులోని శాసనంలో ఆతనిని భగవంతుడని పేర్కొని నమస్కారం చేయబడింది(సిద్ధంనమో భగవతో). మరొక శాసనంలో మహాచైత్యానికి సంబంధించిన భగవానునికి నమస్కారం చేయబడింది. మూడవ శతాబ్దంనుండి ఐదవ శతాబ్దంవరకు ఉన్న శాసనాల్లో, ఆతని అలౌకిక శక్తులూ, సర్వజ్ఞత్వమూ, ఆతని దివ్యధామమూ, సర్వభూతహితాభిలాషా (సర్వలోకహితమహితస్స) పేర్కొనబడ్డాయి. నాగార్జునకొండలోని ఒక దానశాసనంలో బుద్ధుడు ఆతని (ఆదాతయొక్క) ధర్మానికి సంబంధించిన దేవునిగా (స్వమతస్య దేవస్య) పేర్కొనబడ్డాడు. మరియొక శాసనంలో బుద్ధుడు జగద్ధర్మనాయకుడుగానూ, దేవేంద్రునిచే పూజింపబడినవానుగానూ స్తుతింపబడ్డాడు. తాము లేక తమ బంధుమిత్రాదులు నిర్వాణం పొందడంకోసమూ, లోకక్షేమం కోసమూ కూడా విహారాలలో పూజలు జరిపించడానికి కావలసిన దీప-ధూప-పుష్ప-ఆహార–పానీయాదుల నిమిత్తం దాతలు ఎన్నో దానాలు చేశారు. ఇంద్రపాల నగరంలోని అర్వాచీనమైన ఒక శిలాశాసనంలో ఉన్న- ''అందరు ప్రాణుల దారిద్ర్య దుఃఖాలను పోగొట్టడం కోసం'' (సర్వసత్త్వానాం నిఖిల దారిద్ర్య దుఃఖోపశమనహేతోః) అన్న వాక్యం చాలా ప్రాధాన్యం కలది[12]. ఐతే ఆంధ్రదేశంలో బహుళ ప్రచారంలో ఉన్న ఈ భావాలన్నీ ఎప్పుడు, ఏవిధంగా బయలుదేరాయి, అనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈ భావాలకు కారణం చైత్యకులూ, శైలులూ అని చెప్పవలసి ఉంటుంది.

## 2. ఆంధ్రదేశంలో కొన్ని బౌద్ధ సంప్రదాయాల ఆవిర్భావం

బుద్ధునివే అని విశ్వసించడానికి వీలైన ఉపదేశాలన్నింటికి ఒక నిర్దిష్ట రూపం ఇవ్వడంకోసం ఒకబౌద్ధ మహాసభ బుద్ధుడు నిర్వాణంచెందిన కొద్దిరోజుల లోనే రాజగృహంలో జరిగింది. అది మొదటి మహాసభ. బుద్ధ నిర్వాణా నంతరం నూటపదహారు సంవత్సరాలకు, శిశునాగవంశీయుడైన కాలాశోకుని కాలంలో, రెండవ బౌద్ధమహాసభ వైశాలిలో జరిగింది. ఈ మహాసభ జరపడంలో ముఖ్యోద్దేశ్యాలు రెండు-.(1) బౌద్ధ పరివ్రాజకులు పాటించవలసిన ఆచార వ్యవహారాలకూ, వారి వైయక్తిక స్వాతంత్ర్యానికీ, వివిధ ప్రాంతాలలో ఉన్న పరివ్రాజక నివాసస్థానాల కుండవలసిన స్వాతంత్రానికీ సంబంధించి వజ్జి పరివ్రాజకులు లేవదీసిన కొన్ని సమస్యలను పరిష్కరించడము, (2) అర్హతుల విషయంలో మహాదేవుడు ప్రచారం చేస్తున్న కొన్ని సైద్ధాంతిక నిర్ణయాలను పరిశీలించడము. మహాదేవుడు మధురకు చెందిన ఒక బ్రాహ్మణుడు, అతడు కుక్కుటారామ విహారానికి అధ్యక్షుడు అవడమే కాకుండా రాజుకు మిత్రుడు కూడా. అర్హతుల విషయంలో అతని నిర్ణయాలు ఇవి :- అర్హతులుకూడా (1) తప్పుడుమార్గం పట్టడానికి (2) అజ్ఞాతనంతులై ఉండడానికి అవకాశం ఉంది. (3) వారికికూడా సందేహాలు ఉండవచ్చు. (4) వారికి కూడా జ్ఞానం సంపాదించడానికి పరాపేక్ష ఉండవచ్చు. (5) దుఃఖమూలాన్ని కనుక్కోవడం వల్ల జ్ఞానోదయం కలిగినపుడే ఆ(ధర్మ) మార్గం గోచరిస్తుంది. రెండవ మహాసభను ఏర్పాటుచేసి దానికి అధ్యక్ష్యం వహించిన వారి, పైవిషయాలపై వజ్జి పరివ్రాజకులకు ఉన్న అభిప్రాయాలనుకాని, మహాదేవుని సైద్ధాంతిక నిర్ణయాలను కాని అంగీకరించలేదు. అందుచేత, ఈ అభిప్రాయ భేదం కలవారందరూ పాటలిపుత్రంలో మళ్లీ సమావేశం అయ్యారు. ఈ మహాసభలో పరివ్రాజకులే కాకుండా సామాన్య జనులుకూడా పాల్గొన్నారు. ఈ మహాసభలో వజ్జి పరివ్రాజకుల అభిప్రాయాలు, మహాదేవుని సైద్ధాంతిక నిర్ణయాలూ కూడా అంగీకరించారు. ఈ మహాసభలో పాల్గొన్నవారికి మహాసాంఘికులనే పేరు వచ్చింది. వైశాలి, పాటలిపుత్రము వీరి స్థానాలు. ఇతరులు (స్థవిరవాదులు లేదా థేరవాదులు) కౌశాంబి, మథుర, అవంతి మొదలైన ప్రాంతాల్లో నివసించే వారు. పూర్వదేశీయులైన మహాసాంఘికులు కొంతవరకు ఉదారమైన చిత్తవృత్తి

కలవారు. బహుజనమతాన్ని అనుసరించేవారు. అభ్యుదయపథంలో నడిచేవారు. ఐతే పశ్చిమదేశీయులైన స్థవిరవాదులు ఎట్టి మార్పును అంగీకరించనివారు; నియమ బద్ధులు, ప్రాచీన సంప్రదాయానికి ప్రాధాన్యం ఇచ్చేవారు[13]. పరినిర్వాణా నంతరం రెండవ శతాబ్దంలో మహాసాంఘికులు బయలుదేరినట్లుగా 'శారిపుత్ర పరిపృచ్ఛ' ద్వారా తెలుస్తూన్నది. వీరినిగూర్చిన ప్రాచీనతమశాసనప్రమాణం క్రీ. పూ. 120 సం.రం నాటి మథురలోని సింహ స్తంభాగ్రంమీద లభించింది.

బుద్ధుని పరినిర్వాణం తరువాత రెండువందల సంవత్సరాలకు మహా సాంఘికులలో మరల కొన్ని శాఖలు బయలుదేరినవనీ, ఇందుకు మరొక మహాదేవుడు కారణభూతుడనీ ''మంజు శ్రీ పరిపృచ్ఛ" ద్వారా తెలుస్తూన్నది. ఈ మహా దేవుడూ, ఆతని అనుయాయులూ, తమకు తాముగానే పరివ్రాజకత్వం స్వీకరించారు. దీనితో నియమపూర్వంగా సంన్యాసం తీసుకున్న ఒక ఆచార్యుని ద్వారా పరివ్రాజకత్వం స్వీకరించాలా, తమకు తాముగానే పరివ్రాజకత్వం స్వీకరించ వచ్చునా అనే విషయంమీద వాద వివాదాలు చెలరేగాయి. ఆచార్యునిద్వారానే సంన్యాసం స్వీకరించవలసి ఉంటుందనీ, రెండవ మహాదేవుడూ ఆతని అనుచరులూ స్వీకరించిన సన్న్యాసం శాస్త్ర సంమతం కాదని చాలామంది అభిప్రాయపడ్డారు. అందుచేత వారినందరినీ ధర్మంనుంచి బహిష్కరించడం జరిగింది. ఇలా బహిష్కరింపబడిన వారందరూ ఒక పర్వతం మీద* నివాసం ఏర్పరచుకున్నారు. కాల క్రమాన వీరు ఆచార వ్యవహారాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ చిన్ని చిన్ని మార్పులతో కొన్ని బౌద్ధ ధర్మశాఖలను నెలకొల్పారు. ఇవే 'చైత్యకము' లేదా 'చైత్య వాదము', 'శైలము' అనే శాఖలు. ఇవి ఆవిర్భవించడానికి మూలకారణం రెండవ మహాదేవుడే అని తారానాథుడు వ్రాసి ఉన్నాడు. చైత్యపూజకు ప్రాధాన్యం ఇవ్వడంచేత వీరికి 'చైత్యకులు' అనే పేరు వచ్చింది. వీరు ఒక స్థానానికి, (బహుశా ధాన్యకటక-అమరావతులకు) తూర్పున, పశ్చిమాన, ఉత్తరాన నివసించడం చేత, వీరిలో కొందరికి "పూర్వశైలులు" అనీ, కొందరికి ''అపర శైలులు" అనీ, మరికొందరికి "ఉత్తర శైలులు'' అనీ పేర్లు వచ్చాయి. వీరిలో కొందరికి ''చైత్య శైలులు" అనికూడా పేరు వచ్చింది. ఈ 'చైత్యశైలులు' అనేపేరు రావడానికి కారణం శైలాలతో సంబంధం ఉండడం కాక, శైలాలంత ఎత్తైన చైత్యాలతో

* ఈ పర్వతం శ్రీ శైలం అనగా నాగార్జునకొండ కావచ్చునా ?

సంబంధం ఉండడం అయి ఉంటుంది. చైత్యకులకూ, శైలులకూ, మహావన శైలులకూ సంబంధించిన శాసనాల్లో అధికసంఖ్యాకమైనవి అమరావతి దగ్గర లభించాయి. రెండుమూడు శాసనాలు నాసికదగ్గరా, జున్నార్ దగ్గరా ఉన్న గుహల్లో లభించాయి. పూర్వశైలులకు సంబంధించిన శాసనాల్లో చాలవరకు ధాన్యకటకం దగ్గరా,అల్లూరు దగ్గరా లభించాయి.అపరశైలుల శాసనాలు, ఘంటసాల, వర్ధమానము, కన్‌హేరి ప్రాంతాల్లో దొరికాయి. అపర మహావినయశైలుల శాసనాలు నాగార్జున కొండదగ్గర లభించాయి. ఈ విధంగా, బహుశా, క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో తలెత్తిన మతభేదంచేత మగధలో ఆవిర్భవించిన మహాసాంఘికులలో, రెండవ మహాదేవునిద్వారా మరల మతభేదాలు రావడంతో, చైత్యవాద-శైల శాఖలు ఆవిర్భవించాయి. ఈ శాఖలకు చెందినవారు క్రీ. పూ. మూడవ శతాబ్దం చివరకు ఆంధ్రదేశంలో స్థిరపడి, ఆ ప్రాంతంలో, ప్రధానంగా ధాన్యకటక-అమరావతీ-నాగార్జునకొండ ప్రాంతాల్లో నిలదొక్కుకున్నారు. ఈ శాఖల వారికే ప్రచారమూ, ప్రాధాన్యమూ లభించడంతో మహాసాంఘికుల అభివృద్ధి నిలిచిపోయింది. ఈ చైత్యకులలోనూ, శైలులలోనూ చాలామంది ఆంధ్రులని చెప్పడంలో సందేహంలేదు. బహుశా రెండవ మహాదేవుడు కూడా ఆంధ్రుడే అయి ఉండాలి. ఏమైనా, అతడు దాక్షిణాత్యుడనడంలో సందేహం లేదు. అందుచేతనే ఈతడు, ఈతని అనుయాయులూ కూడా మగధలో ధర్మం నుంచి బహిష్కరింపబడగానే ఆంధ్రదేశానికి వచ్చి ఆ ప్రాంతంలో ఒక ప్రధానమైన బౌద్ధధర్మశాఖను నెలకొల్పగలిగారు.

మహావంశంలో ఒక మహాదేవునికి సంబంధించిన వృత్తాంతం ఉన్నది. ఈ మహాదేవుడు మహిషమండలంలో బౌద్ధధర్మోపదేశాల ప్రచారం చేశాడు. ఈయనకు పల్లవాభోగంలో (గుంటూరుజిల్లాలోని పల్నాడు) ఎంతోమంది శిష్యులు ఉండేవారు. అనూరాధపురంలోని సువర్ణామలక స్తూప ప్రారంభోత్సవం సందర్భంగా, సింహళదేశాధిపతియైన దేవానాం ప్రియుడు, తిస్స మహారాజు ఆహ్వానింపగా, ఈయన వేలకొలది పల్నాడు భిక్షువులతో కలిసి సింహళదేశం వెళ్ళాడు. ఆతడు పలనాటి ప్రాంతానికి సంబంధించినవాడు అయినా కాకపోయినా ఆ ప్రాంతంలో అంత పలుకుబడి సంపాదించగలిగినాడంటే, అక్కడ ఉన్న జనుల మధ్య ఆతడు చాలాకాలం వారితో కలిసి మెలిసి ఉండాలి. ఇతడు మూడవ మహాదేవుడు కావచ్చు. 'నాగార్జునులు', 'శంకరులు' వలె ఒకే పేరు పెట్టుకొనిన

చాలామంది వ్యక్తులు ఉండడానికి అవకాశం లేకపోలేదు. ఐతే కొందరు పండితులు చూపుతున్నట్లు, మహాసాంఘికులలో చీలికలు రావడానికి కారణభూతుడైన మహాదేవుడు క్రీ. పూ. రెండవ శతాబ్దానికి చెందినవాడైతే, సింహళదేశం వెళ్లిన ఈ మహాదేవుడు అతనికంటె పూర్వుడై ఉండాలి. భారతీయేతిహాసంలో కాలం అనిర్ధారణీయమే కదా !

# 3. ఆంధ్ర బౌద్ధమతంలోని కొన్ని సిద్ధాంతాలు

పూర్వశైల - అపరశైల – హేమవతిక - రాజగిరిక - సిద్ధార్థిక శాఖలకు చెందిన వారందరికీ పాలివాఙ్మయంలో ఇవ్వబడినపేరు 'అంధకులు', (అంధ్రకులు అనగా ఆంధ్రదేశీయులు). వేతుల్యకులు హేతువాదులూ కూడా ఈ అంధకులలో చేర్చతగినవారే[14]. శైలసిద్ధాంతంవాళ్లు అంధకుల శాఖకు చెందిన వారని ఒకచోట, చైత్యకుల శాఖకు చెందినవారని మరియొక చోటా ఈ పాలి సంప్రదాయం లోనే చెప్పబడి ఉంది[15]. దీన్నిబట్టి, అంధకులన్నా, చైత్యకులన్నా ఒకరే అని తెలుస్తూన్నది. పైన చెప్పినట్లుగా ఈశాఖలను, ధాన్యకటక - అమరావతీ - జగ్గయ్యపేట – నాగార్జునకొండ ప్రాంతాలలో (గుంటూరు కృష్ణా జిల్లాలలో) చాలావరకు ఆంధ్రులే అభివృద్ధిలోనికి తీసుకు వచ్చారు. కథావత్థువును వ్రాసిన వాడు అశోకచక్రవర్తిని బౌద్ధమతంలోనికి మార్చిన మొగ్గలిపుత్తతిస్స అని అంటారు. ఈ గ్రంథంలోని కొన్నివిషయాలా తిస్సుని కాలానికి సంబంధించినవే అయినా ఈ గ్రంథం మనకిప్పుడు లభిస్తూన్న ఆకారంలోనికి రావడానికి చాలా కాలం పట్టి ఉంటుంది. ఆ విషయం ఎలాగఉన్నా , మన కీ గ్రంథంనుంచి అంధకుల సిద్ధాంతాలు నలభైఒకటీ పూర్వశైలుల విశిష్ట సిద్ధాంతాలు ముప్పైమూడూ తెలుస్తున్నాయి. వాటిలో కొన్నింటిని వివరిస్తాను[16].

అంధకుల సిద్ధాంతం ప్రకారం-మనస్సులో నిగూఢంగా అనుశయాలు, అనగా తృష్ణా బీజాలు ఉంటాయి. తగిన ఉద్బోధకాలు రాగానే అవి ఉద్బుద్ధములై పనిచేయడం ప్రారంభిస్తాయి. ఈ అనుశయాలు ఉండడంచేత కర్మ సంచితం అవుతుంది: దానివలననే ఈ ప్రపంచ సృష్టి జరుగుతుంది. ఈ అనుశయాలు లేకపోతే కర్మ పునర్జన్మను ఇవ్వజాలదు. ఈ విధంగా పునర్జన్మకు (భవానికి) మూలకారణం కర్మ; కర్మకు కారణం అనుశయాలు. అనుశయాలు చిత్తమూ కాదు, చైత్తికములూ కాదు; మనో విషయాలూ కాదు, మనస్సుతో

సంబంధించినవీ కాదు. వీటిని ఉద్బోధం చేసినపుడు ఇవి పర్యవస్థానాలు, అనగా సర్వవ్యాపకతృష్ణలుగా, అవుతాయి. అప్పుడే అవి చైత్తికములుగా, అనగా మానసిక ప్రవృత్తులుగా అయి, అపవిత్రత్వాన్ని పొంది (మనోమలములుగా అయి) ఆధ్యాత్మికోన్నతికి అడ్డు తగులుతూ ఉంటాయి. అనుశయాలకీ, పర్యవస్థానాలకీ ఉన్న భేదమూ, అనుశయాలకు చిత్తంతో సంబంధంలేదు, పర్యవస్థానములకే ఉన్నది అనే విషయమూ-ఇవి అంధకులు క్రొత్తగా ప్రతిపాదించిన సిద్ధాంతాలు.

వేతుల్యకుల అభిప్రాయం ప్రకారం-బుద్ధుడు లోకాతీతుడు; నిర్మలమైన భూతాలతో (అనాస్రవధర్మాలతో) నిర్మించిన శరీరం కలవాడు; నిద్రాస్వప్నాలు లేనివాడు. అపరిమేయశక్తులూ, అనంతజీవితము కలవాడు. ఏదో ఒకానొకప్పుడు బుద్ధుడే మర్త్యలోకంలో నివసించేవాడని చెప్పడంతప్పు. ఎందుచేతనంటే, ఆయన ఎల్లప్పుడూ సర్వవ్యాపకుడై ఉండనే ఉన్నాడు. ఐతే అభినిర్మితమైన శరీరంతో ఆయన మనకు బోధలు చేశాడు. మార్గంకంటేను, దాని ఫలం కంటేను వేరుగా బౌద్ధసంఘం అనేదిలేదు. అందుచేత సంఘం దానాలు గ్రహించి వాటిని పవిత్రమైన వాటినిగా చేస్తుంది. లేదా వాటిని అనుభవిస్తుంది అని చెప్పడం అసమంజసం. సంఘానికి దానాలు చేయడంవల్ల ఏమీ పుణ్యంకూడా లభించదు. ఉన్నదంతా మహాశూన్యత, భిక్షువుగా ఉన్నవాడుకూడా, కరుణ (ఏకాభిప్రాయం) చేత స్త్రీ సంబంధం ఏర్పరచుకోవచ్చు. ఉదాహరణకు - ఒక స్త్రీతో కూడా బుద్ధుణ్ణి పూజించిన పిమ్మట ఆ స్త్రీతో కలిసి ప్రపంచంలో నివసించడానికి శపథం తీసుకోవచ్చు. ఈ విధంగా, ఆంధ్రదేశంలోని ఈ వేతుల్యక శాఖ మాధ్యమికుల శూన్యవాదానికీ, తంత్రాలకీ బీజావాపం చేసిందని చెప్పవచ్చు.

అంధకుల సిద్ధాంతం ప్రకారం - బుద్ధుని వ్యవహారాలు లోకోత్తరాలైనా, వాటిని లౌకికములు గానూ, లోకోత్తరములుగానూ కూడా చూడడం జరుగుతూ ఉంటుంది. అర్హతులు ఎంత ప్రయత్నంచేసినా బుద్ధునికి ఉన్న శక్తులనూ, గుణాలనూ సంపాదించలేరు. కొన్ని లక్షణాలనుబట్టి బుద్ధులలో పరస్పరమూ విభేదాలు ఉన్నాయి. బుద్ధుడు బోధించినది కేవలమూ తృష్ణాక్షయ సంపాదకమైన ధర్మం మాత్రమే, ఆయన చెప్పిన మాటలన్నీ దీనికే అనుగుణంగా ఉన్నాయి. బుద్ధుని సూత్రాలన్నీ స్పష్టార్థాలే (నీతార్థాలే) కాని, నిగూడార్థాలు (నేయార్థాలు) కావు. అవి నిర్దుష్టములు; నాగార్జునకొండపైన ఒక ఆయకస్తంభంమీదఉన్న శాసనంలో చెప్పిన విధంగా, బుద్ధుడు తృష్ణా-అసూయా మోహాలను జయించిన

వాడు మాత్రమే కాదు, సర్వోత్కృష్టమైన ధాతువు కలవాడు కూడా (ధాతువర పరిగంహితస్స). 'ధాతువర' అనే మాటకు, యన్. దత్ 'అత్యుత్తమమైన ధాతువు' అనీ, ఏ. సి. బెనర్జీ 'సూక్ష్మధాతువులు' అనీ, పూసే (POUSSIN) "సకలభూతసారము" (ధర్మధాతు) అనీ అర్థం చెప్పారు. ఇవన్నీ బౌద్ధమతానికి వీరు (అంధకులు) అందించిన విశిష్ట సిద్ధాంతాలు.

నాగార్జున కొండమీదా, ఆంధ్రదేశంలోని ఇతరప్రాంతాలలోనూ లభించిన శాసనాల ప్రకారం, ఒకవ్యక్తి దానాలు చేయడంవల్ల కలిగిన పుణ్యాన్ని ఆతని మిత్రులకూ, బంధువులకూ సంక్రమింపచేయవచ్చునని అంధకుల సిద్ధాంతం. (1) అందరికీ ఇహలోక పరలోకాల్లో సౌఖ్యమూ, (2) తనకు నిర్వాణము లభించుట (నిర్వాణసంపత్తి) ఇవి ఆ పుణ్యానికి ఫలితాలు. హితాన్నీ సుఖాన్నీ ఇతరులకు సంక్రమింపచేయవచ్చును కాని నిర్వాణాన్ని మాత్రం సంక్రమింపచేయడానికి శక్యంకాదు. పుణ్యం సంక్రమింపచేయడం (పరిణామేతుం) అనే సిద్ధాంతం ప్రప్రథమంగా వీరిలో ప్రారంభమై బోధిసత్త్వ సిద్ధాంతావిర్భావానికి దారితీసింది. అంధకుల సిద్ధాంతం ప్రకారం నిర్వాణము ఉత్తమమైనదనీ (కుశల) పూర్వశైలుల అభిప్రాయం ప్రకారం ఇది దోషరహితమైన అవస్థ (అమతపదం) అనీ, బద్ధులు నిరంతరమూ ఆలోచించవలసిన పరమలక్ష్యంఇదేననీ కథావత్థుద్వారా తెలుస్తూన్నది.

లౌకిక జీవనం గడిపే సామాన్య జనులకు జ్ఞానంకాని శ్రద్ధకాని కలగవు; పరివ్రాజకత్వం స్వీకరించినవారికి ఇవి లభిస్తాయి - అని హేతువాదులవాదం. సుఖాన్ని ఒకి వ్యక్తినుంచి మరియొక వ్యక్తికి సంక్రమింపచేయవచ్చుననికూడా వారు అంగీకరిస్తారు. ఐతే, హేతువాదులము అని చెప్పకొనేవాళ్లు మొదటి సిద్ధాంతాన్ని అంగీకరించడం సంకుచితదృష్టితో కూడినదీ, తర్కవిరుద్ధమూకూడా.

శైలసిద్ధాంతమూ, ఇతరమైన అంధక సిద్ధాంతాలూకూడా చైత్యకులు, అనగా మహాదేవుడూ ఆతని అనుయాయులూ ప్రారంభించినవి. చైత్యాలను కట్టడమూ, వాటిని అలంకరించడమూ, పూజించడమూ, ప్రదక్షిణంచేయడమూ - వీటివల్ల పుణ్యం లభిస్తుందని చైత్యకుల విశ్వాసం. సాష్టాంగ ప్రణామమూ, పుష్పమాలలు, సుగంధద్రవ్యాలు, ధూపదీపాలు మొదలైనవి సమర్పించడమూ, ఇవన్నీ వారు చేసే చైత్యపూజలో అంగాలు. చైత్యపూజా, తనపుణ్యంకొరకూ ఇతరుల పుణ్యంకొరకూ బుద్ధునికీ, విహారాలకీ దానాలు ఇవ్వడమూ - వీటి

అన్నింటితోచే బౌద్ధ మతానికి ఎక్కడలేని ప్రచారమూ వచ్చింది. ఈ విధంగా మహాయానం ఆవిర్భవించడాని ఒక మార్గం ఏర్పడింది.

ఇంతవరకూ చెప్పినదానిని బట్టి మహాసాంఘికులనుంచి విడిపోయిన శాఖలు మాత్రమే ఆంధ్రదేశంలో వ్యాప్తిలోనికి వచ్చినాయి అని అనుకోకూడదు. ఈ ప్రాంతంలో థేరవాదులకు కూడా స్థావరాలు ఉండేవి అని నాగార్జునకొండ శాసనాల ద్వారా తెలుస్తూన్నది. ఇట్టి స్థావరాలలో రెండు సింహళదేశీయులైన పరివ్రాజకులకు పరివ్రాజికలకూ సంబంధించినవి. మంచి శక్తిమంతములైన ఈ మత ప్రచార సంఘాలు గాంధారము, చైనావంటి సుదూర దేశాలలో బౌద్ధమత ప్రచారము చేశాయి. ఇక్ష్వాకు రాజైన శాంతమూలుని (క్రీ.శ 223-40 ప్రాంతం) సోదరి థేరవాదులలో ఒక శాఖ ఐన మహాసాహసికుల కోసం మరొక స్థావరం ఏర్పాటు చేసింది. మహాసాంఘికుల ప్రభావం వీరిమీద బాగా ప్రసరించింది. వీరు మూర్తి పూజను స్వీకరించక పోయినా బుద్ధునికి సంబంధించినపాదాలు మొదలైన వాటిపూజ చేసేవారు. నాగార్జునకొండ ప్రాంతంలో బాహుశ్రుతీయులనే మరొక థేరవాద శాఖీయులుకూడా ఉండేవారు. శాంతమూలుని తల్లి వారి కొరకు విహారం కట్టించి ఇచ్చింది. నాగార్జునకొండనుంచి నలభైమైళ్ల దూరంలో వీరికి మరొక స్థావరం కూడా ఉండేది. మహాయానానికీ, శ్రావకయానానికీ (థేరవాదం) ఉన్న భేదాలు తొలగించడం కోసం వీరు ప్రయత్నించినట్లుగా పరమార్థుడు చెప్పుచున్నాడు.

## 4. ప్రజ్ఞాపారమిత, రత్నకూటము, సుఖావతి

క్రీ. పూ. ప్రథమ శతాబ్దంలో, మహాయానం అనేపేరుతో ఒక క్రొత్త రకమైన బౌద్ధధర్మం ఆవిర్భవించింది. సుసుము యమగూచి[17] (Susumu Yamaguchi) చెప్పినట్లు దీని మూల సిద్ధాంతాలు 'ప్రజ్ఞాపారమితా' అనే ఒక వాఙ్మయ శాఖలో ప్రతిపాదింపబడి ఉన్నాయి. దీనిమూలగ్రంథమైన 'అష్టసాహసిక' క్రీ.పూ.ప్రథమ శతాబ్దంలోనే వ్రాయబడింది.ఐతేకొన్ని మార్పులూచేర్పులూ క్రీ. శ. 100 వరకూ జరుగుతూనే ఉన్నాయి. కాంజ్ (Conze) నిరూపించినట్లుగా - ఇది నాటినుండి క్రీ.శ. 300 వరకూ విస్తృతి చెందింది. క్రీ.శ. 500 వరకూ దీని సిద్ధాంతాలు సంక్షిప్తరూపంలో మరల ప్రతిపాదింపబడ్డాయి. క్రీ శ. 600 నుండి 1200 వరకూ ఉన్నకాలంలో ఇది తంత్రప్రభావానికి లోనై ఇంద్రజాల

వీద్యలో కలిసిపోయింది.[18] బౌద్ధ సంప్రదాయం ప్రకారం బుద్ధుడు తొలిసారిగా ధర్మచక్రాన్ని వారణాసిలో త్రిప్పినాడు. రాజగృహంలోని గృధ్రకూట పర్వతం మీద జరిగిన బోధిసత్త్వుల సమావేశంలో రెండవసారి త్రిప్పినాడు.[19] అతడు నిర్వాణం చెందిన నాలుగు శతాబ్దాల తరువాత నాగార్జునుడు దీన్ని వెలుగులోనికి తీసుకువచ్చాడు[20]. ఈ గ్రంథాలన్నీ, రెండవ పర్యాయం ధర్మచక్రం త్రిప్పడం వల్ల ఆవిర్భవించినవి. ప్రజ్ఞాపారమిత దక్షిణాపథంలో ఆవిర్భవించి, తూర్పుగా వ్యాపించి, ఉత్తరాన ప్రచారం పొందినది అని అష్టసాహస్రిక, దాని కోవకు చెందిన ఇతర గ్రంథాలూ చెప్పుచున్నాయి[21]. బోధిసత్త్వుడైన మంజుశ్రీ జేతవనం నుంచి బయలుదేరి దక్షిణాభిముఖంగా ప్రయాణంచేస్తూ ధాన్యకరనగరం (ధాన్య కటకం) చేరాడు. అక్కడ ఎన్నో ఉపన్యాసాలు ఇచ్చి[22] ఆ ప్రాంతాన్ని తన కార్యక్షేత్రంగా చేసుకొన్నాడు. అక్కడినుండి ఉత్కళదేశం వెళ్లి చంద్రగుప్త రాజు (ఈతడు మహాపద్మనందునికి సమకాలికుడు) ప్రాసాదంలో అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితపై ఉపన్యాసాలు ఇచ్చాడు. సౌత్రాంతిక సంప్రదాయంవారు చెప్పే ఈ విషయాలన్నీ విశ్వసింపదగినవిగానే కనబడుతున్నాయి. ఈ విధంగా ప్రజ్ఞాపారమితను భారతదేశం పూర్వ ప్రాంతానికి తొలిసారిగా తీసికొని వెళ్లినవాడు మంజుశ్రీ. కనిష్కుని కాలం నాటికి మహాయానానికి ఒక నిశ్చితరూపమూ, ప్రతిపత్తీ లభించినాయి. ఎందుచేతనంటే ఆకాలంనాటికి మహాయానం బోధించే కొందరు పరివ్రాజకులు ఉన్నట్లూ, వారు కనిష్కుడు ఏర్పాటుచేసిన మహాసభలో పాల్గొన్నట్లూ చెప్పడానికి ఆధారాలు లభిస్తున్నాయి. క్రీ. శ. మొదటి శతాబ్దం నాటికి మహాయానం పశ్చిమోత్తర భారతంలో వ్యాపించింది; రెండవ శతాబ్దంలో సోగ్డియా, పార్థియా, కొతాన్‌లకు చెందిన పరివ్రాజకుల ద్వారా చైనాలో ప్రవేశించింది. క్రీ. శ. 148లో యేహ్‌భీహ్‌కి చెందిన లోకరక్షుడు అష్టసాహస్రికను చైనా భాషలోనికి అనువదించాడు. ప్రారంభంలో ప్రజ్ఞాపారమిత పూర్వశైలుల వద్ద అపరశైలులవద్దకూడా ప్రాకృతభాషలో ఉండేదని, దీనిని తరువాత సంస్కృత భాషలోనికి అనువదించడం జరిగిందనీ, ఒక విశ్వసనీయమైన సంప్రదాయం ఉన్నది. వెనుక సూచింపబడినట్లుగా మొదటిది ధాన్యకటక - అమరావతీ ప్రాంతంలోనూ, రెండవది నాగార్జునకొండలోనూ, ప్రచారంలో ఉండేది. దక్షిణాపథంలోని ప్రాకృత భాష మాటలాడే నాగులనే ఒకజాతివారు బహుశా ఈ ప్రజ్ఞాపారమిత వ్రాసి ఉంటారు. ఈ నాగులకు నాగం (సర్పం) జాతి చిహ్నంగా

ఉండేది. వీరు లోకమాతయైన దేవిని ఉపాసించేవారు.[23] వీరు ధాన్యకటక ప్రాంతంలో నివసించేవారు. మంజుశ్రీ వీరిని బౌద్ధమతంలోనికి మార్చాడు. ఆంధ్రదేశంలో బోధిసత్త్వులను పూజించేవారని గండవ్యూహుడు, తారానాథుడు వ్రాసి ఉన్నారు. శూన్యవాదంవంటి ఒక వాదాన్ని ప్రప్రథమంగా ప్రారంభించిన వారు వైనాశికులైన వేతుల్యకులనే బౌద్ధశాఖవారు, మరొక విషయ మేమిటంటే అంధకుల బౌద్ధధర్మం మహాయానానికి చాలా సన్నిహితమైనది. ధర్మధాతువు విషయంలో వీరి అభిప్రాయం ప్రజ్ఞాపారమితాభిప్రాయంతో తుల్యమై ఉంటుంది. శూన్యతా వాదము, బోధిసత్త్వ సిద్ధాంతమూ, ఈ రెండూ మహాయానంలో సార మైనవి. ప్రజ్ఞాపారమితంలోని ప్రధాన విషయాలు. అందుచేత మహాయానాన్ని ధాన్యకటక - అమరావతీ - నాగార్జున కొండప్రాంతంలో, అంధకులు (పూర్వ శైలులు, వేతుల్యకులు) ప్రప్రథమంగా ఆవిర్భవింపచేశారు అనే విషయంలో సందేహం లేదు.[24]

రత్నకూట వాఙ్మయంకూడా మహాయాన సిద్ధాంత గ్రంథాలలో చేరినదే ఈనాడు ఈ వాఙ్మయానికి చెందిన నలభైఒక్క గ్రంథాలు లభిస్తున్నాయి. బృహత్సుఖావతీవ్యూహము, కాశ్యప పరివర్తము, రాష్ట్రపాల పరిపృచ్ఛ మొదలైన గ్రంథాలు ఈ వాఙ్మయానికి చెందినవి. ఈ గ్రంథాలన్నీ తారానాథుని కాలంలో ఆవిర్భవించినట్లు తారానాథుడు చెప్పుచున్నాడు. ఏమైనా, క్రీ. శ. 147-88 ప్రాంతంలో ఈ గ్రంథాలన్నీ చైనాభాషలోనికి అనువదింపబడ్డాయి సింహళ దేశీయ 'నికాయ సంగ్రహంలో' చెప్పినట్లుగా రత్నకూటవాఙ్మయాన్ని సృష్టించిన వారు అంధకులు. అట్లే 'రాష్ట్రపాల గర్జితము' పూర్వశైలులచే సృజింపబడినది. ఈ రత్నకూట వాఙ్మయం మాధ్యమిక సిద్ధాంతాన్ని ఎంతగానో ప్రభావితం చేసింది.

మహాయాన మత—మాధ్యమిక సిద్ధాంతాలు ఆంధ్రుల అపూర్వ ప్రతిభా సంపదున్మేషానికి తార్కాణాలు. కాలాంతరంలో, ఉత్తరాపథంవారుకూడా వీటికి అత్యద్భుతమైన అభివృద్ధి సమకూర్చారు. మగధలో ఆవిర్భవించిన మహాసాంఘి కులలో ఒక శాఖకు చెందిన 'శైలులు' ప్రజ్ఞాపారమితను ప్రాకృతంలోనుంచి సంస్కృతంలోనికి అనువదించారు. మంజుశ్రీద్వారా ఈ ప్రజ్ఞాపారమిత ఉత్కళ దేశం చేరి, అక్కడినుంచి బీహారులోను, తరువాత ఉత్తరదేశంలోను వ్యాప్తి చెందింది అందుచేత—దక్షిణాపథంలో ఆవిర్భవించిన ఈ వాఙ్మయం భారత పూర్వభాగం చేరి, అక్కడినుంచి ఉత్తరదేశానికీ, పశ్చిమోత్తర ప్రాంతానికీ వెళ్లి

అక్కడ అభివృద్ధి చెందినది -- అని చెప్పే సంప్రదాయం చారిత్రకంగా యథార్థమైనదే.[25] ఈ విధంగా దాని సుదూర మూలస్థానం మగధదేశమై ఉండగా, ఈ వాఙ్మయానికి గృధ్రకూట పర్వతంమీద ఆవిర్భవించిన సూత్రాలే (బుద్ధుడు స్వయముగా పలికిన వచనాలే) మూలం అని చెప్పేకథ అంతగా విశ్వసించదగినది కాదు. ఐతే మధ్యమా ప్రతిపదను 'నైరాత్మ్యము, శూన్యత వంటి అభిప్రాయాలు పాలి గ్రంథాలలో కూడ ఉండడంచేత మహాయాన సూత్రాలు బుద్ధుని ఉపదేశాలకు అనుగుణంగా ఉన్నాయనీ, ఆ ఉపదేశాలకి ఒక తర్కబద్ధ స్వరూపం ఇవ్వడంచేత ఏర్పడినాయనీ చెప్పవలసి ఉంటుంది.

ఇక్కడ ప్రజ్ఞాపారమితను గూర్చి కొంత చెప్పవలసి ఉంది[26]. 'ప్రజ్ఞా' శబ్దానికి 'జ్ఞానతేజము' (సంబోధి 'సర్వజ్ఞత' అని అర్థం. 'పారమితా' అనగా ఆవలి ఒడ్డును చేరినది (పారం ఇతా). ఈ విధంగా 'ప్రజ్ఞా పారమితా' శబ్దానికి "ఆవలి ఒడ్డు చేరుకున్న జ్ఞానతేజము, నిర్మల పరిపూర్ణ జ్ఞానము" అని అర్థం. దానశీలము, నైతికప్రవర్తనము, ఓర్పు, ప్రయత్నశీలత్వము, ధ్యానము, ప్రజ్ఞ అనేవి ఆరు 'పారమితలు' అనగా ఉత్తమ గుణాలు. వీటిలో ప్రజ్ఞ సర్వసం వంటిది. మిగిలిన వాటి కన్నింటికీ దారి చూపించేది జ్ఞానోదయం అయిన వారికి ఉండే పరిపూర్ణ జ్ఞానమూ, సర్వజ్ఞత్వమూ - ఇవే 'ప్రజ్ఞ' అనగా ద్వైతాన్ని తొలగించి, శాంతిని కలగచేసేదీ, జనన మరణ భయాన్ని పోగొట్టేదీ అయిన అలౌకిక సత్యమే 'ప్రజ్ఞ', ఇదే 'శూన్యత్వం', ఇదే తత్త్వం 'తథత', ఇదే సత్యసారం (ధర్మధాతువు లేదా ధర్మత). వస్తువులు ఉన్నవి ఉన్నట్లుగా (యథాభూతం) వాటి స్వభావాన్ని గ్రహించి, వాస్తవంలో అన్ని వస్తువులూ శూన్య స్వభావములు అని గ్రహించడమే "ప్రజ్ఞ". పారమితల వలన కలిగే పుణ్యం జ్ఞానోదయానికి ఉపకరించే విధంగా ఉండేటట్లు వాటి (పారమితల) అభ్యాసం చెయ్యాలి ఐతే, జ్ఞానోదయం అనే లక్ష్యంమీద అత్యాసక్తితో కాని, నిత్యాలైన స్కంధాల విషయంలో సంగబుద్ధితో కాని ఈ పారమితల అభ్యాసం చేయకూడదు. 'ప్రజ్ఞ' అనేది సరిగా అర్థం చేసుకోవడానికిగాని, పొందడానికి కాని శక్యం కానిది. అందుచేత ప్రజ్ఞ విషయంలో కూడా అత్యాసక్తి ఉండకూడదు. వస్తువుల యథార్థమైన పరస్పరసంబంధాన్ని గ్రహించడమూ, ఆ విధంగా గ్రహించడానికి ముందుగా ఆ వస్తువులలో కనబడే నానాత్వమనే ఆవరణమును తొలగించడమూ ఇదే "ప్రజ్ఞ" అలాంటి 'తత్త్వం' ఒకటి ప్రతిచోటా, ప్రతి వస్తువులోనూ వ్యాపించి ఉంది. ఐతే ఈ విధంగా దాన్ని

గూర్చి చెప్పగానే ఆ 'తత్త్వం' అంతర్హితం అయిపోతుంది. తత్త్వంలో, ద్వైతమూ, చలనమూ, వికారమూ, కాలమూ, విభేదమూ, అపవిత్రత్వమూ, ఇవేవీ లేవు. ఐతే వస్తువులన్నీ పేరు పెట్టడానికీ, ఒకదానినుండి మరియొక దానిని వేరుగా చేసి చూపడానికీ తగిన వ్యక్తులుగా కనిపిస్తూ ఉంటాయి. అవి అలా కనిపించినపుడు అక్కడ తత్త్వం లేదు. తాత్త్వికదృష్టితో చూచినపుడు అన్ని వస్తువులూకూడా ఒకటే వాటిలో అపవిత్రత్వం లేదు. వాటి విషయంలో విభేదాలకి గాని, వివేచనకి గాని తావులేదు. అన్ని వస్తువులూ శూన్యమే. ఐతే ఈ శూన్యత్వం అనేది ఏమీ లేకపోవడమూ కాదు; ఇది బుద్ధిగోచరమైన ఒక పదార్థమూ కాదు. కేవలమూ అలౌకిక భావనాశక్తిచేత సాక్షాత్కరించుకొనదగినది ఈ శూన్యత్వం. ఇది అజ్ఞేయము, అప్రాప్యము ఉన్నట్లుగా కనబడేవన్నీ ఒక మాయ; అజ్ఞాన భ్రాంతివిలసితములు, ఒక స్వప్నం. నిర్వాణంకూడా అలాంటిదే. అన్నివస్తువులూ అవి ఉండని విధంగా ఉంటున్నాయి (యథా నసంవిద్యన్తే తథా సంవిద్యన్తే). ఇది మాయ. ప్రతి వస్తువు కూడా పేరు మాత్రమే (మనఃకల్పనా మాత్రమే 'ప్రజ్ఞప్తి మాత్రం') వాటికి వాస్తవమైన ఆధారం ఏమీ లేదు ఇవి ఇక్కడి నుండి వచ్చినవి, ఇటు పోతున్నవి-అనేది లేదు. ఈ విధంగా వీటి నిస్సారత్వమే శూన్యత్వం. దీనిలో ద్వైతానికి కాని విశిష్టలక్షణాదులకు కాని అవకాశం లేదు.

అన్ని వస్తువులూ అసత్యములే అని తెలుసుకోవాలి. తత్త్వదృష్టితో పరిశీలిస్తే వాటిస్థితి ఎలాంటిదో గ్రహించాలి. ఇలాంటి ప్రజ్ఞ ఉదయించగానే తృష్ణ తొలగిపోతుంది. సైద్ధాంతికాలైన వాద వివాదాలన్నీ విడిచిపెట్టి అంతర్ముఖ స్థితిని అభ్యసించినపుడే ప్రజ్ఞ ఉదయిస్తుంది. అపుడే 'శూన్యత', అనగా 'యథాభూతం' అనగా 'తథత', అపరోక్షానుభూతివిషయం అవుతుంది ప్రతీదీ శూన్యమే శూన్యం కూడా శూన్యమే. ప్రతివస్తువునూ శూన్యంగా భావించి నిషేధించిన తరువాత ప్రజ్ఞోదయం అవుతుంది. అప్పుడు ప్రతి వస్తువూ 'తథత' గానే కనబడుతుంది అప్పుడు 'తత్త్వం' దివిక్తముగానూ, స్వతంత్రముగానూ (అనాశ్రయ) నాశరహితముగానూ (అక్షయ), విశుద్ధముగానూ, బంధమోక్షములు లేనిదిగానూ (అబద్ధ-అముక్త), ఉత్పత్తి వినాశములు లేనిదిగాను (అనుత్పాదనిరోధ), అప్రాప్యము గాను (అనుపలబ్ధ) కనబడుతుంది అప్పుడు ఒక వస్తువనీ, వ్యక్తి అనీ, పదార్థమనీ ఉండదు. గుణక్రియాదుల ద్వారా ఈ శూన్యత్వాని వర్ణింప జాలము. ఇది ఉన్నది ఉన్నట్లుగా ఉన్న (యథాభూత) తత్త్వం. ఈ ఆరు

పారమితలను అభ్యసించడం ద్వారా అంతర్దృష్టిని అలవరచుకొని, తానూ, తనచుట్టు ప్రక్కలనున్నదీ కూడా మాయయే అని గ్రహించి దేని విషయంలోనూ ఆసక్తిలేని జ్ఞానసారుడైన వాడే బోధిసత్త్వుడు. ఐతే ఈతడు తనచుట్టు ప్రక్కలనున్న ప్రపంచకంలోని దుఃఖాన్ని గుర్తిస్తాడు. పారమితలవల్ల ఆతడు కరుణామయుడు (కరుణాగర్భ) అవుతాడు. అందుచేత ఈ దుఃఖాలనుంచి అందరినీ ఉద్ధరించడం కోసం అనేకమైన ఉపాయాలు అన్వేషించి వాటిని ఉపయోగిస్తూ ఉంటాడు. జీవితాన్నీ, దాని యథార్థ స్వరూపాన్నీ అర్థం చేసుకొని, జ్ఞానం సంపాదించి తద్వారా 'బుద్ధత్వం' - పొందడమే ఆతని ఏకైకలక్ష్యం. వాస్తవంలో ఆతడు అలాంటి బుద్ధత్వాన్ని పొందడానికి తగిన స్థితిలోనే ఉన్నా, వివిధోపాయాలచేత ఇతరులను కూడా సుఖపంతులను చేయాలనే కరుణాభావంతో ఆతడు తాను పొందవలసియున్న నిర్వాణసుఖాన్ని కాలాంతరితం **(postpone)** చేస్తాడు. మానవులందరినీ, వివిధోపాయాలద్వారా విజ్ఞానవంతులను చేయడానికై ఆతడు సర్వస్వాన్నీ త్యజిస్తాడు. ఇతరులు విజ్ఞానవంతులు కావాలనే అభిప్రాయంతో తాను సంపాదించిన పుణ్యాన్ని కూడా వారికి ధారపోస్తాడు. ఈ విధంగా ప్రజ్ఞా-కరుణా-ఉపాయములు పరస్పర సంబద్ధములై ఉంటాయి. పారమితాభ్యాసంచేత కలిగిన ప్రజ్ఞద్వారా సంబోధి లభిస్తుంది. కరుణాసముత్తేజితమై, సర్వలోక విముక్తికొరకు తగిన ఉపాయాలను అన్వేషించి వాటిని ఆచరించనంత వరకూ ఈ ప్రజ్ఞ నిష్ఫలమైనదే. ఈ విధంగా ప్రజ్ఞా పారమితా సిద్ధాంతసారం 'బోధిసత్త్వ చర్య' - అనగా బోధిసత్త్వుని జీవన విధానం. పైనచెప్పినట్లు అందరి దారిద్ర్య దుఃఖాలను నిర్మూలించడమే (సర్వసత్త్వానాం నిఖిల దారిద్ర్య దుఃఖోపశమన) మహాయాన పరమోద్దేశ్యము, అని విష్ణుకుండిన వంశీయుడైన గోవిందవర్మ అనే రాజు వ్రాయించిన శాసనంలో చాలా యుక్తంగా వర్ణింపబడింది.

ఈనాటి పండితులలో ప్రజ్ఞాపారమితనుగూర్చి సప్రమాణంగా చెప్పగలిగిన ఎడ్వర్డ్ కాంజ్ ఈ విధంగా వ్రాసిఉన్నాడు :- "ప్రజ్ఞాపారమితలో ఉన్న వేల కొలది వాక్యాల సారాన్ని సంగ్రహంగా రెండు వాక్యాల్లో చెప్పవచ్చు :- 1) సర్వలోక సుఖంకోసం సముపార్జించిన పరినిష్ఠిత జ్ఞానంద్వారా లభించిన సర్వజ్ఞత్వంతో తప్ప, అంతకు తక్కువైన దేనితోటీ తృప్తిచెందని బోధిసత్త్వుడు - అనగా బుద్ధ ప్రాగభావరూపుడు, అవడానికి సాధకుడు ప్రయత్నించాలి. 2) బోధిసత్త్వుడనేవాడూ, లేదా సర్వజ్ఞత్వమూ, లేదా ఒకవ్యక్తీ, లేదా పరినిష్ఠిత జ్ఞానమూ

దాన్ని పొందుటా అనేది ఏదీ లేదు. పరస్పర విరుద్ధాలైన ఈ రెండు సత్యాలనూ అంగీకరించడంలో పరినిష్ఠితత్వం ఉన్నది."[27]

ఇప్పుడు రత్నకూట సిద్ధాంతాన్ని గూర్చి కొద్దిగా చెప్పవలసి ఉంది. మనం సకలవస్తువిషయక వివేచనాత్మక నిరంతర భావన అలవరచుకోవాలి. వాటి నైజస్వరూపాన్ని గూర్చి ఆలోచన చేయాలి (సర్వధర్మాణాం భూత ప్రత్యవేక్షా). దీని అర్థం ఏమిటంటే–ఏవస్తువునీ కూడా 'ఆత్మ' (ఒకసత్తకలది) 'నిత్యము' అనికాని, నైరాత్మ్యము, అనిత్యము అని కాని చూడకూడదు. వస్తువులు శాశ్వత మైనవి అని చెప్పడం ఒక అంతం. వస్తువులన్నీ నిరాత్మకములు, పరివర్తనశీల ములు అని చెప్పడం రెండవ అంతం. ఈ రెండింటి మధ్యలో ఉన్నది అగ్రా హ్యము, అనుపమము, అదృశ్యము, అనూహ్యము, అసూచ్యము. ఇదే వాస్తవంలో మధ్యమార్గం (మధ్యమా ప్రతిపద్) ఇదే సత్యయథార్థ స్వభావదర్శనము.[28] దీనినిబట్టి రత్నకూట సిద్ధాంతం ప్రజ్ఞాపారమితకు ఉపోద్బలకంగా ఉన్నదని స్పష్టం అవుతూన్నది. ఉన్నతస్థాయికి చెందిన ఇలాంటి తాత్త్వికవాఙ్మయాన్ని ఆంధ్ర దేశంలోని నాగజాతీయులూ, శైలులైన పరివ్రాజకులూ, క్రీ. పూ. ప్రథమశతాబ్ది నాటికే రూపొందించ కలిగి ఉండడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఇతర సూత్రాలతో కలిసి ఈ వాఙ్మయం, వేదాంతానికి ఉపనిషత్తులు ఆధారమైనట్లుగా మహాయానానికి ఆధారం అయింది. వ్యంజనా వైశిష్ట్యమూ, అర్థగాంభీర్యమూ, సముత్తేజనాసామర్థ్యమూ, వీటిని పట్టిచూస్తే ఈ వాఙ్మయం, భారతీయ వాఙ్మ యంలో ఉపనిషత్తుల తరవాత ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తుంది. నాగార్జునుడు వంటి గొప్ప తత్త్వ శాస్త్రవేత్తలు, ఈ వాఙ్మయాన్నే ఆధారంగా చేసుకొని తమ సిద్ధాంతాలు స్థాపించారు. "ధార్మిక జీవనం విషయంలో ప్రగాఢమైన పరిశీలనం చేసిన భారతీయ బౌద్ధ పండితుల అంతరానుభూతిని (intuitive knowledge) పట్టి చేసిన" కొన్ని స్వానుభూతి నివేదక వాక్యాలు మహాయాన సూత్రాలలో ఉన్నాయి.[29] ఇవన్నీ బుద్ధుని కరుణా నిష్యందాలు. కొందరు భారతీయపండితులు మహాయానానికి సంబంధించిన కొన్ని శాస్త్రగ్రంథాల (నాగార్జున-అసంగాదుల గ్రంథాల) అధ్యయనం కొంతవరకూ చేసి ఉన్నారు కాని నేటివరకూ, ఈ మహా యాన సూత్రాల సర్వాంగీణాధ్యయనం ఆధునిక పండితులెవ్వరూ చేయక పోవడం శోచనీయం.[30]

ఇంతవరకూ చెప్పిన దానిని పట్టి ఆంధ్రదేశంలో ప్రధానంగా బుద్ధభక్తి అధిక ప్రచారంలో ఉండేవనే విషయం స్పష్టం అవుతుంది. ధాన్యకటక-అమరావతులలో, అమితాభుడు అనే ఒక దివ్య బుద్ధుని సంప్రదాయం, ప్రచారంలోనికి వచ్చినట్లు కనబడుతుంది. ఈ ధాన్యకటక-అమరావతులకు; బౌద్ధవాఙ్మయంలో "అమర్త్యుల నివాసస్థానము" అని పేరు[31] నాగార్జునుడు అమితాభుని భక్తుడు. అతడు మరణ సమయంలో అమితాభుని స్థానంవైపు తిరిగి, మరణించి అస్థానాన్ని చేరుకొన్నట్లు వారి సంప్రదాయం. నాగార్జునుని సుహృల్లేఖలో, "సకలభువనాధిపతీ, అపరిమితాయుర్దాయవంతుడూ"[32] అయిన అమితాభుణ్ణి గూర్చి పేర్కొనబడింది. అమితాభునికి సంబంధించిన బౌద్ధ భక్తి సూత్రాలు ధాన్యకటక-అమరావతులలో రచింపబడి ఉంటాయి. ఇలా ఊహించడానికి రెండు కారణాలు ఉన్నాయి. మొదటిది — అలాంటి భక్తిసూత్రాలు రచించడానికి తగిన వాతావరణం ఈ ప్రాంతంలో ఉండేది. రెండవది-ఈసూత్రాలలో ప్రధానమైన సుఖావతీ వ్యూహసూత్రం అంధకులద్వారా ఆవిర్భవించిన రత్నకూటానికి చెందినది. ఖోటాన్ ప్రాంతీయుడైన సంఘవర్మ (క్రీ.శ. తృతీయశతాబ్దం) దీన్ని చైనా భాషలోకి అనువదించాడు. గృధ్రకూట పర్వతంమీద, బోధిసత్త్వులూ; భిక్షువులూ ఉన్న సభలో, బుద్ధుడు చెప్పిన ధర్మాకరభిక్షువు కథ దీనిలో ఉంది. ఎన్నో యుగాలకు పూర్వం ధర్మాకరుడు చాలాకాలంపాటు ధర్మాన్ని అభ్యసించి ఆచరించాడు. అపుడాతని గురువు ఎన్నో లక్షల బుద్ధక్షేత్రాల (స్వర్గాల) ఉత్తమ లక్షణాదులను గూర్చి వర్ణించి చెప్పాడు. అది వినగానే అతనికి వాటి సాక్షాత్కారం కలిగింది. తరువాత అతడు మళ్ళీ ఐదు యుగాలపాటు ధ్యానంచేసి, ఆ ధ్యానం నుంచి బైటకు వచ్చిన తరువాత, ఇతరమైన బుద్ధలోకాలలో కనబడేవే కాక ఊహాగోచరమైన అన్నివిధాల పరిపూర్ణతా పరిపక్వతత్వాలతో కూడిన ఒక బుద్ధ లోకాన్ని తానే నిర్మించాలని నిశ్చయించుకున్నాడు. తాను ఊహించినవిధంగా అత్యద్భుతమూ, సర్వాంగపరిపూర్ణమూ అయిన బుద్ధలోకం ఒకటి నిర్మించేవరకూ నిర్వాణం పొందబోనని, అతడు తనగురువూ, దేవతలూ, దానవులూ, ఇతర దివ్య వ్యక్తులూ ఉండగా వారందరి ఎదుట ప్రతిజ్ఞ (ప్రణిధాన) చేశాడు. ఇలా ప్రతిజ్ఞ చేసిన తరువాత అతడు మూర్తీభవించిన దయా విజ్ఞానాలవలె, ఎన్నో యుగాలపాటు అనంతమైన ఉత్తమకార్యాలు చేయడం ప్రారంభించాడు. దీనితో అతడు బుద్ధుడు అయినాడు. ఈ ప్రపంచానికి చాలా దూరంగా, పశ్చిమాన, సుఖావతి (సుఖనిల

యము) అనే ఒక బుద్ధక్షేత్రం సృజింపబడింది. దానికి అతడే అధిష్ఠాత అయి నాడు. ఆతని కాంతీ, అతని ఆయుస్సూ అనంతములవడంచేత ఆతనికి అమితాభు డనీ, అమితాయువనీ పేర్లు వచ్చాయి. ఆతని బుద్ధక్షేత్రం పరినిష్ఠితత్వమూ, సమ త్వమూ, పవిత్రత్వమూ, జ్ఞానమూ, ఆనందమూ అనే శాశ్వత ధర్మాలకు నిలయం. ఇది పది యుగాలకు పూర్వం ఆవిర్భవించింది. 'విశ్వాసంతోటీ, ఆనందంతోటీ నా పేరును వింటూ, నన్నుగూర్చి ధ్యానం చేసేవాడు సర్వజ్ఞత్వ పవిత్రత్వాలతో కూడిన నారాయణ శరీరంతో ఆ క్షేత్రంలో పుట్టగలడు" అని అమితాభుడు ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. సుఖావతి చేరినవానికి పునర్జన్మ లేదు. అసంఖ్యాకులైన బుద్ధు లందరూ అమితాభుని ప్రభావాన్ని, ఉత్తమ గుణాల్ని ప్రశంసిస్తూ ఉంటారు. ఈ కథ చెప్పిన తరువాత బుద్ధుడు గృధ్రకూట సభలో ఉన్న వారందరికీ సుఖావతి ప్రత్యక్షం అయేటట్లు చేశాడు. అపుడు గృధ్రకూటం మీద ఉన్న వారందరూ సుఖావతిని చూడడమే కాకుండా, సుఖావతిలో ఉన్నవారు గృధ్రకూటంమీద ఉన్న వారిని చూడడం కూడా జరిగింది.[33]

"బుద్ధుని సద్గుణాలూ, ఆతని శక్తీ ఆతనికి మాత్రమే సీమితం కాకుండా అందరినీ కూడా చేరుతాయి. ఎందుచేతనంటే లోకోత్తరమైన జ్ఞానంవలనా, అనంత మైన కరుణవలనా, ఆతనిలో ఒక దివ్యశక్తి (అధిష్ఠాన) ఆవిర్భవిస్తుంది"— అనే అభిప్రాయమే ఈ బుద్ధభక్తికి ఆధారం. అమితాభుని పేరు వినగానే జగద్రక్షాదక్ష మైన ఆతని ప్రభావం విషయంలో కారణ ప్రయోజనాద్యపేక్ష లేని విశ్వాసం కనక కుదిరినట్లైతే, అప్పుడు ఆతని అనంత జీవితమూ, జ్ఞానజ్యోతిస్సూకూడా సర్వత్ర వ్యాపించడానికీ, అందరినీ ఆ పవిత్రానందధామానికి చేర్పడానికీ సిద్ధంగా ఉంటుంది. ఈ రకమైన మహాయానంలో బుద్ధుని ఉపదేశాలకి కాక, ఆతని జీవితానికీ, వ్యక్తి త్వానికీ, లోకోత్తరమైన ఆధ్యాత్మికశక్తికీ, ఆతనిపై శ్రద్ధకూ ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది. స్థిరమైన విశ్వాసం ఉన్నవారిని రక్షించేది మనుష్య ప్రయత్నంకాదు; ఆతని (బుద్ధుని) ప్రభావం మాత్రమే. ఈ విధంగా ప్రతి ఒక్కడూ నిశ్చితంగా నిర్వాణం పొందవచ్చు. ఈ రకమైన బౌద్ధమతానికీ, ప్రాచీన బౌద్ధమతస్వరూపానికీ చాలా భేదం ఉన్నది అని అనుకోవడం పొరబాటు. బుద్ధక్షేత్రాలను గూర్చిన వర్ణన ప్రాచీన బౌద్ధవాఙ్మయంలోకూడా ఉంది. భగవానుడైన బుద్ధుడూ, ఆతని సర్వజ్ఞత్వమూ, పవిత్రత్వమూ, మానవాతీతమైన అలౌకికశక్తీ, ఆతని ఉపాసనా, నిరంతరమూ ఆతనికి నమస్కరించడమూ ఇవన్నీ

భక్త్యానంద పారవశ్యంతో సుత్తనిపాత గ్రంథంలో వర్ణింపబడి ఉన్నాయి. దీనిని ఆధారంగా చేసుకొని మహాసాంఘికులు, అంధకులు (చూ. పై.) లోకోత్తర బుద్ధుడనే ఒక బౌద్ధధర్మాధిష్ఠాన దేవుడు ఉన్నాడు అనే భావం ప్రచారంలోనికి తీసుకొని వచ్చినారు. ఇదే కాలక్రమంలో ఒక పరిశిష్ఠిత రూపాన్ని పొంది సుఖావతీ వ్యూహసూత్రంలో ఉన్న భక్తి ధర్మంగానూ, అమితాభమతంగానూ వ్యాప్తిలోనికి వచ్చింది. ఇది జపాను దేశంలో అత్యధిక ప్రచారం పొందింది.

# 5. ఆంధ్రదేశంలో మాధ్యమికులు

మహాయాన సూత్రాలు ఆధారంగా తీసికొని నాగార్జునుడు మాధ్యమిక సిద్ధాంతాన్ని రూపొందించాడు. నాగార్జున కారికలనూ, వీటికి చంద్రకీర్తి వ్రాసిన వ్యాఖ్యానాన్నీ చాలావరకు ఆధారం చేసుకొని శ్రీ టి. ఆర్. వి. మూర్తి "సెంట్రల్ ఫిలాసఫీ ఆఫ్ బుద్ధిజమ్" అనే పేరుతో మాధ్యమిక సిద్ధాంత సార ప్రతిపాదకమైన మంచి ప్రామాణిక గ్రంథం రచించారు. "మహాప్రజ్ఞాపారమితోపదేశ శాస్త్రము" అనే గ్రంథం నాగార్జున విరచితమని సంప్రదాయజ్ఞులు చెపుతారు. ప్రస్తుతం అది చైనా భాషలో మాత్రమే లభిస్తూన్నది. దీనిలో ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని శ్రీ కె. వెంకటరమణన్, "నాగార్జునాస్ ఫిలాసఫీ" అనే గ్రంథంలో చర్చించారు. నేటి ఉత్తమ బౌద్ధ మత పండితులలో ఒకడైన హజిమే నకముర మూలు (Hajime Nakmura) అనే ఒక జపానుదేశపండితుడు ఈ మధ్య ప్రాచీన మాధ్యమిక సిద్ధాంతాన్నిగూర్చి ప్రామాణికమూ, సంక్షిప్తమూ అయిన చర్చచేసి ఉన్నాడు.[34] కార్ల్ జాస్పెర్స్ అనే ఆయన ఈతనిని (నాగార్జునుని) గూర్చి ఎన్నో విషయాలను స్పష్టీకరిస్తూ వ్రాసి ఉన్నాడు. ప్రధానమైన గ్రంథాలకీ, లేఖలకీ, సంపూర్ణమైన ఆంగ్లానువాదాలు కూడా లభిస్తున్నాయి. ఆతని జీవితానికి సంబంధించిన విషయాలన్నింటినీ సేకరించి 'నాగార్జున'[35] అనే గ్రంథంలో విమర్శనాత్మక దృష్టితో ప్రతిపాదించి ఉన్నాను సంక్షిప్త రూపంలో ఆతని సిద్ధాంతాలు కొన్ని, అతని రెండు గ్రంథాలనుంచి కొన్ని భాగాల అనువాదాలూ కూడా ఈ గ్రంథంలో ఇవ్వబడ్డాయి. అందుచేత నేనిక్కడ ఆయనను గూర్చి చాల కొద్దిగా మాత్రమే చెపుతాను. ఉత్తర-బౌద్ధదేశాలవారు, రెండవ బుద్ధుడుగా పరిగణించే నాగార్జునుడు, జెన్రీ సుక్మోటో (Zenry Tsukmoto) చెప్పినట్లు "ప్రప్రథమంగా మహాయాన సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చిన మహాపురుషుడు."[36] "మహాయాన

సిద్ధాంత ప్రవర్తకుడు ఈతడే అనికూడా చెప్పవచ్చును"[37] అని హనయామ షిన్షో (Hanayama Shinsho) నిస్సంకోచంగా వ్రాశాడు. సర్ ఛార్లెస్ ఎలియట్ (Charles Eliot) అభిప్రాయం ప్రకారం "అతడు ఒక మహావ్యక్తియే కాకుండా, ఒక నూతన సంచలనానికి, ఒక సిద్ధాంతానికి ప్రతినిధి''.[38] ఈతడు దక్షిణాపథంలోని సాతవాహన సామ్రాజ్యంలో జనించాడు. తన కర్మణ్య జీవితంలోని చాలాభాగం ధాన్యకటక-అమరావతీ శ్రీ పర్వతాల (నాగార్జునకొండ)లో గడిపాడు. క్రీ.శ. 150-200 మధ్య ఇతడు నిరంతరోద్యోగశీలుడై ఉన్నాడు. ఇతడు సాతవాహన వంశానికి చెందిన ఒక రాజుకు మిత్రుడు. నాగార్జునకొండదగ్గర ఒక విహారంలోని ఒక భిక్షుగుహలో రెండు చిన్న దంతాలు ఉన్న, సున్నపురాతి పూర్ణకుంభం ఒకటి త్రవ్వకాలలో లభించింది. ఇవి నాగార్జునుని అవశేషాలు అని కొందరి అభిప్రాయం. ఇతడు అమితాభుని భక్తుడనీ, ధాన్యకటకంలో ఇతనికి అమితాభుని సాక్షాత్కారం లభించినదనీ, ఇతడు సుఖావతికి అభిముఖంగా తిరిగి మరణించాడనీ ఒక సంప్రదాయం ఉంది.[39] ఎవరో ఒక సాతవాహనరాజు ఈతనిని చంపించినాడు అని ప్రొఫెసర్ లాల్‌మని జోషీ అభిప్రాయం.

నాగార్జునుడు ప్రపంచంలోని గొప్ప తత్త్వశాస్త్రవేత్తలలో ఒకడు. ఇప్పుడు నేను నాగార్జునుని గ్రంథాలన్నిటిలోకీ ప్రధానమైన గ్రంథంనుంచి[40] (మాధ్యమిక కారికలు) ఏడు శ్లోకాలు అనువాద రూపంలో ఉదాహరిస్తాను. వీటినే చాలా మంది అతివిస్తృతంగా ఉదాహరిస్తూ ఉంటారు. "ప్రతీత్యసముత్పాదము సర్వ ప్రపంచోపశమరూపమైనదనీ, ఆనందమయమైనదనీ, దీనిలో జన్మకాని, విలయము కాని, వినాశముకాని. నిత్యత్వము కాని, ఏకత్వముకాని, భిన్నత్వముకాని, వచ్చుట కాని పోవుటకాని ఉండవు అని బోధించిన బుద్ధునకు నమస్కారము" (I 1-2). ''ప్రతీత్యసముత్పాదమంతా శూన్యము. ఇది ఆరోపితమైన ప్రజ్ఞప్తి మాత్రం. ఇదే మధ్యమార్గం" (xxiv.18). ''తథాగతుని స్వభావమే ప్రపంచస్వభావము; తథాగతునికి తన స్వభావం అంటూ ఏదీ లేదు. ఈ ప్రపంచానికి కూడా దాని స్వభావం అంటూ ఏదీ లేదు. (xxii-16), "ఈ సంసారానికీ (జనన మరణ చక్రానికీ) నిర్వాణానికీ (ప్రశాంతమైన పరిశుద్ధస్థితికి) ఏమాత్రమూ భేదం లేదు. నిర్వాణాంతమే సంసారాంతం. ఈ రెండింటికీ ఏమాత్రమూ భేదంలేదు."(xxv-19-20), "కరుణామయుడై సర్వదృష్టులనూ నశింపచేసే ధర్మాన్ని బోధించిన గౌతమబుద్ధునికి నమస్కారము." (xxvii-30) జగత్స్వరూపాదులకు సంబంధించిన మాధ్యమిక

సిద్ధాంతం ఈ శ్లోకాల్లో ప్రతిపాదింపబడింది పరస్పర సంబంధకృతమూ, పరస్పర సమాలంబనమూ అయిన వస్తువుల స్థితికి 'ప్రతీత్యసముత్పాదము' అని పేరు. ఇది స్వయంగా ఏర్పడినది కాదు; ఇతరులు ఏర్పరచినది కాదు; ఉభయమూ కాదు; కారణ రహితమూ కాదు; అన్ని వస్తువులూ కూడా ఇతర వస్తువులపై ఆధారపడియే ఉత్పన్నం అవుతున్నాయి. అందుచేత అవి అన్నీ స్వతః నిస్సారములు, నిరాత్మక ములు. దీన్ని పట్టి పరిశీలిస్తే అవి శూన్యములే. 'మధ్యమార్గం' అనేది శూన్యత్వానికి మరొక పర్యాయపదం. దీన్నే నైరాత్మ్యము అనికూడా అంటారు నైరాత్మ్యమే నిస్స్వభావత్వము, ఇదే తత్త్వము. మధ్య మార్గానుభూతియే జ్ఞానం. తాను చేసిందల్లా బుద్ధుని ఉపదేశాల వ్యాఖ్యానం మాత్రమే అని నాగర్జునుడు చెప్పుకొంటాడు. ఇతను ఇలా చెప్పడంలో సామం జస్యం ఉంది. ఎందుచేతనంటే-శాశ్వతవాదం అనే ఈ అంతాన్నీ, ఉచ్ఛేదవాదం అనే ఆ అంతాన్నీకూడా విడిచిపెట్టి గ్రహింపబడిన మధ్యమార్గం, పాలివాఙ్మ యంలో[41] వర్ణింపబడిన ప్రథమ ధర్మచక్రప్రవర్తనంలోనేకాకుండా సంస్కృత బౌద్ధ వాఙ్మయంలో[42] వర్ణింపబడిన ద్వితీయ ధర్మచక్ర ప్రవర్తనంలో కూడా అంగీకరింపబడింది. శూన్యతావాద బీజాలు ప్రథమ ధర్మచక్ర ప్రవర్తనంలోనే కనబడ తాయి.[43] ఐతే, మనం వెనక చూచినవిధంగా, ఈ వాదం ద్వితీయ ధర్మచక్ర ప్రవర్తనంలో అభివృద్ధి పొందింపబడింది. ఈ సిద్ధాంతాన్నంతనీ నాగార్జునుడు ఒకే ఒక శ్లోకంతో సంగ్రహించి చెప్పాడు. ఈ శ్లోకమూ, దీనిపై ఆతడు వ్రాసిన వ్యాఖ్యానమూ ఈ రెండూ, చైనాభాషలో ఉన్న 'ప్రజ్ఞారుచి' (క్రీ.శ. 538-543) లో భద్రపరుపబడి ఉన్నాయి. "భావముల (వస్తువుల) స్వభావం అనిత్యం. అందుచే భావము అభావమే, స్వభావంకూడా అభావమే. అందుచేత, శూన్యత అనిత్యత అనేవి మాత్రమే ఉన్నాయి అని బోధింపబడింది."[44] సాతవాహన రాజుకు నాగార్జునుడు వ్రాసిన "రత్నావళి", సహృల్లేఖా" అనే లేఖలవల్ల సమాజానికీ, రాజకీయాలకీ సంబంధించిన విషయాలలో, ఆతని అభిప్రాయాలు ఎలా ఉండేవో మనకు తెలుస్తుంది. వీటిని, జగన్నాథ ఉపాధ్యాయ, హాజిమె నకమురలు చక్కగా వివరించి ఉన్నారు.[45] "ప్రతి వ్యవహారానికీ దయాసత్యాలు ఉపోద్బలకంగా ఉండాలి" అని అంటాడు నాగార్జునుడు. ఏది సర్వథా పరుల మంచికి మాత్రమే ఉపయోగిస్తుందో అదే సత్యం (పరైకాన్తహితం సత్యమ్). హిందూ అర్థశాస్త్రంలో చెప్పినట్లు కాకుండా, నాగార్జునుని అభిప్రాయం ప్రకారం, రాజ్యపరిపాలనం నైతికమార్గంమీద నడవాలి; న్యాయనిర్ణయం

కరుణాభావ కలితమై ఉండాలి. రాజశాసనం ధిక్కరించినవాడూ, అపరాధీ, పాపాత్ముడూ, వీరినందరినీకూడా సన్మార్గంలోనికి తీసుకొని రావడానికి సర్వవిధాలా ప్రయత్నం చెయ్యాలి. ఎందుచేతనంటే సంస్కరించడానికి శక్యం కానివారంటూ ఎవరూ ఉండరు, దండనం ఎన్నడూ, కఠినంగానూ, అమానుషంగాను ఉండ కూడదు. అది అపరాధిని సంస్కరించడానికీ, ఆతని సచ్ఛీలం పెంపొందించ డానికీ అనువైనదిగా ఉండాలి (రత్నావళి). పూర్తిగా ఆధ్యాత్మిక జీవితానికి అంకితుడైన భిక్షువుకూడా నైతిక నియమాలన్నింటినీ సమగ్రంగా పాటించజాలడు. అలాంటప్పుడు లౌకిక జీవితాన్ని గడిపేవాడు ఈ నియమాలన్నింటినీ పూర్తిగా పాటించాలంటే అది అసంభావ్యమైన విషయం. అత్యుత్తమనైతికాదర్శాలను దృష్టిలో ఉంచుకొని, ఎవరూకూడా తమ నైతిక లోపాలనుగూర్చి మనస్సులో మథనపడవలసిన పనిలేదు. బుద్ధత్వం పొందాలనే దృఢసంకల్పంతో ఇతరుల మంచితనాన్నీ సద్గుణాలనూ చూచి ఆనందిస్తూ, తనకు శక్యమైనంతవరకూ, శ్రద్ధాభక్తులతో నైతిక మార్గాన్ని అనుసరించాలి. ఒకనాడు కాకపోతే ఒకనాటి కైనా, ప్రతిఒక్కడూ, తప్పకుండా నిర్వాణం పొందుతాడు (సుహృల్లేఖ).

"అమితాభునిపై భక్తి నిర్వాణానికి సులభమార్గము (జపాన్ భాషలో ఇగ్యో)" అని నాగార్జునుడు ఉపదేశించాడు. అంటే తన నైతిక స్థితిలో లోపాలు ఉన్నాయనే విషయాన్నీ తన అజ్ఞానాన్నీ గుర్తించి అనంతశక్తియైన అమితాభుడే ఇంక తనను రక్షించవలసి ఉన్నది అని పూర్తి విశ్వాసం కలిగి ఉండడం అని అర్థం అమితా భుని అపారశక్తినీ, సకలలోకాలను రక్షించాలనే ఆతని తీవ్ర వాంఛనూ విశ్వసించిన ఏ వ్యక్తియైనా, ఆతడు నైతికోన్నతిలో ఎట్టి స్థితిలో ఉన్నా, రక్షింపబడతాడు. ఇట్టి విశ్వాస కల వ్యక్తికి అమితాభుడు జ్ఞానోదయం కలిగించి నిర్వాణం లభించే టట్లు చేస్తాడు నాగార్జునుని ఉపదేశాల్లో ఉన్న ఈ అంశాన్ని మరువకూడదు సుదూర ప్రాగ్దేశాల్లో ఉన్న అమితాభమతానుయాయులు నాగార్జునుణ్ణి తమ మొట్ట మొదటి మతగురువుగా భావిస్తారు. బహుశా నేను మినహా, నేటి భారతీయ తత్త్వ వేత్తలందరూకూడా, నాగార్జునుని సిద్ధాంతం అంతా చంద్రకీర్తి వ్యాఖ్యాసహితాలైన ఆతని కారికల్లో నిక్షిప్తమైఉన్నదని భావిస్తున్నట్లు కనబడుతుంది. ఇది పొరబాటు. శంకరాచార్యులవలె నాగార్జునుడుకూడా కేవలం తత్త్వవేత్తయే కాకుండా, భక్తుడు కూడా ఈ విషయం ఆతని ఎన్నో గ్రంథాలవల్ల తెలుస్తూన్నది మరొక విషయం ఏమంటే నాగార్జున కారికలకు చంద్రకీర్తి వ్రాసిన వ్యాఖ్యానమే ప్రామాణికమైన

వ్యాఖ్యానమని అనుకోవడానికి వీలులేదు. అదేవిధంగా ఆతని కారికల్లో, కాంట్, ఐన్‌స్టీన్ మొదలైన అర్వాచీనులు భావాలను చూడడానికి ప్రయత్నించడంకూడా సముచితంకాదు. ఆతని తాత్త్విక సిద్ధాంతం అంతా, తర్కంమీదా హేతువాదం మీదా ఆధారపడి ఉన్నదనుకోవడంకూడా పొరబాటే. "బుద్ధభగవానుని సూత్రాలు బోధించే విషయాన్నిమాత్రమే పూర్తిగా స్థాపించడానికి వీలు అవుతుంది. వాటిలో ప్రతిపాదించని దానిని స్థాపించడం అశక్యం. బుద్ధుని సూత్రాలలో బోధింపబడని దానిని విశ్వసించడానికి వీలులేదు. నేను చెప్పేదంతా సూత్రసంమతమే అవడం చేత ఇది స్థాపింపబడుతుంది." (ఏకశ్లోక శాస్త్రము) అని నాగార్జునుడే వ్రాసి ఉన్నాడు ఇండియా, చైనా, జపాన్, టిబెట్, మంగోలియా, కొరియా దేశాల్లో వ్యాపించిన ఈతని ప్రభావాన్నిగూర్చి 'నాగార్జున' (పే. 72-79) అనే గ్రంథంలో వ్రాసి ఉన్నాను.

నాగార్జునుని శిష్యులలో ప్రధానుడైన ఆర్యదేవుడు, అత్యుత్తముడైన రెండవ మాధ్యమిక తత్త్వవేత్త. ఆతని 'చతుఃశతకం' ప్రసిద్ధమైన గ్రంథం. అతడు సింగలరాజు దత్తపుత్రుడని టిబెట్టులోని కొన్ని ప్రమాణాలవల్ల తెలుస్తూన్నది. ఈ 'సింగలం' గుంటూరుజిల్లా అని యస్. డబ్ల్యూ. లాడెన్ లా అభిప్రాయం.[46] కుమారజీవుని అభిప్రాయం ప్రకారం ఇతడు దాక్షిణాత్య బ్రాహ్మణుడు ఐతే ఇతడు సింహలదేశ యువరాజని చంద్రకీర్తి చెప్పి ఉన్నాడు. ఇతడు నాగార్జునునుంచి ధర్మసత్యాన్ని అభ్యసించి ప్రసిద్ధ పండితుడైనాడు. పాటలీవుత్రం వెళ్లి ఇతరమతస్థులందరినీ వాగ్వాదంలో జయించాడు. ఇతనిచే పరాభూతుడైన ఒక మతాచార్యుని శిష్యుడు ఈతనిని, అడవిలో, ధ్యానముద్రలో కూర్చొని ఉండగా, చంపివేశాడు. మరణించేముందు ఇతడా ఘాతకునికి ఉపదేశం చేసి, ఆతనిని పట్టుకొని దండించాలని ప్రయత్నించిన తన శిష్యుల్ని అలా చేయ వద్దని నివారించాడు. ఇతని చిట్టచివరి ఉపదేశ వాక్యాలు ఇవి :- "సర్వమూ మిథ్య. ఈ దృశ్య ప్రపంచంలోని అన్ని పదార్థాల నైజస్వరూపాన్నీ గూర్చి విచారణ చేయాలి. అణగ ద్రొక్కడమూ, క్రూరత్వమూ అనేవి ఎక్కడ ఉన్నాయి ? మిత్రుడెవరు, శత్రువెవరు? చంపేవాడెవరు, చంపబడేవాడెవరు? అన్ని భావాల (వస్తువుల) నైజస్వభావాన్ని గుర్తించిన వాని దృష్టిలో చంపేవాడూ లేదు, చంపబడే వాడూ లేదు."[47] ఆర్యదేవుని ప్రధాన కార్యక్షేత్రం ఆంధ్రదేశమే అనడంలో సందేహం లేదు. ఇతని అస్థిశేషాలు ఉంచి, పైన కొన్ని వాక్యాలు వ్రాసిన

పాత్రఒకటి గుంటూరుమండలంలో లభించింది.[48] ఇతడు సింహలదేశ రాజకుమారుడైనా, లేక దాక్షిణాత్య బ్రాహ్మణుడైనా, శాంతయానుడు ఏ విధంగా అమెరికాదేశతత్త్వశాస్త్రవేత్తయో అదేవిధంగా ఇతడుకూడా ఆంధ్రుడే. నిజానికి, ఇతడు బహుశా ఆంధ్రదేశంలోనే పుట్టి ఉంటాడు. ఇక్కడ పనిచేసి, ఇక్కడనే మరణించాడు.

శూన్యవాదం ఒకానొక బోధిసత్త్వనిజీవితంతోటీ, అతని ప్రవృత్తితోటీ ముడివడి ఉన్నదని ఆర్యదేవుడు చతుః శతకంలో చెప్పాడు. 'సంవృతి సత్యము' పరమార్థ సత్యము' అనే రెండు విధాలైన సత్యం అధికారభేదాన్ని పట్టి వచ్చినదని కూడా ఇతడు ప్రతిపాదించాడు. క్రింది తరహా వారికి దానమూ, మధ్యతరహావారికి శీలమూ, పై తరహావారికి శాంతీ విధింపబడ్డాయి. తన శూన్య స్వరూపత్వాన్ని సాక్షాత్కరించు కోవడంవల్ల శాంతి లభిస్తుంది. దీనికి కర్మతో దేనితోటీ పనిలేదు. అందు చేత ఒక విధంగా చూస్తే ఇది చాలా సులభమైనది, మరొకవిధంగా చూస్తే చాలాకష్టమైనది. శూన్యతాజ్ఞానం స్వయం ప్రకాశం; భేదవిహీనం, సర్వోత్తమం. ఇది భేద ప్రతిభాసరూపమైన అజ్ఞానాన్ని తొలగిస్తుంది. ఆర్యదేవుడు క్రమబద్ధమైన ఒక యోగాభ్యాసాన్ని సూచించి ఉన్నాడు. దీని చివరి మెట్టులో శూన్యతా సాక్షాత్కారం కలుగుతుంది. ఈ విధంగా 'చతుఃశతకం' కూడా ఒక బోధిసత్త్వని యోగాచారశాస్త్రమే. ధర్మపాలుడు నిరూపించినట్లుగా, ఇందులోని పూర్వార్థంలో ధర్మం బోధింపబడింది, ఉత్తరార్థంలో యుక్తిపూర్వకంగా, ఇతరమతాలు ఖండింపబడ్డాయి. చివరకు ఏ సిద్ధాంతమూకూడా నిలవదు అనే విషయాన్ని ప్రతిపాదించడానికి నాగార్జునుడు అవలంబించినట్లుగా, ఆర్యదేవుడు, ఒకేవిధమైన తర్కాన్ని (ప్రసంగాపాదానాన్ని) అవలంబించకుండగా, అప్పుడప్పుడు ప్రతివాదుల వాదాలను ప్రతిపాదించి, వేరువేరుగా పరిశీలించి, వాటిలోఉన్న భేదాలను నిరూపిస్తూ, ఆ వాదాల నిఃసారత్వాన్ని నిరూపిస్తాడు.

ఇప్పుడు భవ్యుని (లేదా భావవివేకుని) గూర్చి చెప్పవలసి ఉన్నది. హుఃయన్‌త్సాంగ్ చెప్పిన దానినిబట్టి, ఇతడు ధాన్యకటక రాజధానికి దక్షిణంగా చాలదూరంలో ఒక పర్వతశిఖరంమీద, లేదా ఏకశిలాకారంలో ఉన్న పర్వతం మీద ఉన్న ప్రాసాదంలో నివసించేవాడు.[49] ఇతడు గొప్ప శాస్త్రపండితుడనీ, శాస్త్రార్థ నిపుణుడుగా ప్రసిద్ధిపొందినవాడనీ, నాగార్జున సంప్రదాయంలో వాడె నా

సాంఖ్యాయన వేషం ధరించేవాడనీ, మైత్రేయ బుద్ధదర్శనార్థం నిరీక్షించేవాడనీ హ్యూయన్‌త్సాంగ్ వ్రాసి ఉన్నాడు. ఈ పర్వతం ఉదవిల్లి అయి ఉంటుందనీ, ఆ రాజధాని విజయవాడ అయి ఉంటుందనీ సివెల్ (Sewell) అభిప్రాయం. పైన చెప్పిన రాజధానీ నగరం విజయవాడ అయి ఉండవచ్చునని 'ఫర్గూసన్ Fergusson,) వాటెర్స్ (Watters,) బర్జెస్ (Burgess) మొదలైన వారుకూడా ఊహించారు కాని, ఇది సంశయాస్పదమైన విషయమే. ఎందుచేత నంటే, ఈ రాజధాని ధాన్యకటక నగరమే కావచ్చును. ఇతడు క్రీ. శ. 490-570 ప్రాంతంవాడై ఉంటాడని నకముర అభిప్రాయం. భవ్యుడు మలయగిరి (ఇది మంగళగిరియా?) కి చెందిన దాక్షిణాత్యుడు ఇతడు మాధ్యమికులలో "స్వాతంత్రకులు" అనే ఒక శాఖకు నాయకుడైనాడు. నాగార్జునుని కారికలకు ఒక వ్యాఖ్యానంతోపాటు, భవ్యుడు మరి మూడు ఇతర గ్రంథాలుకూడా రచించాడు.

బుద్ధుని వచనాలతో కూర్చిన బుద్ధసూత్రాలే ప్రామాణికములనీ, అవి ఇతరాపేక్ష లేకుండా జ్ఞానోదయం కలిగించడానికి సమర్థమైనవనీ భవ్యుని సిద్ధాంతం. ఈ సూత్రాల్ని యుక్తితో సమర్థించవలసిన పనిలేదు. ఆగమాలను అర్థంచేసుకోవడానికి మాత్రమే యుక్తి ఉపకరిస్తుంది. ఐతే, ఇతడు, నిఃస్వభావత్వాన్ని, శూన్యత్వాన్ని సాధించడంకోసం అనుమాన ప్రయోగాన్ని అంగీకరించాడు. సిద్ధాంతాలన్నీ నిస్సారమైనవే అనే విషయాన్ని అనుమాన సహాయంతో ప్రతిపాదించడానికి ప్రయత్నం చేశాడు. బస్టన్ (Bu-ston) వ్రాసినట్లు - వ్యావహారికవృత్తిలో ఈ బాహ్యప్రపంచం సత్యమే అని భవ్యుడు అంగీకరించాడు. వ్యావహారిక సత్యానికీ (తథ్యసంవృతి) ప్రాతిభాసిక సత్యానికీ (మిథ్యాసంవృతికీ) భేదం ఉన్నదనీ, వర్ణనాయోగ్య పారమార్థిక సత్యమూ వర్ణనాతీత పారమార్థిక సత్యమూ, అనే రెండు విధాలైన పారమార్థిక సత్యాలు ఉన్నాయనీ భవ్యుడు అంగీకరించాడు. ఈ వర్ణనాయోగ్య పారమార్థిక సత్యం (పర్యాయ పరమార్థ) "నిస్స్వరూపమైన (Counter-Productive) నిషేధంనుంచి ప్రాచీన బౌద్ధ వాదాన్ని తప్పించినది; ఒక దృష్టితో పరిశీలిస్తే ఇది (నిషేధం) అత్యంత విరుద్ధము, ఈ విధంగా ఇది పరమార్థంలోనూ, సంవృతిలోనూ ఉన్న మౌలిక విభేదాన్ని నిరూపిస్తూన్నది" అని నకముర వ్యాఖ్యానించాడు.[50] ఏమైనా, భవ్యుడు ''అద్వయవాదియే".

# 6. ఆంధ్రదేశంలోని బౌద్ధ తార్కికులు

దిఙ్నాగుడు భారతీయుల బుద్ధికౌశలం అందుకొన్న పరాకాష్ఠ అని చెప్పదగినదీ, "సర్వతోముఖమైనదీ తర్కబద్ధమైనదీ అయిన ఒక తాత్త్విక విచార పద్ధతిని"[51] ప్రవేశపెట్టాడు. "భారతీయ తత్త్వశాస్త్ర చరిత్రలో దిఙ్నాగుడు అత్యున్నతస్థానాన్ని ఆక్రమించినవాడు".[52] ఇతడు క్రీ.శ. 400-480 ప్రాంతానికి చెందినవాడని యూఐ(UI) నకముర, 480-540 ప్రాంతానికి చెందినవాడని వాటన్బె (Watanbe), 520-600 ప్రాంతానికి చెందినవాడని కెర్న్ (Kern) ఆరవశతాబ్ది పూర్వార్ధానికి చెందినవాడని లాల్‌మనిజోషీ భావిస్తున్నారు. ఇతడు కాంచీపరిసర ప్రాంతాల్లోని సింహవక్త్రంలో జన్మించిన బ్రాహ్మణుడు కొంతకాలం ఒరిస్సాలో నివసించి ఆ దేశపురాజు మంత్రిని బౌద్ధమతంలోనికి మార్చాడు. కొంతకాలం కొంకణ - మహారాష్ట్ర దేశాల్లోకూడా నివసించి అక్కడ ఉండే ఇతర మత ప్రచారకుల్ని బౌద్ధమతం అవలంబించేటట్లు చేశాడు. పదహారు మహావిహారాలు నెలకొల్పాడు. ఐతే, ఆతని ప్రధాన కార్యస్థానం ఆంధ్రదేశంలోని వేంగిప్రాంతం (పశ్చిమ గోదావరీ మండలం). వేంగి దగ్గర ఒక ఏకాంతంగా ఉండే పర్వతంమీద శిలానిర్మితమైన స్తూపం ఒకటి ఉండేది. ఆ పర్వతంమీద నివసించి ఉన్న కాలంలోనే ఇతడు 'ప్రమాణ సముచ్చయము' అనే తర్క శాస్త్రానికి సంబంధించిన ఉద్గ్రంథం రచించాడు. ఒరిస్సాలోని అరణ్యంలో మరణించాడు. హ్యూయన్ త్సాంగ్ చెప్పిన ప్రకారం ఆతడు ఆంధ్రుడు. మొదట ఇతడు హీనయానావలంబిగా ఉండి తరువాత విజ్ఞానవాది అయినాడు. సర్వాస్తివాదానికీ విజ్ఞాన వాదానికీ ఒక విధమైన సమన్వయం కుదుర్చుతూ ఒక సిద్ధాంతాన్ని రూపొందించాడు. ఇతని తర్కం "విమర్శాత్మక సత్యత్వవాదం". ఇతడు బౌద్ధతర్క ప్రారంభకుడైన ఆచార్యుడు. ఇతడు 'అపోహ' వాదస్థాపకుడగా ప్రసిద్ధి చెందినాడు. ఒక పదము ఏదైనా ఒక భావపదార్థాన్ని కాని, పదార్థాలసారం అనిచెప్పే జాతిని కాని బోధింపదు. 'ఇది ఇతరములకంటె భిన్నమైనది' అని మాత్రమే బోధిస్తుంది. ఈ విధమైన ఇతరవస్తునిషేధానికే అపోహము అనిపేరు. ఉదాహరణకు— 'నీలి రంగు' అనేదాన్ని ఇదమిత్థం అని నిరూపించడానికి శక్యంకాదు. 'నీలిరంగుకాని' కాదు. అని నిషేధరూపంలో మాత్రమే నిరూపించడానికి శక్యం అవుతుంది

అంటే, జినేంద్ర బుద్ధి వివరించినట్లుగా, "భిన్నార్థ నిషేధమే ఒక పదానికి అర్థం".[53] ఇతడు గొప్పతార్కికుడే కాకుండా గొప్ప ఆధ్యాత్మికానుభూతివాది కూడా. "అద్వైతజ్ఞానమే పరినిష్ఠితమైన విజ్ఞానం. ఈ అద్వైతస్థితి బుద్ధునికంటె అభిన్నమైనది"(ప్రజ్ఞాపారమితాజ్ఞానమద్వయం సతథాగతః)[54]అనిఈతని సిద్ధాంతం. ''తర్కం అప్రతిష్ఠితమైనది. ఇది వ్యావహారిక సత్యంవరకు మాత్రమే పరిమితమైనది బుద్ధికి శ్రమ కలగడం తప్ప దీనివల్ల ప్రయోజనం చాలా తక్కువ. మూఢాత్ములకు మాత్రమే దీనియందు అభిరుచి ఉంటుంది. దీనిమీదనే ఆధారపడిన వాళ్లు బుద్ధుడు ఉపదేశించిన ధర్మంనుంచి చాలా దూరంగా ఉండిపోతారు; ఎందుచేతనంటే ధర్మం అనేది తర్కంచేత తెలుసుకోతగిన విషయంకాదు. సాధారణ బుద్ధిమంతులైన సత్యతావాదులు చెప్పే దుష్ట లక్షణాలనీ, వాళ్లు చేసే పొరబాట్లనీ సరిదిద్దుకోవడానికీ, జ్ఞానసాధనాలేవో, జ్ఞానవిషయాలేవో నిర్ణయించడానికీ, వ్యావహారికానుభూతుల్ని ఒక నియమబద్ధ రీతిలో నిరూపించడానికీ మాత్రమే తర్కం ఉపయోగపడుతుంది. అలౌకిక విషయాల్లో తర్కం ఏమాత్రమూఉపయోగించదు" అని ఈ తార్కిక శిరోమణి ప్రతిపాదించాడు.

లాక్‌మనిజోషి అభిప్రాయం ప్రకారం క్రీ. శ. 680 - 650 ప్రాంతానికి చెందిన ధర్మకీర్తి ఒక గొప్ప బౌద్ధ తార్కికుడు, తత్వవేత్త. చూడామణి (చోళ) రాజ్యంలోని తిరుమలైలో, ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ఈ ధర్మకీర్తి గొప్ప మీమాంసకుడైన కుమారిలభట్టుకు సమకాలికుడు. తిరుమలై ఆంధ్రప్రదేశం లోని తిరుపతి (చిత్తూరు మండలం) కొండలపై ఉన్న ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. రాహుల్ సాంకృత్యాయన వ్రాసినట్లుగా, ''తర్కబద్ధంగా వాదించడంలోనూ, వివేచనాపాటవంలోనూ, స్పష్టంగా ఆలోచించగలిగిన శక్తిలోనూ ఎవ్వరూకూడా, ధర్మకీర్తిని, ఎన్నడూ మించలేకపోయారు.''[55] జీవితకాలంలోనే అతడు గొప్ప కీర్తి సంపాదించాడు. ఎంతో మంది రాజుల మన్ననలు పొందాడు. ఇతరమత పండితులు ఇతనిని చూస్తే గజగజలాడేవారు. ఈతని అత్యుత్తమ గ్రంథం 'ప్రమాణ వార్తికం', ఇతడు దిఙ్నాగమతానుయాయి దిఙ్నాగునికంటె ఒకఅడుగు ముందుకువెళ్లి, ఇతడు చూపిన ప్రమాజ్ఞాన లక్షణ పరిష్కారమూ, ప్రత్యక్షజ్ఞానాన్ని నాలుగు విధాలుగానూ, అనుమానాన్ని రెండు విధాలుగానూ విభజిస్తూ చేసిన సూక్ష్మ నిరూపణమూ, ఇవన్నీ తర్క శాస్త్రానికి ఈతనివల్ల లభించిన విశిష్ట విషయాలు. ప్రత్యక్షం ఒక వస్తువుయొక్క స్వలక్షణాన్ని మాత్రమే గ్రహిస్తుంది ఈ

స్వలక్షణమే యథార్థమైనది. అర్థక్రియాకారిత్వం దీనిప్రధాన స్వరూపం. కాల్పనికాలైన జాతులు (గోత్వాదులు) కేవలము అనుమానంచేత మాత్రమే గ్రహించబడతాయి. విశేషము క్షణరూపమైనది. అర్థక్రియా కారిత్వం క్షణానికే ఉన్నది. ఆదే సత్యమైనది. స్వలక్షణమనేది వర్ణనాతీతం. ఉత్పాదనచేసే సామర్థ్యమే (అర్థక్రియాకారిత్వ) స్థితి. మిగిలినదంతా మానసిక కల్పనామాత్రం. విజ్ఞానం భౌతిక పదార్థ ప్రకాశకం మాత్రమేకాదు; స్వప్రకాశంకూడా. తర్కదృష్ట్యా పరిశీలిస్తే బాహ్యపదార్థాలన్నీ అనుమాన విషయాలే ఎందుచేతనంటే, విజ్ఞానంద్వారా తప్ప అవి తనంతట తాముగా ఎన్నడూ ప్రకాశింపవు. ఐతే వాటికి ఒక స్వతంత్రమైన అస్తిత్వాన్ని అంగీకరించవలసిన పనిలేదు. జ్ఞేయము, జ్ఞానమూకూడా ఒక్కటే. వస్తుభేదం వాసనమాత్రం కల్పితం మరొక మాటలో చెప్పవలసివస్తే తెలుసుకొనుట, తెలియబడేదికూడా ఒకటే. వాస్తవంలో భేదం అనేది లేదు. "విజ్ఞానం భేద రహితమైనది. గ్రాహకము, గ్రాహ్యము అనే భేదం కాల్పనికం. వీటి ఐక్యం బుద్ధుని సర్వజ్ఞత్వం; అతని ఆధ్యాత్మిక శరీరం."[56] నాలుగు ఉత్తమ సత్యాలు తెలిసి, మానవులను జన్మమరణాలనుంచి విముక్తులను చేసే ఆచార్యుడే జ్ఞానానికి మూలకారణం అని గ్రహించాలి" అని ధర్మకీర్తి అంటాడు. బుద్ధుడు 'ప్రమాణభూతుడు'. అలాంటి సర్వజ్ఞుడు కరుణాప్రేరితుడై ఉపదేశిస్తాడు. సర్వజ్ఞత్వాన్ని మనం అవగాహన చేసుకొనజాలం; వర్ణింపజాలం. ఆ సర్వజ్ఞుడు (బుద్ధుడు) వర్ణనాతీతుడు.[57] ఒక్క జ్ఞాన క్షణంలోనే జ్ఞేయ జాలాన్నంతనీ గ్రహి-పగలిగినవాడే సర్వజ్ఞుడు, అని బౌద్ధ సంప్రదాయజ్ఞులు చెపుతారు.[58] బుద్ధుడు ఒక్కడే అలాంటి సర్వజ్ఞుడు. భావాలన్నీ శూన్యరూపాలనే జ్ఞానమే పరినిష్ఠిత జ్ఞానం. ఇట్టి జ్ఞానం సర్వజ్ఞత్వ లక్షణం, ఇట్టి జ్ఞానం కలవాడు బుద్ధుడొక్కడే. నిగుఢా ధ్యాత్మిక భావాలు, బుద్ధుడే సర్వజ్ఞుడూ, లోకరక్షకుడూ అనే విశ్వాసమూ, బుద్ధుని శరీరావశేషాలను పూజించడమూ మొదలైన విషయాలు తమ మతంలో ఉన్నా, బౌద్ధతత్త్వశాస్త్రవేత్తలు ఇతరమతాల్లో ఉన్న ఆచారాలనన్నింటినీ నిరర్థక విశ్వాసాలని నిందిస్తారు. "వేదాలను ప్రమాణంగా అంగీకరించడమూ, జగత్తును సృజించే వాడొకడున్నాడని విశ్వసించడమూ, పుణ్యం సంపాదించడంకోసం పవిత్రతీర్థాలు అనుకొనే నదుల్లోను తటాకాల్లోను స్నానం చేయడమూ, పుట్టుకను పట్టి వర్ణవిభాగము, పాపవినాశంకొరకై శరీరానికి పీడకలిగించే ఆచారాలను (ఉపవాసాలు, శరీరంమీద ముద్రవేయించుకోవడము మొ). అనుసరించ

దమూ, ఇవన్నీ బుద్ధిహీనుల మూఢత్వానికి చిహ్నాలు" అని ధర్మకీర్తి వ్రాసి ఉన్నాడు. [59] అంతటి తర్కశాస్త్రజ్ఞులు కూడా "ఈ విధంగా న్యాయసంగతంకాని నిందచేయడం తర్కబద్ధం కాదు" అనే విషయాన్ని గుర్తింప జాలకపోవడం చాలా ఆశ్చర్యకరం. ఇదే విధంగా గొప్ప మీమాంసక - నైయాయిక - వేదాన్త్యాదులు కూడా, తాము లౌకిక యుక్తి సహములు కానివీ, తర్కవిరుద్ధమైనవీ అయిన ఆచారాలు పాటిస్తూ, బౌద్ధుల ఆచారాలను తర్కవిహీనమూ అసంగతమూ అయిన పద్ధతిలో నిందిస్తూ ఉంటారు. ఏమైనా మతాల వైవిధ్యమూ, వాటి పరస్పర విరోధమూ ఇవి చాలా లోతైన క్లిష్ట విషయాలు. నేనిప్పుడు ఈ విషయాల్లోకి ప్రవేశించను.

# 7. బుద్ధఘోషుడు

అత్యుత్తముడైన ఒక థేరవాదబౌద్ధ పండితుడుకూడా ఆంధ్రదేశంవాడే అయి ఉండడం చాలా కుతూహలజనకమైన విషయం. ఈ పండితుడు బుద్ధఘోషుడు. ఇతడు చతుర్థ శతాబ్దాంతానికీ, పంచమశతాబ్ద ప్రారంభానికీ సంబంధించినవాడు. సింహళదేశంలో ప్రచారంలో ఉన్న కొన్ని కథలప్రకారం – ఇతడు మగధ దేశీయుడైన బ్రాహ్మణుడు. బౌద్ధమతం స్వీకరించి, సింహళ దేశంవెళ్లి, అక్కడ ఉన్న రోజుల్లో అతివిస్తృతమైన వాఙ్మయం సృష్టించాడు. తిరిగి మగధ దేశంచేరి అక్కడ మరణించాడు (మహావంశము, అనుబంధము (చులవంశము); బుద్ధఘోషూప్పత్తి). కాని బర్మాకు సంబంధించిన "మహాచరిత మధ్యమచరితాల ప్రకారం ఇతడు దిగువ బర్మాలోని 'తెలైంగ్ దేశానికి' సంబంధించినవాడు. అచటినుంచి సింహళదేశంవెళ్లి ధర్మగ్రంథాలు తీసుకొని వచ్చాడు. ధర్మగ్రంథాలతో బర్మాకు తిరిగి రావడం అనేది ధమ్మపాలరాజుకాలంలో జరిగిన గొప్ప సంఘటన. ఈతని గ్రంథాలు సింహళంలోకంటె ఎక్కువ సంపూర్ణంగా బర్మాలో, బర్మాలిపిలో సంరక్షింపబడి ఉన్నాయి. ఈ గ్రంథాలు, థైలండ్ కంబోడియా దేశాలకు బర్మానుండే వెళ్లాయి. కంబోడియాలో, బుద్ధఘోషవిహారం అనేపేరుతో ఒక పాడుపడిపోయిన విహారం ఉన్నది. బుద్ధఘోషుడు తన జీవిత చరమభాగాన్ని, ఇక్కడ గడిపినట్లుగా చెపుతారు.[60] బుద్ధఘోషుని 'విశుద్ధిమగ్గ' లోనూ, 'అట్ఠకథల' లోనూ లభించే ఆంతరంగిక ప్రమాణాలను డి. కౌశాంబి పరిపూర్ణంగానూ, విమర్శనా

పూర్వకంగానూ పరిశీలించి ఉన్నాడు. ఈయన చేసిన పరిశీలన దృష్ట్యా, సింహళ దేశ కథలనూ, బర్మా చరిత్రలనూ పూర్తిగా పునః పరిశీలన చేయవలసి ఉంటుంది.

బుద్ధఘోషుడు ఉత్తరదేశీయుడుకాని, బ్రాహ్మణుడుకాని అయి ఉండడానికి వీలులేదని కోశాంబి సిద్ధాంతీకరించినట్లే అని చెప్పవచ్చు. అతడు తెలుగు దేశానికి (తెలైంగ, తెలంగ, త్రిలింగ) సంబంధించిన కర్షకజాతిలో (గహపతి) జన్మించాడు. ఆతని విశుద్ధిమగ్గం చివరఉన్న పుష్పికలో ఆతడు మోరండఖేటకం అనే గ్రామానికి చెందినవాడు (వత్తబ్బేన) అని వ్రాయబడింది. మజ్ఝిమనికాయానికి వ్రాసిన ఈతని అట్ఠకథ చివరఉన్న పుష్పికలో, ఈతడు కొంతకాలం కంచీ పురంలో ఉన్నాడనీ, కొంతకాలం మయూరసుత్త పట్టణంలో (లేదా మయూరరూప పట్టనం)[61] అనగా మద్రాసులోని మైలాపూరులో ఉండేవాడనీ, చెప్పబడింది. పల్నాడులోని (గుంటూరుజిల్లా) 'కోటనెమలిపురి', 'గుండ్లపురి' అనే రెండు గ్రామాలలో ఒకటి బుద్ధఘోషుని జన్మస్థానం కావచ్చునని కొంతవరకు నిశ్చయ పూర్వకంగా చెప్పవచ్చు. ఎందుచేతనంటే (i) ఆ గ్రామాలకు నేడు ప్రసిద్ధిలో ఉన్న తెలుగు పేర్లు 'మోరండఖేట' అనేదానికి సమానార్థకాలుగా ఉన్నాయి. (ii) అక్కడ ఎన్నో ప్రాచీన శిథిలాలు ఉన్నాయి. (iii) అవి ఆ గొప్ప బౌద్ధమత నిలయాలకి దగ్గరగా ఉన్నాయి. అవి నాగార్జునకొండనుంచి 51 మైళ్లదూరంలోనూ, అమరావతినుంచి 58 మైళ్లదూరంలోనూ ఉన్నాయి.[62] మనం వెనుక చూచిన విధంగా, దేవానాంపియుడైన తిస్సరాజు ఆహ్వానంమీద, మహాదేవుడు ఈ పల్నాడునుంచే శిష్య సహస్రసమేతుడై సింహళదేశం వెళ్ళాడు. సింహళంనుంచి వచ్చిన పరివ్రాజకులకోసం, పరివ్రాజికలకోసంకూడా నాగార్జున కొండలో కొన్ని థేరవాదసంస్థలు ఉన్నాయి. దీన్నిబట్టి ఈ గ్రామాల విషయంలో మనం చేసిన ఊహ తథ్యం కావడానికి ఎక్కువ అవకాశాలు ఉన్నాయి. ఆంధ్ర - సింహళదేశాలలోని బౌద్ధమతంలో ఉన్న ఈ పరస్పర సంబంధాన్నిపట్టి చూస్తే బుద్ధఘోషుడు సింహళదేశంవెళ్లి అనూరాధపురంలో స్థిరపడిపోవడం సముచితంగానే కనబడుతుంది. అక్కడ జరిగే స్తూపప్రారంభోత్సవంలో పాల్గొనడానికే కదా, ఈతనికంటె చాలకాలం పూర్వం మహాదేవుడూ, ఆతని అనుయాయులూ ఆ దేశం వెళ్లినది? ఆనాడు మొదలు ఆంధ్ర సింహళ దేశాలమధ్య పరివ్రాజకుల గమనా గమనాలు అవిచ్ఛిన్నంగా జరుగుతూ ఉండి ఉండాలి.

బుద్ధఘోషుని గ్రంథాలలో చాలా ప్రధానమైనది విసుద్ధిమగ్గం (పవిత్రతా మార్గం). ఇది థేరవాదానికి సంబంధించిన విజ్ఞానసర్వస్వం. పాలిధర్మగ్రంథాల్లో ఉన్న బౌద్ధ ధర్మానికంతకీ సంబంధించిన ఆత్మతత్త్వశాస్త్రాన్నీ నైతిక నియమాలనూ, యోగమార్గాన్నీ బోధించే ప్రామాణిక సంగ్రహాత్మక గ్రంథం. ఇదే కాకుండగా, ఈతడు త్రిపిటక వ్యాఖ్యానాన్ని సింహళభాషలోనుంచి పాలీభాషలోకి అనువదించాడు. ఈ సింహలభాషాగ్రంథాలుకూడా మొదట పాలిభాషలోనే ఉండేవి. ఎందరో భారతీయభిక్షువులు వ్రాసిన గ్రంథాలు ఇవి. వీటిని మహేంద్రుడు సింహల భాషలోనికి అనువదించాడు. ఈ గ్రంథాల విషయంలో సంప్రదాయ సిద్ధంగా వస్తూన్న ఈ వృత్తాంతం చారిత్రకంగా సత్యమే కావచ్చును. బి. సి. లా బుద్ధఘోషవి తాత్త్విక విచారాన్ని గూర్చి ఇరవైమూడు పేజీలలో విశదీకరించి ఉన్నాడు.[63] సింహళదేశంలోని బౌద్ధమతం, ఇంచుమించు బుద్ధఘోషుడు ప్రతిపాదించిన రీతిలోనే ఉన్నదనీ, అంతకు పూర్వమే ఉన్న బౌద్ధజ్ఞానానికి ఈతని ద్వారా లభించిన ప్రత్యేకత ఏదో సరిగా నిర్ణయించి చెప్పడం కష్టమనీ, ఐతే ఈతని వ్యాఖ్యానాలద్వారా త్రిపిటకంలో ఉన్న అనేక సిద్ధాంతాలను ఒక నిశ్చిత రూపంలో స్పష్టంగా అర్థం చేసుకోవడానికి వీలు ఏర్పడిందనీ ఈయన అభిప్రాయ పడిఉన్నారు.[64] విశుద్ధిమగ్గంలో బుద్ధఘోషుడు తన అభిప్రాయంగా చెప్పిన ఘట్టం ఒక్కటే ఒక్కటి ఉన్నదనీ, ఆతని ఇతర గ్రంథాలన్నీ వ్యాఖ్యానాలు మాత్రమేననీ, అందులోనూ అనువాదాలు మాత్రమేననీ, విశుద్ధిమార్గ - అనువాదకుడూ, దీనిని గూర్చి బాగా తెలిసి ఉండవలసినవాడూ అయిన భిక్షున్యానమోలి చెప్పియున్నాడు. ఒక స్వీయమతం అనేది ప్రమాణాలన్నింటిలోకి దుర్బలమైన ప్రమాణమనీ, అది సుత్తాలకు అనుగుణంగా ఉన్నప్పుడు మాత్రమే ప్రమాణంగా గ్రహింపదగినది అవుతుందనీ బుద్ధఘోషుని విశ్వాసం.[65] సిద్ధాంతాన్నీ ఆచారాన్నీ కూడా ఒక నియమబద్ధరీతిలో ప్రతిపాదించి బౌద్ధమతానికి ఎనలేని సేవచేసిన మహా పండితుడు బుద్ధఘోషుడు.

## 8. ఆంధ్రదేశంలో బౌద్ధతంత్రాలు

పారమితానయమూ (పారమితామార్గము) మంత్రనయమూ[66] (మంత్ర మార్గము) అని మహాయానం రెండు విధాలు అని అద్వయవజ్రుడు (11 వ శతాబ్ది) వ్రాసియున్నాడు. పారమితాన్నయానికి మూలప్రమాణం ప్రజ్ఞాపారమితా సూత్రాలు.

మంత్రయానానికి, తంత్రయానము, వజ్రయానమూ అనికూడా నామాంతరాలు ఉన్నాయి. [67]తంత్రయానం కూడా పారమితాయానంతోసమానమైన ప్రామాణ్యంగల మహాయాన మార్గభేదమే అనే అద్వయవజ్రుని అభిప్రాయంతో చాలామంది మహాయాన సంప్రదాయజ్ఞులు ఏకీభవించరు. బుద్ధుడు ధర్మచక్రాన్ని మూడవ పర్యాయం ధాన్యకటకంలో ప్రవర్తింపచేసినట్లుగా టిబెట్ సంప్రదాయం చెపుతూన్నది. అనగా గృధ్రకూటంమీద పారమితానయంద్వారా ధర్మాన్ని బోధించినట్లే, ధాన్యకటకంలో మంత్రనయంద్వారా ధర్మాన్ని బోధించాడు[68] అని అభిప్రాయం. బుద్ధుడు దక్షిణదేశంవచ్చి ఆంధ్రదేశంలో ఒక విహారం సమీపంలో ఉన్న అశోకనగరంలో ధర్మాన్ని బోధించాడనీ, అసంఖ్యాకులైన జనులు ఈ ధర్మాన్ని అవలంబించారనీ హ్యూయన్‌త్సాంగ్‌కూడా వ్రాసి ఉన్నాడు. దీనికి చారిత్రకంగా ఆధారాలేవీ లేవుకాని, ధాన్యకటకం మహాయానానికి జన్మస్థానం అనే విషయాన్ని ఇది సూచిస్తూన్నది. ఇతర ప్రమాణాలుకూడా ఈ అంశాన్ని బలపరుస్తున్నాయి.

మహాసాంఘికులు ధారణీపిటకం సంకలనం చేశారు. ధారణి అనగా ''సత్యాన్ని కొన్ని బీజాక్షరరూపంలో నిగూఢంగా ఉంచిన మంత్రం" (కాన్జ్). ధాన్యకటకానికి "ధారణీకోట" (ధారణీమంత్రాల కోట) అనేపేరు ఉండేది. అదే మారి ఈనాడు ''ధరణికోట'' అయింది. బుద్ధుడు లోకోత్తరుడనీ, నిత్యుడనీ మహాసాంఘికులు కూడా స్పష్టంగా అంగీకరించారు. బుద్ధుని పూజావిధానానికి శైలులు ప్రోత్సాహం కల్పించారు. వైతుల్యకులు మైథునానికి కరుణతో ముడి పెట్టారు. ప్రాచీన మహాయాన సూత్రాల్లో (లంకావతారము, దశభూమిక, మొ) అనాభోగచర్యను (అప్రయత్నమైన జీవనవిధానం) గూర్చి చెప్పబడి ఉంది. వీటిలో ప్రయోగించిన 'ప్రజ్ఞ', 'ఉపాయ' మొదలైన పదాలు కాలాంతరంలో, తంత్ర గ్రంథాల్లో బహుళ ప్రచారాన్ని పొందాయి. అప్రయత్నజీవన విధానం అనగా, కామమునూ, ఇతరమానసిక ప్రవృత్తులనూ అణచిపెట్టుకొనవలసిన పని లేకుండగా గడిపే స్వాభావిక జీవనం. 'ప్రజ్ఞా' 'ఉపాయాల' కలయిక విడదీయరానిదిగా తంత్ర గ్రంథాల్లో చెప్పబడింది. 'సోలోమాన్' లో బుద్ధివైభవానికి ఒక మూర్తి కల్పన చేసినట్లుగా శూన్యతకు మూర్తికల్పనచేసి 'భగవతీ' అనే పేరుగల ఒక పుణ్య స్త్రీగా భావన చేయడం జరిగింది. ఆ పుణ్య స్త్రీయే "ప్రజ్ఞ". పురుష స్వరూపం కల్పించిన 'కరుణ' యే "ఉపాయము", శూన్యతా కరుణల అభేదమే

'బోధిచిత్తము' (అనగా 'జ్ఞాన-చిత్తము' లేదా 'జ్ఞానాభిముఖమైన చిత్తము') అని 'గుహ్యసమాజం' లో చెప్పబడి ఉంది. "శూన్యతాకరుణాభిన్నం బోధిచిత్తమితి స్మృతమ్". ఈ బోధిచిత్తం, శాశ్వతమూ, ప్రశాంతమూ, వర్ణనాతీతమూ అయిన ఒక తత్త్వంఅనీ, ఋణ-ధనాంశాల (Positive and negative) అనగా స్త్రీ పురుషుల కలయిక అనీ, తంత్రశాస్త్రగ్రంథాలలో వర్ణింపబడింది. నాగార్జునుడు మహామయూరీ విద్యోపాసన చేసినట్లు చెపుతారు. దేవలోక బుద్ధుడైన అమోఘసిద్ధి నుండి ఆవిర్భవించిన దేవత మహామయూరి. కుమార జీవునివంటి గొప్ప మాధ్యమిక సిద్ధాంతవేత్త "మహామయూరీ - విద్యారాజ్ఞీ"ని అనువదించాడు. ఒక మాధ్యమిక శాఖకు ప్రవర్తకుడైన భవ్యుడనే మరొక తత్త్వశాస్త్రవేత్త వజ్రపాణి అనే దేవునికి నివాసస్థానమైన ధాన్యకటకంలో చాలా సంవత్సరాలపాటు నివసించి తన కోరికలు సఫలం అవడంకోసమూ, కొన్ని సందేహాలు తీర్చుకోవడంకోసమూ, వజ్రపాణిధారణిని జపించాడు (హ్యూయన్‌త్సాంగ్). అమరావతిలోనూ, సాలిహుండంలోనూ కొన్ని తాంత్రిక శిల్పాలు లభించాయి. [ఉదా సింహనాద శిలా ప్రతిమ (తొమ్మిదవ శతాబ్దం). అమరావతిలోని (8 వ శతాబ్దం) మంజుశ్రీ - చుందాప్రతిమలు]. దీనిని పట్టి తెలిసేది ఏమనగా - తంత్రప్రారంభాన్ని మహాయానంనుంచి విడదీయడానికి వీలులేదు. బహుశా తంత్రాలకీ మహాయానానికీ కూడా జన్మస్థానం ఒకటే అయి ఉంటుంది. మహాయానం ఆవిర్భవించడానికి ప్రోద్బలకమైన కారణాలవల్లనే మంత్రయానంకూడా, ధాన్యకటక - శ్రీ పర్వత ప్రాంతాల్లో క్రీ. పూ. మొదటిశతాబ్దానికి పూర్వమే, ఆవిర్భవించింది [69]

శ్రీ పర్వతం - (నాగార్జునకొండ) మీద నివసించే బౌద్ధులు వజ్రయానానికి సంబంధించిన గ్రంథాలు రచించి ఉండడంచేత, ఈ పర్వతం, టిబెట్ - సింహళ దేశ గ్రంథాలలో వజ్రపర్వతంగా పేర్కొనబడింది వజ్రం అనగా అభేద్యమైన అద్వయతత్త్వం; పరిపూర్ణమూ, అవినాశ్యమూ అయిన తత్త్వం. 'సర్వతథాగతాధిష్ఠాన వ్యూహం' అనే తంత్రవిషయాలను కూడా బోధించే ఒక గ్రంథంలో, (ఐదవ లేదా ఆరవ శతాబ్ది) తంత్రయానాన్ని బుద్ధుడే పోతలక పర్వతంమీద బోధించినట్లుగా చెప్పబడి ఉంది. ఈ పోతలక పర్వతం హ్యూయన్‌త్సాంగ్ చెప్పిన పో-లో-మో-లో-కి-లి: ఫాహియాన్ చెప్పిన పారావతం, అనగా శ్రీ పర్వతం అయివుండాలి. శ్రీ పర్వతం తంత్రాలకీ, తంత్రసిద్ధులకీ స్థానంగా హిందూవాఙ్మయంలోనూ, బౌద్ధవాఙ్మయంలోనూ కూడా పేర్కొనబడింది.[70] మధ్య

కాలీన ప్రసిద్ధ బౌద్ధతాంత్రికులైన నరోపా మొదలైనవారు మంత్రయానం ధాన్య కటకంలోనే ఆవిర్భవించినది అనే సంప్రదాయాన్ని అంగీకరించారు. దీనిని అంతనీ పట్టిచూస్తే ధాన్యకటక - శ్రీ పర్వతప్రాంతం తంత్రాలకు జన్మభూమి అని నిశ్చయపూర్వకంగా చెప్పడానికి అవకాశం కనబడుతూన్నది.

'గుహ్యసమాజతంత్రమూ', "మంజుశ్రీమూలకల్పమూ" ఈ రెండూ అతి ప్రాచీన బౌద్ధ తంత్ర గ్రంథాలుగా పరిగణింపబడుతున్నాయి. మొదటిది క్రీ. శ. ఏడవ శతాబ్దంకంటె ప్రాచీనమైనది అనడానికి అవకాశం లేదు. రెండవది క్రీ. శ. 980-1000 ప్రాంతంలో చైనా భాషలోనికి అనువదింపబడింది. అందుచేత అది అంతకంటె పూర్వం, లాట (గుజరాత్) రాజైన శైలాదిత్యుని తరువాత, రచింపబడిఉంటుంది. (ఐతే ఈ పేరుగల లాట రాజులు 590-710 మధ్య ముగ్గురు ఉండేవారు.) మంజుశ్రీ మూలకల్పం ధాన్యకటకంలో రచింపబడి ఉంటుందని, రాహుల్ సాంకృత్యాయన, కొన్ని ఆంతరంగిక ప్రమాణాలను పట్టి నిర్ణయించారు. ఇది అక్కడ కాని, శ్రీ పర్వతంమీదగాని రచింపబడి ఉండవచ్చు. అచట ఉన్న చైత్యాలలో మారజిత్తు అయిన బుద్ధుని ధాతువులు నిక్షిప్తములై ఉండడంచేత, శ్రీ పర్వత ధాన్యకటక పర్వతాలమీద మంత్రసిద్ధి అచిరకాలంలో లభిస్తుందని ఈ గ్రంథంలో చెప్పబడింది ఈ గ్రంథంలో స్త్రీ పురుష సంగానికి సంబంధించిన నిగూఢరహస్యాలుకాని, నైతికనియమాల విషయంలో అనాదర భావంకానిలేవు. వాస్తవంలో ఇది మహాయాన-ప్రాచీన మంత్రయానాలు రెండింటికీ సంబంధించిన గ్రంథం. ఈ గ్రంథాలలో విషయంమాత్రం అతిప్రాచీనమైనది. ఈ గ్రంథాల రచనకు కొన్ని శతాబ్దాల పూర్వమే ఈ గ్రంథాల లోని విషయాలు ఒక నిశ్చిత రూపాన్ని దాల్చి ఉండాలి.

నిగూఢార్థ బౌద్ధ సూత్రాలలో కెలా అత్యధికంగా, 'కోంగోఛోక్యో' అనే పేరిట జపానుదేశంలో అధిక ప్రసిద్ధి పొందినది 'వజ్రశిఖరసూత్రం'. ప్రాచీన కాలంనుంచీ కూడా "దక్షిణదేశంలోని ఇనుప స్తంభం"గా ప్రసిద్ధి పొందిన స్తూపం ఉన్న ధాన్యకటకంలోనే, ఈ సూత్రం క్రీ. శ. ఏడవ శతాబ్దంలో రచింపబడినదని ర్యోటై హదానీ నిశ్చయపూర్వకంగా చెపుతున్నాడు. ఈ, గ్రంథంలో చాలా నిగూఢార్థాలైన ఉపాసనాదులు చెప్పబడి ఉన్నాయనీ, వీటి ఆచరణచేత మానసికంగా, సాక్షాత్తూ బుద్ధస్థితి లభిస్తుందనీ కూడా హదానీ అభిప్రాయం. ఈ

చిత్తశరీరాలలో ఉండగానే ఐదు సమాధిస్థితులద్వారా వాస్తవమైన బుద్ధత్వం లభించే మార్గాలు ఈ గ్రంథంలో ప్రతిపాదింపబడి ఉన్నాయని అతడు చెప్పు చున్నాడు. తాను ఏ బుద్ధుని సేవించుచున్నాడో ఆ బుద్ధుడుగా అవడమే దీని లక్ష్యం.[71] ఇది టిబెట్టులో కూడా తంత్రగ్రంథం.

మంత్ర (వజ్ర) యానం అతి జటిలమూ, వివాదాస్పదమూ, గంభీరమూ అయిన విషయం. దీని సాధారణ స్వరూప నిరూపణం ఇక్కడా అంతగా ప్రస్తుతం కాదు. నేను మంజుశ్రీ మూలకల్పం విషయసూచికనైనా చూడగలిగినాను కాని, వజ్రశిఖరం పుస్తకంకూడా చూడలేదు. వాటినిగూర్చి విమర్శనాత్మకములూ, వివేచ నాత్మకములూ అయిన గ్రంథాలేవీ వెలువడలేదు. అందుచేత, ఈ గ్రంథాలు మంత్ర యానానికి ఆంధ్రులు అందించిన విశిష్ట విషయముఅని చెప్పడంతో మాత్రమే ప్రస్తుతానికి సంతృప్తి పడుతున్నాను.

తెలుగు మాటలాడే జనులు శతాబ్దాలతిరబడి బౌద్ధమతానికి చేసిన అద్భుతసేవను గూర్చి ఈ ఉపన్యాసంలో కొంతవరకూ సూచించ కలిగి నానని అనుకుంటున్నాను బౌద్ధశిల్పాలకు, కళలకూ తెలుగువారు చేసిన సేవకూడా దీనికి తీసిపోదు. వాటినిగూర్చి ఎవరైనా పండితునిచేత ఉపన్యాసం ఇప్పించడం అవసరం. ఆంధ్రులు, అనగా తెలుగుమాటలాడే దేశంలో పుట్టిన వారూ, ఎక్కడనో మరోకచోట పుట్టినా ఇక్కడకువచ్చి ఆ జీవితాంతం పనిచేసిన వారూకూడా కాలక్రమంలో అతి విస్తృతమైన వివిధ రూపాల్లో వికసింపనున్న సిద్ధాంతాలకు బీజాలు నాటడమూ, (అంధకులూ, శైలులూ, వేతుల్యకులు),థేరవాదా నికి రూపుదిద్దడమూ (బుద్ధఘోషుడు), మహాయాన సిద్ధాంతానికి బీజావాపంచేసి (ప్రజ్ఞాపారమితా, రత్నకూట - సుఖావతీ సూత్రాలు) దాన్ని వృద్ధి పొందించడమూ (నాగార్జునుడు, ఆర్యదేవుడు, భవ్యుడు), బౌద్ధన్యాయాన్నీ, న్యాయబద్ధమైన తత్త్వశాస్త్రాన్నీ వృద్ధి పొందిచడమూ (దిఙ్నాగుడు, ధర్మకీర్తి), మంత్ర యానాన్ని అవిర్భవింపచేయడమూ వంటి ఘనకార్యాలు చేయడం చూస్తే చాలా ఆశ్చర్యం కలుగుతుంది, దాని తరవాత, అలాంటి ఉత్తమమైన స్వతంత్ర తాత్త్విక-ధార్మిక-ఆలోచనాశక్తి ఈ జనులలో పూర్తిగా కుంటుపడిపోవడం చూస్తే ఇంకా ఆశ్చర్యం కలుగుతుంది. హిందూవిచారధారకు సంబంధించినంతవరకు వీరు నేటి వరకూకూడా, అలాంటి గంభీరములూ, క్రాంతికరములూ అయిన విషయాలను కనుగొనలేకపోవడం కూడా విస్మయజనకమే.

# టిప్పణి

1. "స్వస్తి", "ఎవనిచేత మోక్షప్రాప్తికై వెంటనే మార్గము చూపబడినదో అట్టి సమ్యగ్ జ్ఞానవంతుడూ, దయామయుడూ ఐన భగవానుడు సర్వోత్కర్షతో ఉన్నాడు". విష్ణుకుండిన వంశరాజైన ఇంద్రవర్మ పౌత్రుడు, మాధవవర్మ కుమారుడు, అయిన గోవిందవర్మ వ్రాయించిన ఇంద్రపాల నగర తామ్రశాసనం. ఇంద్రపాలనగరం నల్లగొండ జిల్లాలోని, రామన్నపేట తాలూకా, తుమ్మలగూడెం గ్రామందగ్గర మూసీనదీతీరం మీద ఉంది. పోల్చి, చూ. 'జితంతే' ఇత్యాది హిందూస్తోత్రం.

2. ఆరవ శతాబ్దంలో సింహవర్మ పల్లవుడు అమరావతీ స్తూపానికి ఒక బుద్ధప్రతిమను బహూకరించి ధాన్యకటకంలో, ఒక ఏకాంత ప్రదేశంలో ధర్మోపదేశం విన్నాడు (దక్షిణదేశ శాసనాలు. I.P. 25. E.f.)

3. క్రీ. శ. 1182 ప్రాంతానికి చెందిన అబ్బూరు, అమరావతి, బెక్కల్లు శాసనాలలో, బుద్ధుని కొరకై దానాలు చేసినట్లూ, దేవాలయాలు కట్టించినట్లు చెప్పబడి ఉంది. వీటిలో కొన్ని విష్ణ్వవతారమైన బుద్ధునికోసం చెయబడినవి. మహాయానానికి సంబంధించిన తొమ్మిది ప్రామాణిక ప్రాచీన గ్రంథాలలో (నవధర్మాలు) ఒకటైన లలిత విస్తరం ఆ బుద్ధుణ్ణి గూర్చి, నారాయణుడనీ, మహానారాయణుడనీ, నారాయణస్థామవాన్ (నారాయణుని శక్తి, సారమూ కలవాడు) అనీ వర్ణించినపుడు, అతడు విష్ణ్వవతారం కాదని ఎవరు అనగలరు? ఈ లలితవిస్తరం కనిష్కుని కాలానికి చెందినది అని కొందరు పండితుల అభిప్రాయం. మహబూబ్‌నగర్ జిల్లా ఆలంపూర్‌లోని ఒక సూర్యదేవాలయం (బహుశా క్రీ. శ. పదవశతాబ్దం నాటిది) అంతఃపటలంలో విష్ణ్వవతారాలు చెక్కిన ఒక చతురశ్ర ఫలకం మీద బుద్ధునికి మధ్యస్థానం ఇచ్చి, ఇతర అవతారాల బొమ్మలకంటె బుద్ధుని బొమ్మ పెద్దదిగా చూపబడింది. శంకరుని ప్రాచార్యుడైన గౌడపాదుడు, తన కారికలలో సంబుద్ధునికి, మానవోత్తమునికి, నమస్కారం చేయలేదా ?

4. కె. ఆర్. సుబ్రహ్మణ్యం వ్రాసిన "బుద్ధిస్ట్ రిమైన్స్ ఇన్ ఆంధ్ర అండ్ ది హిస్టరీ ఆఫ్ ఆంధ్ర (225 టు 610. ఎ.డి") ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 1932. P. 29. బి. యస్. యల్. హనుమంతరావు వ్రాసిన "రెలిజియన్ ఇన్ ఆంధ్ర" బుక్. II. (గుంటూర్ 1978). అనే గ్రంథం అతిప్రాచీన కాలంనుంచి క్రీ. శ. 1325 వరకూ ఆంధ్రదేశంలోని బౌద్ధమతాన్ని గూర్చి చాల చక్కగా వ్రాసిన ఉత్తమగ్రంథం.

5. పైన చూపిన సుబ్రహ్మణ్యం వ్రాసిన గ్రంథానికి మున్నుడి. పే. x.

6. అతని అనువాదానికి మున్నుడి. 'సుత్తనిపాతం'లో (సుత్తపిటకంభాగమైన కుద్దకనికాయం) త్రిపిటకానికి సంబంధించిన అతి ప్రాచీన విషయాలు ఉన్నట్లు చాలామంది ఏకగ్రీవంగా అంగీకరించారు. ఇది వినయంలోనూ, నికాయాల్లోనూ, అశోకశాసనాల్లోనూ ఉదాహరించబడింది. దీని వ్యాఖ్యానం (నిర్దేశం) మత గ్రంథాలలో చేర్చబడింది. ఫాబోల్ (Fauboll) (సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్. x వాల్యూమ్), లార్డ్ ఛాల్మెర్స్ (హార్వార్డ్ ఓరియంటల్ సీరీస్. 37 వ వాల్యూమ్) యి. యమ్. హేర్. ( ఆక్స్‌ఫోర్డ్ 1944 ) సుత్తపిటకాంతర్గతం ఐన ఈ గ్రంథాన్ని అనువదించారు.

7. హిందూమతవాఙ్మయం ప్రకారమూ, జాతకాల ప్రకారమూ, సుత్తనిపాత వ్యాఖ్యానం ప్రకారమూ ఇవి ఆంధ్రదేశంలోని జనపదాలు. వీటిని ఆంధ్ర రాజులు పరిపాలించినట్లుగా వాయు - గరుడ పురాణాల్లోనూ, పరమార్థ జోతకలోనూ చెప్పబడింది. నాందేడ్ - నిజామాబాద్ ప్రాంతమూ, దీని పరిసరాలూ కలిసి అశ్మక దేశం. పౌండన్యం (తెలంగాణాలోని నిజామాబాదుజిల్లాలో ఉన్న నేటి బోధన్) దీని రాజధాని. ఔరంగాబాదు జిల్లాలోని పైథాన్ ప్రాంతం ములకదేశం. అశ్మక-ములకదేశం విదర్భ కలింగ-అపరాంతాల (కోంకణ) వరకూ వ్యాపించింది. నేటి ఆంధ్ర ప్రదేశ్‌లోని ఉత్తరప్రాంతంలోని జిల్లాలు, ఔరంగాబాదు జిల్లాలోని కొన్ని ప్రాంతాలు, దక్షిణబీరార్ ఈ దేశంలో చేరినవి.

8. ఇదికూడా సుత్తపిటకంలోని కుద్దకనికాయంలో ఒకభాగం. కాని ఇది అర్వాచీనం.

9. మజేరు, పాతమజేరు అనేవి కృష్ణాజిల్లా దివితాలూకాలో ఉన్న రెండు పురాతన ప్రదేశాలు. పైన ఉదాహరించిన సుబ్రహ్మణ్యం రచించిన గ్రంథంలో 3 వ పేజీలోని ఐదవ నోట్‌ను, 10 వ పేజీలోని మొదటి నోట్‌ను చూడుడు.

10. "మంజుశ్రీ మూలకల్పము". శాసనాలు.

11. ఇది సి. శివరామమూర్తి మొదలైనవారి అభిప్రాయం.

12. శాసనాలూ, వాటిలోని విషయాలూ-వీటి వివరాలకు చూ. పైన ఉదాహరించిన హనుమంతరావు రచించిన గ్రంథం.

13. గోవింద చంద్రపాండేయుని ''బుద్ధధర్మకే వికాస్‌కా ఇతిహాస్", లక్నో; 1963. నలినాక్ష దత్తు రచించిన "బుద్ధిస్ట్ సెక్ట్స్ ఇన్ ఇండియా", కలకత్తా 1970. యమ్. హోఫిన్గర్ వైశాలిలో జరిగిన మహాసభను గూర్చి, ఏ. బరో హీనయాన బౌద్ధశాఖలను గూర్చి ప్రామాణికములూ అనేక నూతన రహస్యోద్ఘాటకములూ అయిన గ్రంథాలు వ్రాశారు.

14. దత్ పూర్వోదాహృతము. పే. 54. నోట్. 1.

15 కథావత్థు, దాని వ్యాఖ్యానము.

16. శ్రీమతి సి. ఏ. ఎఫ్. రేస్ డేవిడ్స్ వ్రాసిన ''కథావత్థు: పాయింట్స్ ఆఫ్ కాంట్రావర్సీ'' కి అనువాదము. నేను ప్రధానంగా, దత్తు రచించిన పూర్వోదాహృతగ్రంథం నుంచీ (ఆరవ అధ్యాయం), పాండే రచించిన పూర్వోదాహృతగ్రంథంనుంచీ (పేజీలు 292-8) విషయం సేకరించాను.

17. కే. యమ్. సంపాదించిన ''దిపాత్ ఆఫ్ బుద్ధిజమ్" లో, న్యూయార్క్, 1956, పే. 160, ఆయన వ్రాసిన పేపరు.

18. ఇ. కాంజ్ రచించిన "ది ప్రజ్ఞాపారమితా లిటరేచర్" ది హేక్. 1960, P. 9.

19. "సద్ధర్మ పుండరీకమ్'', ఇదికూడా క్రీ. పూ. ప్రథమశతాబ్దంలో రచించిన గ్రంథం. ''గృధ్రకూటే యథా శాస్తాః ప్రజ్ఞాపారమితానయమ్.

సర్వేశ్యబోధి సత్త్వానాం మహాయానం నిరుత్తరమ్'', అని మూలతంత్ర ములోకూడ చెప్పబడినది. అది 'శేకోద్దేశటీక' లో (పేజీలు 2-4) ఉదాహరించబడింది.

20. 'లంకావతారము'. ఇదికూడా ప్రాచీన మహాయానగ్రంథమే.

21. ''దక్షిణాపథే ప్రచరిష్యన్తి, దక్షిణాపథాత్ పునరేవ వర్తన్యాం ప్రచరిష్యన్తి వర్తన్యాః పునరుత్తరాపథే ప్రచరిష్యన్తి'' ''అష్టసాహసికా'', దర్భంగా, 1960. పే. 112.

22. గండవ్యూహము.

23. కే. సచ్చిదానందమూర్తి రచించిన ''నాగార్జున'' (ద్వితీయప్రచురణ), నేషనల్ బుక్‌ట్రస్ట్, న్యూఢిల్లీ, 1978 పేజీలు 52-3.

24. ప్రామాణిక గ్రంథ రచయితలైన ఎడ్వర్డ్ కాంజ్, రాహుల్ సాంకృత్యాయన, నలినాక్షదత్, భిక్షు సంఘరక్షిత, జగన్నాథ ఉపాధ్యాయ, గోవింద చంద్రపాండేయ, లాల్ మనిజోషీ మొదలైనవారు ప్రజ్ఞా పారమితా - మహాయానాలు ఆవిర్భవించిన దేశం ఆంధ్రదేశమే అని ప్రతిపాదించి ఉన్నారు. ఈ విషయంలో విశేషంగా కృషిచేసిన జపానుదేశపండితుల అభిప్రాయం కూడా ఇదే. ఇది మహాయాన సంప్రదాయానికి అనుగుణంగానే ఉంది.

25. 'బౌద్ధసాధనా కా వికాస్' అనే గ్రంథంలోని జగన్నాథ ఉపాధ్యాయ వ్రాసినపేపరు చూడుడు. వారణసేయ సంస్కృత విశ్వవిద్యాలయ; వారణాసీ, 1971, పే. 24. కాంజ్ : పైన ఉదాహరించిన గ్రంథం. పే. 11-12.

26. "ది ఫిలాసఫీ అండ్ రెలిజియన్ ఆఫ్ ప్రజ్ఞాపారమితా" అనే వ్యాసంలో డి. టి. సుజుకీ (Suzuki) ప్రజ్ఞాపారమితను గూర్చిన సంక్షిప్తవర్ణనమును చాల చక్కగా ఇచ్చి ఉన్నాడు. ఇది అతని "ఎస్సేన్స్ ఇన్ జెన్ బుద్ధిజమ్" అనే గ్రంథంలో తృతీయ శ్రేణిలో(Third series) ఇవ్వబడినది. లండన్, 1958. పేజీలు-234-78, 288-319. ఇదే డి. టి. సుజుంకీ

వ్రాసిన (ఇ. కాంజ్ సంపాదించిన) ''ఆన్ ఇండియన్ మహాయాన బుద్ధిజమ్" అనే గ్రంథంలో మొదటి అధ్యాయంగా చేర్చబడింది. న్యూయార్క్. 1968 పేజీలు 31-99. బౌద్ధమతవివరణం విషయంలో సుజుకీని, ఈ వాఙ్మయాన్ని చాలావరకూ అనువదించిన కాంజ్‌నూ అనుసరిస్తున్నాను. సుజుకీ ప్రధానంగా 'అష్టసాహస్రికను' అనుస రిస్తాడు. దీనిని కాంజ్ అనువదించి ఉన్నాడు. (ఏసియాటిక్ సొసైటీ కలకత్తా, 1958).

27. కాంజ్ పూర్వోదాహృతగ్రంథము. పే. 15. ఆతను తాను చేసిన బృహత్ప్రజ్ఞాపారమితా సూత్రానువాద ప్రస్తావనలో ఈ సంక్షిప్త రచనను మళ్లీ వ్రాసి ఉన్నాడు.

28. "యదాత్మ నైరాత్మ్యయోర్మధ్యం తదరూప్యమనిర్దేశ్యం -- ఇయ ముచ్యతే, కాశ్యప; మధ్యమ ప్రతిపద్ధర్మాణాం భూతప్రత్యవేక్షా'', ''కాశ్యప పరివర్తము". సంపాదకుడు బారన్ ఏ. వాన్ స్టీల్-హోల్ స్టీన్. షంఘై. 1926, పేజీ. 87.

29. డి. టి. సుజుకీ; స్టడీస్ ఇన్ ది లంకావతార సూత్ర, లండన్, 1957, పేజీ. 285

30. వ్యాఖ్యానాలమీదకాని, మహాయానశాస్త్రాలమీద కాని ఆధారపడకుండా మహాయాన సూత్రాల ప్రతిపాద్య విషయాన్ని తెలుసుకోవడం కొరకై నేను కొన్ని సంవత్సరాలుగా వాటి అధ్యయనం చేస్తున్నాను. ఏ భాష్యాలమీదా ఆధారపడకుండగా, ఐతిహాసికంగానూ, విమర్శనాపూర్వ కంగానూ, విషయైకదృష్టితోనూ ఉపనిషదధ్యయనం చేయడానికి అవ కాశం ఉన్నప్పుడు మహాయాన మూలగ్రంథాలనుకూడా ఆ విధంగానే అధ్యయనం చేయవచ్చు.

31. కాంజ్ పూర్వోదాహృతగ్రంథం. పే. 9.

32. 121 వపద్యం. హీన్రిచ్ వెంజెల్ అనువాదం టిబెట్ భాషలోని "జర్నల్ ఆఫ్ ది పాలి టెక్స్ట్ సొసైటీ'' నుంచి గ్రహింపబడినది. లండన్ 1886.

33. అమితాభ సూత్రాల అనువాదాలు మాక్స్‌ముల్లర్ సంపాదించిన "సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్" గ్రంథశ్రేణిలో ఉన్నాయి. చైనాభాషలో ఉన్న ''సుఖావతీ వ్యూహ" సూత్రానువాదాన్ని ఆధారంగా చేసుకొని డి. టి. సుజుకీ వ్రాసిన ''ఆన్ ది ఇండియన్ మహాయాన బుద్ధిజమ్" అనే గ్రంథంలోని ''ది బుద్ధిజమ్ ఆఫ్ ఫైత్ ఇన్ ఇండియా" (పేజీ. 129-146) అనే దానిని ఆధారంగా తీసుకొని నేను పై విషయాలు చెప్పి ఉన్నాను.

34. "ది జర్నల్ ఆఫ్ ఇంటర్ కల్చురల్ స్టడీస్'' లోని (నం. 4.1977, KUFS పబ్లికేషన్స్, జపాన్) "ఏసర్వే ఆఫ్ మహాయాన బుద్ధిజం". పార్ట్ II. పే. 77 ff.

35. పైన 23 చూడుడు.

36. మోర్గన్‌లో సుకమోటో వ్రాసిన వ్యాసం; పూర్వోదాహృతం. పే. 196.

37. షిన్షో వ్రాసిన ''ది జపానీస్ మైండ్" (సి. ఏ. మూర్ సంపాదించినది). హోనోలులు; 1967, పే. 45. యన్ 7.

38. హిందూయిజం అండ్ బుద్ధిజం, లండన్; 1962, వాల్యూమ్. I పే. xxxii.

39. సర్ ఛార్లెస్ ఇలియట్, పూర్వోదాహృతం. వాల్యూమ్ III. పే. 219.

40. ''మూల మాధ్యమకారికా''.

41. ''సంయుత్తనికాయ" iv, 329; v, 420.

42. పైన ఇచ్చిన 28 చూడుడు.

43. ''మజ్ఝిమనికాయంలోని ''చులసున్నత" సుత్తము, ''మహాసున్నత'' సుత్తము.

44. హెచ్. ఆర్. రంగస్వామి అయ్యంగార్ చేసిన ''ది ఏకశ్లోక శాస్త్ర ఆఫ్ నాగార్జున బోధిసత్త్వ"; ''ది హాఫ్ ఇయర్లీ జర్నల్ ఆఫ్ ది మైసూర్

యూనివర్సిటీ'' వాల్యూమ్ I, 1927, నం 2; పే. 158 ff. అంతకు పూర్వం జి. తుచ్చి పర్యవేక్షణలో, ఛార్లెస్ ఎడ్కిన్స్, "చైనీస్ బుద్ధిజం'' అనే తన గ్రంథంలో దీని అనువాదం చేసి ఉన్నాడు. (లండన్ 1879, పే. 303-309) కాని ఆ అనువాదం అంతస్పష్టంగా లేదు.

45. జె. ఉపాధ్యాయ :- సంధోంగ్‌లో "నాగార్జున కీ నీతి మీమాంసా''. రింపోచే సంపాదించిన ''మాధ్యమిక డైలెక్టిక్ అండ్ ది ఫిలాసఫీ ఆఫ్ నాగార్జున" సారనాథ్, 1977. హెచ్. నాకమురా; పూర్వోదాహృత గ్రంథం. పే. 133-135. కె. సచ్చిదానందమూర్తి :- పూర్వోదాహృత గ్రంథం. పే.82-3. 87 ff.

46. డబ్ల్యు. వై. ఎవాన్స్ - వెంట్జ్, ''ది టిబెటన్ బుక్ ఆఫ్ గ్రేట్ లిబరేషన్'' పే. 113, 156-7.

47. కుమారజీవుడు వ్రాసిన ఆర్యదేవచరిత్ర, చూ. వింటర్ నెట్‌జ్ వ్రాసిన "ఏ హిస్టరీ ఆఫ్ ఇండియన్ లిటరేచర్'' వాల్యూమ్ II కలకత్తా, 1933, పే. 349-50. వై. సోగెన్ వ్రాసిన "సిస్టమ్స్ ఆఫ్ బుద్ధిస్ట్ థాట్'' పే. 187. ff.

48. కే. ఏ. యన్. శాస్త్రి, జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రిసర్చ్'', మద్రాస్ ix. 13 పే. 96. ff.

49. థామస్ వాట్టర్స్ : "ఆన్ యువాన్ చువాన్‌గ్స్ ట్రావెల్స్ ఇన్ ఇండియా'' వాల్యూమ్ II, లండన్, 1905, పే. 215.

50. నాకముర రచించిన పూర్వోదాహృత గ్రంథం. పే. 128. భవ్య మతం విషయంలో నాకమురను ప్రమాణంగా తీసుకొని వ్రాశాను.

51. పూర్వోదాహృతమైన వింటర్‌నెట్‌జ్ వ్రాసిన గ్రంథంలో, చెర్‌బట్‌స్కీ- (Stcherbasky) ప్రమాణంగా చూపబడినాడు పే. 363 N. 1

52. వింటర్‌నెట్‌జ్ : పూర్వోదాహృతగ్రంథం.

53. Th. చెర్‌బట్‌స్కీ : ''బుద్ధిస్ట్‌లాజిక్'', వాల్యూమ్ I లెనిన్‌గ్రాడ్. 1930-2; పే. 461. 147 వ పేజికూడా చూడుడు.

54. దిఙ్నాగుడు :- "ప్రజ్ఞాపారమితా పిండార్థము" ప్రారంభంలోని పంక్తి.

55. "స్టడీస్ ఇన్ బుద్ధిస్టిక్ కల్చర్ ఆఫ్ ఇండియా" లో (ఢిల్లీ, 1977, పే. 147) యల్. జోషిచే ఉదాహృతము.

56. జోషిచే ఉదాహృతము. పూర్వోక్తగ్రంథము. పే. 193.

57. చెర్బట్‌స్కీచే ఉదాహృతము. పూర్వోదాహృతగ్రంథము. పే. 839.

58. క్రింది విషయమునకై చూ. శాంతరక్షితుని "తత్త్వ సంగ్రహము". జి. ఝా. చేసిన అనువాదము. 3627, 3322, 3335, 3336 పద్యాలు.

59. "ప్రమాణవార్తికము", "స్వవృత్తి" I. 342. "వేదప్రామాణ్యం కస్యచిత్ కర్తృవాదః స్నానేధర్మేచ్ఛా జాతివాదావలేపః. సన్తాపారమ్భః పాపహానాయచేతి ధ్వస్తప్రజ్ఞానాం పఞ్చ లిఙ్గాని జాడ్యే".

60. సుకుమారదత్ రచించిన "బుద్ధిస్ట్ మాంక్స్ అండ్ మొనాస్టరీస్ ఆఫ్ ఇండియా: లండన్, 1962. పే. 252-9.

61. డి. కోశాంబి "విశుద్ధిమాగ్గకు" కు వ్రాసిన మున్నుడి. హార్వర్డ్ ఓరియంటల్ సీరీస్, వాల్యూమ్. 41.

62. "జర్నల్ ఆఫ్ ఓరియంటల్ రిసర్చ్" లో (మద్రాసు xix, iv భాగం, 1952) ఆర్. సుబ్రమనియమ్ మరియు యస్. పి. నైనార్ వ్రాసిన బుద్ధఘోష - హిజ్ ప్లేస్ ఆఫ్ బర్త్".

63. బి. సి. లా : "ది లైఫ్ అండ్ వర్క్ ఆఫ్ బుద్ధఘోష". కలకత్తా. 1923. పే. 135-157.

64. పూర్వోక్తము. పే. 157.

65. భిక్షు న్యానమోలి (అనువాదము). "ది పాత్ ఆఫ్ ప్యూరిఫికేషన్ బై బుద్ధఘోష". కొలంబో, 1964. భూమిక, పే. xix.

66. ''తత్త్వరత్నావళి", మహాయానం ద్వివిధం పారమితానయో మన్త్రనయశ్చేతి''.

67. 'మంత్ర' 'తంత్ర' 'వజ్రయాన' పదాలు పర్యాయ పదాలు, "బౌద్ధసాధనా కా వికాస్" (వారణాసి, 1971, పే. 40) లో భిక్షు సెంపా దోర్జీ వ్రాసిన ''బౌద్ధతాంత్రికసాధనా" అను వ్యాసము చూడుడు.

68. "మూలతంత్రము''; ''గృధ్రకూటే యథాశాస్త్రా ప్రజ్ఞాపారమితానయే, తథా మన్త్రనయే ప్రోక్తా శ్రీధాన్యే ధర్మదేశనా''.

69. నేను వ్రాసిన 'నాగార్జున' అనే గ్రంథంలో మొదటిభాగం, నాల్గవ అధ్యాయంలోని ''నాగార్జున అండ్ తంత్ర" అనే దాన్ని చూడుడు. దోర్జే వ్రాసిన వ్యాసంకూడా చూడుడు.

70. ర్యోటైహదానీ : ''యాన్ ఇంట్రడక్షన్ టు మహాయానసూత్రాస్'' (కోషో యమమోటో అనువాదం), యుబె, 1971, పే 84.

# జానపద విజ్ఞానము - తెలుగు సంస్కృతి

ఆచార్య బి. రామరాజు

(హైదరాబాదులో ఏర్పాటు చేసిన
శ్రీ సురవరం ప్రతాపరెడ్డి స్మారకోపన్యాస పాఠం)



అంతర్జాతీయ
తెలుగు సంస్థ
హైదరాబాదు - 500 027.

# జానపద విజ్ఞానము-తెలుగుసంస్కృతి

అంతర్జాతీయ తెలుగు సంస్థవారు ఈసారి సురవరం ప్రతాపరెడ్డిగారిస్మారకోపన్యాసం ఏర్పాటు చేయటం రెడ్డిగారి దేశికత్వం అనుభవించిన నాకు సంతోషం కలిగించే విషయం తెలంగాణా వైతాళికులలో ప్రతాపరెడ్డిగారు ప్రథమశ్రేణికి చెందినవారు. నిజాం రాచరికంలో అణగారి పడియున్న తెలుగువారిని మేల్కొల్పి వారిలో సాంస్కృతిక రాజకీయ చైతన్యపు టూపిరులు పోసి, దేశాభిమానము భాషాభిమానము నింపి, తమ అపూర్వ వారసత్వాన్ని ప్రాచీన వైభవాన్ని గుర్తింపజేసి, తమ శక్తియుక్తులు కూడగట్టుకొని కర్తవ్యపరాయణులై ముందడుగువేసే విధంగా తీర్చిదిద్దిన కొద్దిమంది ప్రథమశ్రేణి నాయకులలో ప్రతాపరెడ్డిగారొకరు రెడ్డిగారు ఆంధ్రోద్యమ నిర్వాహకులు, బహుభాషా కోవిదులు, పండిత పరిశోధకులు, పత్రికారచయిత, సామాజిక శాస్త్రవేత్త,సంఘసంస్కర్త. వారు సంపాదకత్వం వహించిన గోలకొండ పత్రిక నాటి తెలంగాణా ప్రజావాణి. వారు ప్రథమాధ్యక్షులుగా సారథ్యం చేసిన ఆంధ్రమహాసభ తెలంగాణా రాజకీయోద్యమాలకు మాతృసంస్థ. వారు రచించిన ఆంధ్రుల సాంఘిక చరిత్ర ఆకోవకు చెందిన తెలుగు కృతుల్లో మొదటిది. రెడ్డిగారు పాత్రికేయులైనా, పండిత పరిశోధకులైనా, గ్రంథాలయోద్యమ నిర్వాహకులైనా, కథాకారులైనా, కవులైనా, విమర్శకులైనా, వారి ప్రధాన ధ్యేయం సామాజిక ప్రయోజనము, విశ్వశ్రేయము. వట్టి ఆత్మానందంకోసం వారెట్టి సారస్వతకృషి చేయలేదు. సొంతలాభం కోసం ఏపదవీ అలంకరించలేదు. వారు ఏబాధ్యత వహించినా, ఏపదవిలో ఉన్నా, ఏపని చేసినా అది తెలుగు సమాజానికి ఉపయోగపడవలెననే కాంక్ష, తపన ఉండేది. సమాజశ్రేయస్సే వారికి కావలసినది. ఆదృష్టితోనే రెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర వ్రాసినారు అది తరతరాలుగా ఆంధ్రులు వైయక్తికంగాను సాంఘికంగాను పొందిన అభ్యుదయపతనాలకు అద్దంపట్టే చరిత్ర. చాళుక్యుల కాలంనుండి ఆధునిక యుగందాక తెలుగువారి రాజకీయ, ఆర్థిక,

సామాజిక, సాంస్కృతిక జీవితం రెడ్డిగారు తమ సాంఘికచరిత్రలో చిత్రించి నారు. అందులో మన వర్ణాశ్రమాచార ధర్మములు, వృత్తులు, కళలు, యుద్ధ తంత్రాలు, బుద్ధివైభవాలు, వేడుకలు వినోదములు, పండుగలు పబ్బాలు, ఆటలు పాటలు, ఆచార వ్యవహారాలు, కట్టుబొట్టు జుట్టు, ఆభరణములు అలంకారాలు, సరసాలు విరసాలు, త్యాగాలు భోగాలు, కయ్యాలు వియ్యాలు, విశ్వాసాలు ఆహారవిహారాలు-ఈవిధంగా హైందవ జీవనవిధానానికి పరమోపాదేయములైన చతుర్విధపురుషార్థముల సాధనలో ఉపకరించే సమస్త విషయములను రెడ్డిగారు స్పృశించినారు. ఈరచనలో రెడ్డిగారికి అధికంగా తోడ్పడినది శిష్టవాఙ్మయం. రెడ్డిగారి ప్రేరణతో ప్రోత్సాహంతో జానపదసాహిత్యపరిశోధనకు పూనుకొన్న నేను, ఈ చతుర్విధపురుషార్థసాధనలో వైయక్తికంగాను, సామాజికంగాను, సాగిన సాంఘిక జీవనం, సంతరించుకున్న సంస్కృతి, తెలుగు జానపద విజ్ఞానంలో ఏవిధంగా ప్రతిబింబిస్తున్నదో స్థాలీపులాకంగా ప్రదర్శించటం సముచితంగా ఉంటుందని భావిస్తున్నాను

జానపద విజ్ఞానం మనజాతీయ విజ్ఞానం. మన చరిత్ర సంస్కృతి మన జయాపజయాలు, మంచిచెడ్డలు, మనజాతి పుట్టిన నాటినుండి ఈనాటి వరకు మనం సాధించిన సమస్తం ఈ విజ్ఞానంలో ప్రతిబింబిస్తవి. ఒక జాతి ఆటవికదశలో ఉన్నా, అత్యున్నత నాగరకతా శిఖరాలు అధిరోహించినా ఆజాతి జీవనాడిని పట్టిచూపేది జానపద విజ్ఞానమే. భారతదేశం లోని వివిధ ప్రాంతాల వారు, వివిధభాషలవారు, వివిధధర్మాలవారు, సగర్వంగా చెప్పుకొనే భారతీయ ఏకాత్మకత ఈ జానపద విజ్ఞానంలో పూసలలో దారంవలె అంతర్లీనంగా కానవస్తుంది.

## మన జానపద విజ్ఞానం నాలుగు చందాలు :

1. మౌఖిక వాఙ్మయం-అనగా ముఖోద్గతంగా వచ్చేమాట పాట పలుకు అన్నమాట ఇందులో తీరుతీరు కథాగేయాలు, కథావిరహితమైన జానపద గేయాలు, గద్యరూపంలో ఉండే తీరుతీరు కథలు, సామెతలు. పొడుపులు, మాండలికాలు, యాసలు, నుడికారాలు, తిట్లు దీవెనలు ఒట్లు చేరుతవి. ఇంకా కూనిరాగాలు, గొణుగుటలు, సణుగుటలు, ఆశ్చర్యార్థకాలు, సంబోధనలు మెచ్చు కోళ్లు, పిలుపులు, మచ్చిక కూతలు, అరపులు, కేకలు, సంజ్ఞలు, ఉచ్చాటనలు, ఏడ్పులు, శోకాలాపాలు మొదలైనవన్ని ముఖోద్గతమయ్యేవే.

2. వస్తు సంస్కృతి - అనగా భౌతిక జీవితానికి సంబంధించిన ఆయా వృత్తులు, కుటీరపరిశ్రమల్లోని వేర్పు, వంటలు వార్పులకు సంబంధించిన ప్రావీణ్యము, నిర్మాణవాస్తు విజ్ఞానము, నేత, అల్లిక, సూచీకర్మ, వ్యవసాయ పద్ధతులు, పశుపక్షిపాలనాదులు, ఉపకరణాలు, వస్తువాహనాలు, పాత్రలు చేసేనేర్పు, వేషభూషణములు, అలంకరణములు, తెరపటములు పడగలు, పచ్చబొట్లు,మాలాకారవిద్య, జలచర భూచర ఖేచరముల వేట, భూగోళ, ఖగోళ, జంతు, వృక్ష పరిజ్ఞానము మొదలైనవన్నీ ఈవస్తు సంస్కృతికి సంబంధించినవే.

3. జానపద సాంఘికాచారము-అనగా పైనపేర్కొన్న మౌఖిక వాఙ్మయానికీ వస్తు సంస్కృతికీ మధ్యన రెండు వైపుల పరచుకొన్న సాంప్రదాయిక జీవితానికి సంబంధించిన సమస్తాచారములూ ఇందులో చేరుతవి. పుట్టినది మొదలు గిట్టేవరకూ జీవనయాత్రలో చేసే సమస్త కర్మలకు సంబంధించిన తీరుతీరు ఆచారములు, విధినిషేధములు, సూతకపుటాచారములు అంత్యక్రియలు, వేడుకలు వినోదములు, క్రీడలు, గీత నృత్తములు, పండుగలు పబ్బాలు, క్రొత్తపెట్టుటలు, తిరునాళ్ల ప్రభలు సిడులు, బోనములు, పీరాచారములు, బలులు, మంత్ర తంత్ర యంత్రములు, మందులు మాయలు, ప్రయోగములు, కట్టుబోతు విద్యలు, తాయెతులు రక్షలు, దిగదుడుపులు, దృష్టి తీయుటలు, దాన ధర్మములు, సంతర్పణలు, పూజలు, మొక్కుబడులు, ఆరాధనా విశేషములు, కొలుపులు, పూనకములు, విశ్వాసములు, శకునములు, సోది, కాలజ్ఞానము, ఆటలు పందెములు, ఆంగికములైన సైగలు, భూతవైద్యము, మూలికా వైద్యము, బైరాగి చిట్కాలు, రాక్షస వైద్యము, తీర్థములు, విభూతి కుంకుమ ప్రసాదములు మొదలైనవన్నీ ఇందులో చేరుతవి.

4. జానపద ప్రదర్శన కళలు-అనగా వైయక్తిక -బృంద-నృత్త నృత్యములు గాత్రవాద్య సంగీతములు, కడ్డి వాద్యం, ఏడుమెట్ల కిన్నెర, దమ్ముల గొయ్యనాదం, యక్షగానము, వీధి భాగవతం, గొల్లభాగవతము, గంటె భాగవతం, చిందు భాగవతము, చెంచు భాగవతం, కలాపము, కురవంజి, కోలాటము, కాశికావడి భజనము, పగటి వేషాలు, చోడిగాని కలాపము, వీరభద్ర నృత్యము, ఖడ్గాలు, ఒగ్గు కథ, చెక్కబొమ్మలు, బుట్టబొమ్మలు, తోలుబొమ్మలు, బుఱ్ఱకథలు, జంగం కథలు, గొల్లసుద్దులు, తప్పెటగుళ్లు, డప్పుల నృత్యాలు,

జముకులు, గరగ నృత్యం, గురవయ్య నృత్యం, గడల నాట్యం, డంజలు, చిరుతల భజన, పండరి భజనలు, హరికథలు, గొండ్లి. ఘటనృత్యం, వాలకము, బొమ్మలాట. వీర నాట్యం, గంగిరెద్దుల ఆట, గారడి విద్య, సాము, కాటిపాపల విద్య, విప్ర వినోదులు, బహురూపులు, పులివేషములు, జాదినమ్మ వేషము, గుఱ్ఱపు నృత్యం, ఉరుములు, మోళీ బగానా, సాధనాశూరులు, భంగిములు ముద్రలు మొదలైనవన్నీ ప్రదర్శన కళల క్రిందికి వస్తవి.

ఈ నాలుగు తీరుల జానపద విజ్ఞానంలోను తెలుగుజాతి సాంఘిక చరిత్ర, సభ్యత, సంస్కృతి కానవస్తవి. వాటి వివరాలు తెలుసుకునే ముందు భారతీయ జీవన దృక్పథం ఎటువంటిదో గుర్తించటం అవసరం. హిందూ జీవన దృక్పథం గురించి రెండు పరస్పర భిన్నమైన అభిప్రాయాలు ఇటీవల ప్రచారం లోనికి వచ్చినవి. భారతీయులు కేవలం ఆధ్యాత్మిక, పారలౌకిక జీవన దృక్పథం కలవారనే అభిప్రాయం ఒకటైతే, భారతీయుల ఆధ్యాత్మిక వాదం కేవలం నోటి మాటల వరకే గాని అసలైతే స్వార్థపూరిత విషయలోలప జీవితం అనేది మరొకటి. ఈ రెండు తీరుల అభిప్రాయములూ అతివ్యాప్తి దోషదూషితములనే చెప్పవలెను నిజంగా భారతీయుల దృష్టిలో మానవ జీవితం ఒక వరప్రసాదం భగవత్ప్రసాదంగా అందివచ్చిన ఈ జీవితాన్ని సద్వినియోగం ద్వారా, సత్కర్మానుష్ఠానంద్వారా ఐహిక సుఖానుభవానికీ, పరమపద ప్రాప్తికీ ఉపయోగించుకోవటం లోనే సాఫల్యం ఉన్నదని భారతీయుల నిశ్చితాభిప్రాయము భిన్న దృక్పథముల మధ్య సామరస్యం సాధించినపుడే మానవుడు సంపూర్ణమైన సమ్యక్ జీవితం అనుభవిస్తాడు. మానవ జీవితమనే నాణెమునకు వైయక్తికము సామాజికము అనేవి బొమ్మబొరుసు వంటి రెండు పార్శ్వాలు వైయక్తిక సామాజిక జీవితాలకు సామరస్యం లేకపోతే అది మానవసమాజం అనిపించుకోదు. అది జంతువులకంటె నికృష్టస్థితి ఔతుంది. అందుకే మన ప్రాచీన ఋషులు, స్మృతికారులు మానవాళి సమ్యక్ జీవితానికి, పరిపూర్ణతకు, ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్థములను నిర్దేశించినారు ఈ నాలుగు పురుషార్థములు వేనికవి వేరువేరు కావు. ఇందులో అర్థకామాలు చాలా బలీయమైనవి. అవి జీవితరథానికి రెండు చక్రాలు. వాటిని ధర్మ మోక్షములనే గాడిలో నడిపిస్తే జీవితరథం ఒడుదొడుకులు లేకుండా, దారి తప్పకుండా గమ్యం చేరుతుంది. అర్థమనే చక్రం ధర్మ

మనే గాడిలోను, కామమనే చక్రం మోక్షమనే గాడిలోను నడుపవలెను. అనగా ధర్మవిరుద్ధం కాని అర్థమునూ, మోక్షవిరుద్ధం కాని కామమునూ మానవుడైన వాడు భజించవలెనన్న మాట. దీనికి విరుద్ధంగా వ్యక్తిగాని, సంఘం గాని ప్రవర్తిస్తే రాక్షసత్వమో, రక్తపాతమో, అందోళనమో, అరాజకమో సంభవిస్తవి. ఈ చతుర్విధ పురుషార్థములకు వైరస్యం కలుగకుండా అనుభవించటాన్ని మన శ్రుతి స్మృతి పురాణేతిహాసాలు బోధించినవి. చదువు సంధ్యలు నేర్చినవారి ప్రబోధల ప్రభావంతో ఏ విధమైన సమరస జీవితం గడిపినారో మన సాంఘిక చరిత్రకు ఆధారసామగ్రియైన శిష్టసాహిత్యంలో ప్రతిఫలిస్తున్నది. అదే విధంగా నిరక్షరాస్యులైన పల్లీయుల్లో ఈ విధమైన ధార్మిక ప్రబోధం ఆబాలగోపాలమూ జానపదవిజ్ఞానంద్వారా ప్రసరించినది. మన సామాజిక జీవితంలోని నైతిక మూల్యాలనూ, సాంస్కృతిక జీవితంలోని ధర్మనిరతినీ ముముక్షుతనూ, తమ అభిరుచులకు శక్తియుక్తులకు అనుగుణంగా మలచుకొన్న పాత్రలద్వారా, సన్నివేశాలద్వారా, శక్తిమంతంగా చిత్రించుకొని, జానపదులు ఒక తరంనుండి మరొక తరానికి అందించుకొంటూ వస్తున్నారు.

ఆంధ్ర తెలుగు పేర్లు మన జాతికి భాషకు దేశానికి చాలా ప్రాచీనకాలం నుండే అభేదంగా చెల్లుతున్నా ప్రారంభంలో ఇవి వేరువేరని ఊహించటానికి ఆస్కారమున్నది. ఈనాటి భారతదేశంలోని పెక్కు జాతుల వలెనే మన జాతి కూడ మిశ్రమ జాతి అని భావించవచ్చును. మనలో ఎక్కువగా మధ్యధరా ఉపజాతి లక్షణాలు అటు తరువాత ఆస్ట్రిలాయిడ్ ఉపజాతి లక్షణాలు మంగోలాయిడ్ జాతి లక్షణాలు ఉండటం చేత మిశ్రమజాతి అని నరశాస్త్ర వేత్తలు నిర్ణయించినారు. గోండులు మొదలైన వారి పురాగాథల్లోని తెలుంగు దేవతా మూర్తి గాథలనుబట్టి ఐతరేయ బ్రాహ్మణములోని ఆంధ్రుల కథను బట్టి ఈ నిర్ణయం సరియైనదే కావచ్చుననిపిస్తున్నది. మన జీవన విధానంలోని మౌలిక రూపమునూ, ఆచార విచారముల ప్రాథమిక స్వరూపమునూ తెలిపే పురాగాథలింకా మిగిలి ఉండటం మన అదృష్టం. సృష్టి ప్రారంభం, మానవ వంశ విస్తరణ, ప్రళయము, పునస్సృష్టి గురించిన కథలు, దైవాంశ గలవారి కథలు, వీరుల కథలు, వంశపురుషుల కథలు, రక్షక దేవతల కథలు, మాతృదేవతారాధన కథలు, సృజన శక్త్యారాధన కథలు నిశితంగా పరిశీలిస్తే మన జాతి

ప్రాక్చారిత్రకదశనాటి విశేషాలు తెలియవస్తవి. బేతంచెర్లగుహల్లో కానవచ్చిన ప్రాక్చారిత్రక గుహాచిత్రాలు, చిత్తూరు, కడప, తెలంగాణం జిల్లాలన్నిటిలో ఈనాటికి ఉన్న ప్రాక్చారిత్రకావశేషాలు మన ప్రాచీనతను తెలుపుతవి. కాలప్రవాహంలో ఈ ప్రాచీన విశేషాలు అవశేషాలు కనుమరుగై పోయినా ఒక మాటలోనో, పేరులోనో, ఆచారంలోనో, వేడుకలోనో వాటి గుర్తులు ఈనాటికి స్పష్టాస్పష్టంగా కానవస్తున్నవి. "బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః" అనే వేద మంత్రంలోని చాతుర్వర్ణ్యములవారి ఉత్పత్తి, పురాణములలోని సూర్య చంద్ర వంశ రాజుల ఉత్పత్తి, శరజన్ముడు, అప్సరసలు, ద్రోణుడు, సీత, ద్రౌపది వంటి అయోనిజుల చరిత్రల వంటివే ఆటవికులు, గాయక భిక్షుకులు, అట్టడుగు కులాలవారు తమ తమ కులాల పుట్టుకలను గూర్చి చెప్పే కథలు, ద్విజుల ఋషిగోత్రముల వంటివే. టోటెమికాంశములను సూచించే ద్విజేతరుల గోత్రాలు, తెలుగు ఆటవికులైన చెంచులు, కొండరెడ్లు, గాయక భిక్షుకులైన పిచ్చుకుంట్లు, బాలసంత, వీరముష్టివారి ప్రాదుర్భావం తెలిపే పురాగాథల్లోను, జాంబ పురాణంలోను ప్రాక్చారిత్రకాంశము లున్నవి. తెలుగుదేశంలో ఒక భాగానికి బౌద్ధ యుగంలో నాగభూమి అనే పేరుండటం, తెలుగు దేశమంతటా నాగ శిల్పాలు, నాగపూజలూ ఈనాటికీ ప్రచురంగా ఉండటం మన ప్రాచీనతావశేషమే అనుకోవలెను "నీ బండజడ" అనే నెల్లూరు ప్రాంతపు మందలింపు మాట తెలుగుజాతి శిలాయుగపు ఆచారమును తెలిపే తిట్టు. చరిత్ర పూర్వయుగం నాటి రాక్షసగుళ్లు, మెన్‌హిర్‌లు, సిస్ట్‌లు (కెయిరనులు) ఈనాటికీ తెలుగుదేశమంతటా కానవస్తున్నవి ఆ భౌతికావశేషాలకు వాగ్రూపమైన తిట్టు, దాని వాడినీ వేడినీ కోలుపోయినా నేడు ఒక తెలుగు నానుడిగా మిగిలిపోయినది. "నీ తల్లికడుపు బంగారంగాను" అనే మందలింపు మాటలో హిరణ్య గర్భ-అనగా సాలగ్రామాచారం దాగి ఉన్నది. మరి "నీ తల్లికడుపులో అంబలిపోయ" అనే మాటల్లో ఏ ఆచారమున్నదో తెలియదు వీరశైవుల ఖననాచారమును తెలిపే "గుంట బెట్టి గంట వాయించు" మాట సార్థక్యం అందరికి తెలుసు. "జన్నెవిడుచు", "బసివి" మొదలైన తిట్లలోని ఆచారములు అర్ధ శతాబ్దం క్రిందనే సమసిపోయినవి. ఇంకా కథ కంచికిపోయింది, ఆట కట్టు భరతం పట్టు, వీరంగం తొక్కు, ముగ్గులోకి దించు, శ్రీకారం చుట్టు, తాగి తందనాలాడు, శివమాడు మైలపోలు తీయు, గావుపట్టు, బొమ్మగట్టు వంటి మాటలు నానుడులు చెప్పే ఆచార వ్యవ

హారములనేకములు. ఈ శతాబ్దం తొలిపాదం వరకు కొన్ని కులాల వారిలో వివాహానికి పూర్వం జరిపే కొన్ని విధుల దాటున వారి ప్రాచీన చరిత్రం తెలిపే విషయాలున్న సంగతి సంప్రదాయజ్ఞులైన ప్రాతతరాల వారికి తెలిసిన విషయమే. 'దొక్కచించి డోలుకట్టు' అనే మాటల వెనుక రుంజలవారి చరిత్ర దాగి యున్నట్లే చాలాకులాల చరిత్రలు ఒక మాటలోనో ఒక పలుకుబడిలోనో దాగి ఉన్నవి. వాటిని వివరించటం ఈనాడు అంతబాగుండదు.

ఉత్తమ సంస్కారం కలిగించటానికి వ్యక్తిపై, కుటుంబంపై, సమాజంపై జానపద వాఙ్మయం నెరపిన ప్రభావం చాలా దొడ్డది. రామాయణ భారత భాగవత గాథలు భారతీయులందరికి సుపరిచితములు. ఐతే సంస్కృతంలో ఉన్న ఈ గ్రంథాలు ఆనాడే కాదు ఈనాడు కూడ నూటికి ఒక్కరికి మాత్రమే తెలుసు. ఆ సంస్కృత గ్రంథాలు ఆధారంగా దేశభాషల్లో వచ్చిన రచనలు మాత్రం నూటికి పదిమందికి తెలుసు. మరి తొంబదిశాతం ఉన్న జానపదులకు ఈ పవిత్ర గ్రంథాలలోని నీతులు, ధర్మం, ఆయా పాత్రలు ఎట్లాతెలుసు ? వారు అక్షరాస్యులు కాకున్నా, చదువు సంధ్యలు వారికి రాకున్నా, ఒక నోటి నుండి మరొకనోటికి, ఒక తరం నుండి మరొక తరానికి, ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి, వారసత్వంగా ఈ సంపద వారికి లభించినది. ఈనాటి వయోజన విద్యాప్రచారకులు విద్యాశాఖాధికారులు ఇందులోని సూక్ష్మం గ్రహించవలెను. శిష్ట సాహిత్యంలో కంటె జానపదుల నోళ్లలో ఈ రామాయణ భారత భాగవత కథలు చిలవలు పలవలుగా పెరిగిపోయినవి. వాళ్లు తమ చిత్త వృత్తుల కను కూలంగా తీర్చిదిద్దుకున్న ఆయా పాత్రలు సజీవంగా కళకళలాడుతూ వారికి చతుర్విధ పురుషార్థములను ఎట్లా భజించవలెనో ఉపదేశిస్తుంటవి శ్రీరామచంద్రుని పితృవాక్య పరిపాలనా దీక్ష, శరణాగత త్రాణ పరాయణత్వము, సీతమ్మ పాతివ్రత్యము, లక్ష్మణుని సోదరప్రేమ, ఆంజనేయుని సేవానిరతి, శ్రీకృష్ణుని దివ్య లీలలు, ధార్మికనిష్ఠ, ధర్మరాజు నీతి, భీముని బల పరాక్రమములు, అర్జునుని కోదండ పాండిత్యము, ద్రౌపది సామర్థ్యము వంటివి జానపదులకు ఆదర్శప్రాయములు. ఇక పురాణేతిహాసములు (Myths & Epics) జానపదుల సొమ్ములే. పురాణ లక్షణములైన సర్గప్రతి సర్గాదులకు సంబంధించిన విషయాలన్నీ జానపదుల ఊహలు ఆధారంగ చేసికొని శిష్టులు ఆయా పురాణాలు రచించినారని విజ్ఞుల అభిప్రాయం ఆయా సన్నివేశములు సంఘటనలు పాత్రలు జానపదులకు

ఆ స్త్రీక్కి బుద్ధిని భయమును భక్తిని ధర్మనిష్ఠను నీతినియమములను బోధించి సామాజిక వ్యవస్థ సడలకుండా కాపాడుతున్నవి.

సీతాదేవి గురించి జానపదులు కల్పించుకొన్న భావమెంత ఉన్నతమో ఉదాహరణగా మనవి చేస్తాను. జానపదుల రామాయణ కథాగేయాలలో "సీతాదేవి ఆనవాలు" అనేది ఒక కళాఖండం. సీతాన్వేషణకు బయలుదేరే ముందు ఆంజనేయుడు 'ఆయమ్మను నేనెట్లా గుర్తుపట్టేది ? ఒక వేళ గుర్తు పట్టగలిగితే ఆయమ్మ నన్ను ఎట్లా నమ్మేది?' అని శ్రీరామచంద్రుని అడుగుతాడు. అప్పుడు శ్రీరాముడు ఆంజనేయునికి సీతమ్మను గుర్తించటానికి పింయ్యే ఆనవాళ్లు, సీతమ్మ నమ్మటానికి తగిన తమ దాంపత్య జీవితంలోని కొన్ని మధుర సన్నివేశాలు వినిపిస్తాడు. ముందుగా సీతమ్మ అందచందాలు (Physical beauty) వినిపిస్తాడు-

''మహిమీద మాదేవి గాంచేటి తెరవు
వినవయ్య చెప్పేను శ్రీవాయుసుతుడా
విజమునకు విప్పినవి పిలంపు కురులు
జడలు గట్టి కడుపెద్దవిగ నుండు
తల అంటు అడకే ఆడి నట్లుండు
నీలంపు తలకుంచ కలిగుండుగాని
పచ్చిపసు పలదకే అలదినట్లుండు
బంగారమొక చాయ కలదె మా కాంత
పెట్టక కాటుక పెట్టినట్లుండు
దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు
చేయక శృంగారం చేసినట్లుండు
అలదక పరిమళ మలదినట్లుండు
వేయక తాంబూలం వేసినట్లుండు
పగడంపు ఒక చాయ కలిగుండు కాంత

తొడుగులు తొడుగకే తొడిగినట్లుండు
తొలకరి మెరుపువలె తా. మెరయుచుండు
మసిపాత గట్టిన మాణిక్యం వలెను
నివురుపై గప్పిన నిప్పులాగునను
కసుగంది యున్నట్టి కుసుమమ్ము వలెను
శీతకాలము నాటి సేతువువలెను
మేఘములోనున్న సూర్యుని వలెను
మెరుగుజెడియున్నట్టి అద్దమ్ము వలెను
పరమసతి ప్రభావమెల్ల జెడియుండు
రాహువు బట్టిన చంద్ర మండలము రీతి
చింతచే కడు చిన్నబోయుండు దేవి
ఈవయ్య ముద్రికా ఇంతి చేతికివి''

ఈ వర్ణనంలోని వైశిష్ట్యం వివరించకుండానే తెలుస్తున్నది ఇక శ్రీ రాముడు తమ దాంపత్య జీవితంలోని ఒక మధుర ఘట్టం వర్ణించి చెప్పిన తీరు గమనించండి. ఒకనాడు సీతమ్మ అలంకరించుకోవటానికి తన గదిలో నిలువు టద్దం ముందు నిలుచున్నది.

''అద్దమ్ము లోపలా అతివ తన రూపు
అందులో జూచి కురులంకించిముడువ
ఈ అద్దములోను ఈ రూపుతోను
ఇంత చక్కని దేవి ఇది యెవ్వరనుచు''

తానే భ్రమపడి శ్రీరాముడింకెవరో స్త్రీని తెచ్చిపెట్టుకున్నాడని భావించి, రాముని దగ్గరకుపోయి-

''ఆహహా శ్రీరామ అయోధ్య రామ
సృష్టికి తపులు చేసి యిట్టులెరిగితివా

ఏక పత్నీవ్రతుడవని యిచ్చె మా తండ్రి.
ఏకపత్నీత్వంబు ఇంపుగా తెలిసె
ఇట్టి మాయల సతిని పిలిపించదగునా''

అని నిష్ఠురా లాడుతుంది. శ్రీరాముడామె మౌగ్ధ్యమునూ అమాయకత్వమునూ గమనించి నవ్వుకొని-

''పతిలేని సతి జూచి అతివ కోపిస్తివి
పతి జూచితే అలుక బాసునా చెపుమ
విలువుటద్దము దెచ్చి మెరుగు తుడిపించి
మెరుగుబోడి సీత ముందరా విలిపే
ఇద్దరీ రూపులూ అందులో జూచి
ఇద్దరీ వన్నె సౌందర్యములు జూచి
నరనాథ వారెవరొ ఎరిగించుమనెను
సీత భయమూ బాప అతివరో వినవే
సీతయూ రాముడూ చేరియున్నారు
ఈ యింట వింకెవ్వరుండంగ గలరె
అతివ వెరచి విభుని పాదాలు మ్రొక్కె
ఇది ఒక ఆనవాలు కలదు సుమి హనుమా''

ఈ సంఘటన మూలంగా సీతమ్మ ముగ్ధ సౌశీల్యమే కాకుండా శ్రీరాముడు చెంతలేని సీతమ్మకు గుర్తింపు లేనట్లుగా జానపదులు చిత్రించి సీతాదేవి పాతివ్రత్యమును ఆకాశపుటంచులకెత్తినారు. రామాయణ భారత భాగవతముల్లోని ఉదాత్త పాత్రలన్నింటినీ జానపదులు ఈ విధంగా మలచుకొని ఆదర్శ మూర్తులుగా నిలుపుకున్నారు.

వ్యక్తులుగా, కుటుంబ సభ్యులుగా, సమాజంలోని సభ్యులుగా జానపదులకు పరంపరాగతంగా ఎటువంటి సంస్కారం జానపద వాఙ్మయం మూలంగా లభిస్తున్నదో దిఙ్మాత్రంగా గమనించండి. చిన్నప్పటి నుండే ఉత్తమ సంస్కారం

కలిగించేటందుకు మగ పిల్లలకూ ఆడపిల్లలకూ దైవభక్తి, బంధుప్రీతి, దయ, ధర్మము వంటి మంచి గుణాలు నేర్పే పాటలు తల్లులు పాడుతుంటారు. పిల్లల పాటల్లో వీటి సంఖ్య అధికం. వీటితోపాటు లౌకికజ్ఞానం నేర్పే పాటలు కూడ చిన్నప్పుడే నేర్పుతారు. ఓనమాలు ఒంట్లు నేర్పే సమయంలోనే-

చుట్టాల సురభి బొట్టనా వ్రేలు,
కొండీల కొరివి చూపుడు వ్రేలు,
పుట్టు సన్యాసి మధ్యవ్రేలు,
ఉంగరాల భోగి ఉంగరపు వ్రేలు,
పెండ్లికి పెద్ద చిటికెన వ్రేలు,
చిన్న చిన్న చిటికెన వ్రేలా-
ఒక్కటి అంటూ లెక్కపెట్టు''

అని బోధిస్తారు. ఇందులో బొటనవ్రేలుతో బొట్టుపెట్టటం, వధూవరులు పరస్పరం చిటికెనవ్రేళ్లు పట్టుకొని సాప్తపదీన సఖ్యం చేయటం అనే సంస్కారములు గరపటం తెలుగు జానపదుల సంస్కృతికి ఉదాహరణం. పెండ్లిచేసి ఆడపిల్లను అత్తవారింటికి సాగనంపేటప్పుడుపాడే అప్పగింతలపాటల్లో,

''వీధిలో నిలుచుండి కులుకిప్పకమ్మా
అత్తమామల భక్తి నాదరించమ్మా
పతియె దైవంబని భావించవమ్మా
పలుదెరచిగట్టిగా పలుకబోకమ్మా,
పొరుగిండ్లకెప్పుడూ పోవద్దు అమ్మా
నలుగురి నోళ్ళలో నానబోకమ్మా''

అనే హితమితోక్తులు జానపదుల కౌటుంబిక జీవితంలో కోడరికపు విధి నిషేధాలను బోధించునట్టివి. పండుగకో పబ్బానికో పుట్టింటికి వచ్చే ఆడబిడ్డ తన అన్నతో-

మూడేసి పెట్టెల్ల ధనము నీ కుంటె
ముక్కుపోగులదాన్ని అన్నరో నేను.
నాలుగేసి పెట్టెల్ల ధనము నీకుంటె
నక్కిరై కెల దాన్ని అన్నరో నేను"

అని ఆశించే చిరు కోర్కెలు ఆనాటి ఆడపిల్లలకు పుట్టింటివారి ఆస్తిపాస్తులమీద ఉండేహక్కుల పరిమితిని సూచిస్తవి. అత్యాశగల భర్తలు తమ భార్యలను చీటికిమాటికీ-

"పున్నమ్మినాడైన బూరెలు వండుకొని
పుణ్యుడా రమ్మని పిలిచిరె మీ వాళ్ల
అమవాస్యనాడైన అట్లు వండుకొని
అల్లుడా రమ్మని పిలిచిరె మీ వాళ్ళు"

అని సాధిస్తుంటే

"మా వాళ్ల పేదవాళ్ళు మాకేమికద్దు,
పెట్టగల పెద్దింట్ల పెండ్లాడరాదా"

అని సమాధానంచెప్పే స్త్రీలూ ఉన్నారు. ఇవిపేరుకు 'సుభద్రసారె'అనే పాట లోని చరణాలైనా ఇందులోని సుభద్రార్జునులు తెలుగు జానపద దంపతులే.

అక్కబిడ్డనూ, మేనమామ కూతురును పెండ్లాడటం తెలుగునాడు ఆచారం; హక్కుకూడా. ఇంత సన్నిహితమైన సంబంధం చేసికూడ—

"తమ్మునీ బిడ్డావి తన కోడలాని
దయతోడ బెట్టింది తక్కెడేకూలు
బిడ్డాకు బెట్టేది బీరాకు ఎత్తూ
తాను బెట్టూకుంది తమలపాకెత్తు

అడుకడుకు కోడలా కుడుక గొనిస్తా,
బుదారపంగట్ల బుద్ధి చెప్పిస్తా
అయితారపంగట్ల అంగబెట్టిస్తా"

అని పక్షపాత వైఖరి ప్రదర్శిస్తూ కోడలిని సాధిస్తుంటే విసిగి వేసారి చివరకు అత్తను ధిక్కరించి.

"చింతచెట్లా మీద పొద్దులున్నాయి
చింతపడకత్తా చీరకడికిస్తా
రాగిచెట్లా మీద పొద్దులున్నాయి
రంధి పడకత్తా రైకె కడికిస్తా"

అని సమాధానం చెప్పే కోడలు కూడ తెలుగు కుటుంబాలలోని వ్యక్తియే. చిలికి చిలికి గాలివాన ఐనట్లు ఇటువంటి చిన్న చిన్న సాధింపులు సామరస్య లోపం కుటుంబ విచ్ఛిత్తికి దారి తీస్తాయి. అత్తపోరు ఆడబిడ్డల పోరు పడలేక ఇల్లాండ్రు తమ భర్తలను వేరు పడటానికి ప్రోత్సహిస్తారు.

"ఏరు బడితేనె మేలు మొగడా
పొత్తులుంటేనె పోరు మగడా
ఏరుబడ్డ తెల్లారి ఏకమై మనముండి
ఏకించి పీకించి నెలకొక్క పోగొడికి
మోట దండెడదొడ్డు మొలతాడు చేయిస్త
మక్కజొన్న చేను మన పాలికే వస్తె
నక్కబెదురూ బెట్టి నా ప్రజ్ఞ చూపించి
ఇద్దూము పండేది నల్తూము పండిస్త
రంగు రంగొంకాయలు గొంగెడన్ని దెంపి
హంగుగా నేనమ్మ కొండంగడికి పోయి
పొంగుబొంగే కల్లు బుంగెడంతా దెస ॥

అని భర్తను ప్రలోభ పెట్టి వేరు కాపురం పెట్టటం జరుగుతుంది.

ఇది వ్యక్తి నుండి కుటుంబంవరకు సాగిన జానపద జీవితవిధానం లోని మంచిని వెదుకును చెప్పే చిత్రణ. వేదం పరాత్పరుణ్ణి "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్"గా చిత్రించటం మన సమాజపు విరాడ్రూపమును వర్ణించటమే. సమాజంలోని ప్రతి వ్యక్తి, ఆ విరాడ్రూపంలోని భాగమే. శరీరం లోని అన్ని అంగములకు సమరసభావం ఉంటేనే అంగికి క్షేమం విడివిడిగా వ్యక్తులు బ్రతుకలేనట్లే వృత్తులు కళలు సమస్త కార్యములు జానపద సామాజిక జీవనంలో, జానపద సంస్కృతిలో, పరస్పరాశ్రితములు. తెలుగు జానపద జీవితంలో ప్రధాన వృత్తి వ్యవసాయం. తక్కిన వృత్తులన్నీ దానికి అనుబంధ ములు. ఒక వృత్తివారు మరొక వృత్తివారి పైన ఏ విధంగా ఆధారపడి ఉంటారో ఒక సాధారణమైన జాజిరి పాట చిత్రిస్తుంది —

"దున్నపోద్దున్నపో ద్దుక్కిలెందుకు పన్నవ్
పసులోడు గాయంది నన్నేమంటవ్
ఏమిర పసులోడ ఎందుగ్గాయవ్
జీతమియ్యంది నన్నేమంటవ్
ఏమిర పటేల జీతమెందు కియ్యవ్
సోల దొరుకంది నన్నేమంటవ్
ఏమే సోలా ఎందుకు దొరుకవ్
వడోడు చెక్కంది నన్నేమంటవ్
ఏమిర వడ్లోడ ఎందుకు చెక్కవ్
బాడిస తెగంది నన్నేమంటవ్
ఏమే బాడిస ఎందుకు తెగవ్
కమ్మరోడు చరువంది నన్నేమంటవ్
ఏమిర కమ్మరోడ ఎందుకు చరువవ్
తిత్తూదంది నన్నేమంటవ్
ఏమే తిత్తి ఎందుకు ఊదవ్

ఐక్కడి చావంది నన్నేమంటవ్
ఏమే ఐక్కడాన ఎందుకు చావవ్
ఆయుసు మూడంది నన్నేమంటవ్"

ఇది నవ్వులాట కోసం పాడే పాటవలె కనిపించినా జానపద సామాజిక జీవితంలో సమస్త వృత్తులవారూ ఆ సమాజ పరమేశ్వరుని కంఠమాలలోని పువ్వులే, అందరూ సమానులే; అనే విషయం స్పష్టంగా చెప్పుతున్నది.

వ్యక్తిగా జన్మించి, కుటుంబంలో సామరస్యం సాధించి, సమాజ మణి హారంలో ఒక పూసయై, మొదటి మూడు పురుషార్థములూ అనుభవించి, చివరి మెట్టుగా ఆత్మతత్వమును గుర్తించటమే మోక్ష పురుషార్థమును భజించటం.

"ప్రమిదల నూనె ఉన్నంత సేపే దివ్వె వెలుగులంతా
ఆ ప్రమిదల నూనె అయిపోగానే దీపమారు నంతా"

అని సాధారణ జానపదుడు సమాజ దేహంలోని పరమాత్మప్రకాశం ప్రాధాన్యాన్ని గుర్తిస్తాడు. మరికొంత ఉన్నత సంస్కారియైతే—

"ఏదారి వచ్చితివో ఆ దారినే పోవ
ఇక జన్మమే లేదు చిలుకా
ఆ దారి తెలియకే గోదారిలోన బడి
అల్లాడి పోవకే చిలుకా
నీకిష్టమగు నామ మేదియైనను గాని
నిత్యమనుచుండవే చిలుకా
అనగననగా నామ మనకుండినను గూడ
అన్నయట్టే యుండు చిలుకా
కాలంబు గడువగా గడువగా అది విశ్వ
గానమై పోవునే చిలుకా

ఆ విశ్వగానమే అంతరమ్మున దోచి
అగు బ్రహ్మగానమే చిలుకా
ఆ బ్రహ్మగానమున కాది గానంబున్న
దంతరిక్షంబందు చిలుకా
ఆ గాన మీ గాన మైక్యమైపోవుచే
ఆనందమే రామచిలుకా''

అని జీవన్ముక్త స్థితిని గానం చేస్తాడు. ఈ యెరుకతో అతని జన్మ, కర్మ ధన్యమై పోతవి. ఈ ఆత్మతత్త్వజ్ఞానము "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" అనే ఉపనిష ద్వాక్యానికి సంకేతంగా ఒకానొక సంక్రాంతి ముగ్గులో చిత్రించటంలోను, బీతన్నల వారు తాము వేసే పట్నాలలోను. మన స్త్రీలు వాకిండ్లలో వేసే కొన్ని ముగ్గుల్లో తాంత్రిక విజ్ఞానాన్ని సంకేతంగా చిత్రించటంలోను చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతుంది.

పలనాటి వీరుల చరిత్రము, కాటమరాజు కథ వంటి ప్రాచీన చారిత్రక గాథాగేయాలలో మన రాజకీయ సాంఘిక చరిత్రము, యుద్ధ తంత్రము యుద్ధ సమయములు, వీరుల వేషభాషలు, సైన్యములోని తరగతులు, ఆయుధాలు మొదలైన వాటి వర్ణనం కానవస్తుంది. కార్యమపూడి కదన రంగానికి బ్రహ్మ నాయుడు తరలిపోయినప్పుడు——

• "గొల్లెనల్ గట్టిన గొప్పలౌ బండ్లు
బల్లావి పెట్టెలు పట్టెమంచములు
తరుచైన పీటలు తమ్మ పడిగెలును,
వింతమందసములు వెలయు గొడ్గులును
కాశ్మీర కస్తూరి గంధ కర్పూర
మాదిగా వాసన లమరు పెట్టెలును
బొక్కసంబుల బల్వు బోనగావళ్లు
జవ్వాజి పెట్టెలు శారికాకీర

పంజరములుపట్టు పరిచారకులును,
కోడెకాండ్రదలించి కొట్టెడు రెడ్లు
పడివాగె తేజీలు పాలకీజోళ్లు
అష్టభాగ్యంబుల అంగళ్ల వారు
సందడి పడ చయ్యన కదలె" నట.

ఉభయ సైన్యాలకు మధ్యన సాక్షిగా ఒక స్తంభాన్ని నిలుపటం మనయుద్ధ ధర్మం వలె గోచరిస్తున్నది. బ్రహ్మనాయుడు రణరంగానికి భూతరాట్ స్తంభమును తరలించుకపోయి సాక్షిగా నిలిపినాడు.

"ఇనుము పిత్తళి కంచు హేమ తామ్రముల
పంచలోహంబుల ప్రబలినదాన
నాలుగు ముఖముల నయమొప్ప మరియు
ఎనిమిది ముఖముల ఎన్నికై నావు
ముగురు మూర్తులు నొక్క ముఖమందు నిలిచి
ఒకట సిద్ధులు మరి నొక్కట మునులు
గంగయు దుర్గయు కాలభైరవుడు
నిలిచి భూదేవియు నీ యాననముల
గంధర్వపతులతో కాచుచునుందు
రనుచు ప్రార్థనజేసి ఆ బ్రహ్మ పలికె" నట.

ఆ కంబానికి వివిధాన్నములు కుంభములు పోయించి ఘనమైన పోతుతో గావుచెల్లించి బలులిచ్చినారు అటు తరువాత పల్నాటివీరులు గంగధార మడుగుకు పోయి అక్కడ,

"తమ తమ నామముల్ ధరలోన తరుచు,
ప్రఖ్యాతి నొందంగ భక్తితో నందు
స్నానంబు జేసి విశాలతీరమున
నిలిపిరి లింగముల్ నేమంబుతోడ"

వీరులు నిలిపిన శస్త్రాలలింగాలకు ఏటేటా పూజలు జరుగుతున్నవి. నలగామ రాజు నాగమ్మతో

"మనవద్ద బంట్లును మన్నెవారలును
పంక్తుల నన్నంబు భక్షించువారు
రొక్క జీతంబుల రూథులౌవారు
క్షేత్రముల్ జేసుక జీవించువారు
పల్లెలు బుచ్చుక బ్రతికెడువారు
ఎలగోలు ప్రజలకు నెల్లరకిపుడు
పైనమై రమ్మని పరగ జెప్పింపు"

మని సేనల్లో ఉండే జీతగాండ్రను పేర్కొంటాడు. నలగాముని సైనికులు—

సురియలు పరిఘముల్ శూల సంఘంబు,
ప్రాసముద్గరములు పటు ఖడ్గచయము
పేరైన చక్రముల్ భిండివాలములు
పరశువుల్ బల్లెముల్ బాకు కటార్లు
శార్ఙ్గముల్ ధనువులు శరధులు దాల్చి" యుండిరి.

ఇంకా జల్లికేడెములు, దండచక్రములు, గాయగోవాళాఖ్య బిరుదులు, సామంత రాగోల, అంకుశము వంటి ఆయుధాలు కూడ ధరించినట్లున్నది. నలగాముని విలుమూకవారు గోవు మీద

"చందురు వంకలు చల్ల జంపులును
పొట్టల పొంగులు పుణ్యతీర్థములు,
యొరి దైవములు పిల్ల యేమక లిర్వులను
యేక పెక్కు నమ్ములు యోకపోకలును

తామరతూనలు తల్లి మెరుగులును
చీకటి మిణుగురు రు గండెలును,
గుండెలు భీతిలు తూతపెట్టులును
కుత్తికదీపులు కుప్పికోలలును"

మొదలైన బాణాలు ప్రయోగించినారు. బ్రహ్మనాయుడు గుఱిజాల విరుగబోదువ వచ్చినపుడు నలగాముడు నాగమ్మతో—

"పన్నించు కోటపై పడగలు వేగ
గవనికి సూర్వ్యర కదనవిక్రముల
వళిగొయ్య వడిశెల వాలుదొంకెనలు
గణికెలు దూలాలు గాలి దుందుభులు
మకరవిజ్జెలులును మంచి కత్తులును''

సమాయత్తం చేయుమంటాడు. కాటమరాజు కథలోని—

''పారిపోవగ జంపు పోరబొమ్మ గట్టు
మీ సిద్ధిరాజుకు మా యెద్దు కాలి బొమ్మ
తర్లిరావి రాజుకు దరుపు పొలిబొమ్మ
చెల్లని రాజుకు చెడి కాలిబొమ్మ''

అనే మాటలు శత్రువులను అవమానించుటకై వాళ్ళ ప్రతిమలు తమ్మపడిగల్లో ఉంచటం, కాలికి కట్టుకోవటం, గండపెండారాల్లో చెక్కించటం వంటి ఏరాదారాలను తెలుపుతున్నవి.

నాటి విశ్వాసాలు ఆచారాలు కూడ ఈ గాథాగేయాల మూలంగా కొన్ని తెలియవస్తున్నవి. కోళ్ళ పోట్లాటలో మొదటి పందెం ఓడిపోయిన నాగమ్మ మరు నాడైనా బ్రహ్మనాయని ఓడిని గెలువటం కోసం దయ్యాల మల్లయ్య అనే మాంత్రి కుని సహాయం కోరుతుంది. వాడు--

"వాకట్టు మరకట్టు వణికెదు కట్టు
పొట్ట పొంగెదు కట్టు పొంగుల కట్టు
కూతపెట్టెడు కట్టు కోపించుకట్టు
కాళ్ళను చేతులు కదలని కట్టు
ప్రాణంబు పోయెడి బలువైన కట్టు" నేర్చినవాడు.

గాంధారి కథలో తాంత్రిక విధానలతోపాటు శక్తిపంపు, శాంభవిపంపు హనుమంతు పంపు వీరభద్ర పంపు, భైరవి పంపు, శక్తి ముగ్గు, శాంభవి ముగ్గు, హనుమంతు ముగ్గు, భైరవి ముగ్గుల ప్రసక్తి ఉన్నది. ఇటువంటి మంత్రతంత్రాలలో ఈనాటికి కొందరికి విశ్వాసం ఉన్నది. కాటమరాజు కథలో నల్లసిద్ధి సైన్యంలో కలిగిన దుశ్శకునాలివి-

మెండైన రాగాలు మెరిసాడసాగె
చీతువల్ మింటిపై చెలరేగి పలికె
నవతల పైడికంటదిరిపడి లేచె
పాల పేరెమువారె పాములు నడకొట్టె
నేల నాడువచోట విలిచెను గౌళి"

"కీచక వధ" అనే గాథలో కీచకుడు ద్రౌపది చెప్పిన ఏకాంత స్థలానికి చేరుకొని మంచంలో మాయా ద్రౌపది ప్రక్కన కూర్చుండగానే ఆ మంచం విరుగుతుంది. అప్పుడతడు, "మంచము విరిగితే మరణమందూరు" అంటాడు. "ధర్మరాజు జూదం" పాటలో లక్ష్మీదేవి జ్యేష్ఠాదేవితో ధర్మరాజు గుణశీలములు వర్ణిస్తూ-

"అలికి విడిచిన గడప దాటడే రాజు
నే ధర్మనందనుని ఎడబాయలేనే
దివ్వెలేని గృహము చూడదేరాజు
నే ధర్మనందనుని ఎడబాయలేనే

యింట ముగ్గు లేక నడువదే రాజా
నేధర్మనందనుని ఎడబాయలేనే
పేరాడు లేనింట నిలువదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
కూరాడు లేనింట కుడువదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
అడమిగిలిన జలకములాడదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
కట్టి విడిచిన వస్త్రం కట్టదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
సానమీది చందనం బలదదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
మునివడ్లు మునిపండ్ల కొరుకదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
సభలోన పక్షమ్ము పలుకదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
పాళ్ళలో భేదమ్ము పంచదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
జట్టి పెండ్లిండ్లుగా చేయదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
మునిమాపు ముంజూరు దూయదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
సందెవేళ చాకి వీధి వెళ్లదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే
ముత్తైదను ముండయని తిట్టదే రాజా
నే ధర్మనందనుని ఎడబాయలేనే

ఒడిలోన పువ్వులు కోయదే రాజు
నే ధర్మనందనుని ఎడబాయలేనే
నట్టింట చిట్టాక మట్టదే రాజు
నే ధర్మనందనుని ఎడబాయలేనే
దూలమ్మ లేవిల్లు దూరదే రాజు
నే ధర్మనందనుని ఎడబాయలేనే''

అంటూ జానపదుల విశ్వాసాలు, విధినిషేధాలు పేర్కొంటుంది. ఇందులో కొన్నింటిని ఈనాడు కూడ మన సంఘం పాటిస్తున్నది. పలనాటి వీర చరిత్రలో సంతానార్థమై ఐతమ్మ నోచిన నోములు వ్రతములు, చేసిన దానములు చాలా ఉన్నవి. కప్పెర చయ దానము, కూష్మాండ ఫలదానము, విష్ణుకాంత నోము, సంధ్యావర్తి నోము, జగజ్జ్యోతి నోము, ఏక బాణము నోము, పచ్చవిల్తుని నోము, నందిపులగము దానము, అశ్వత్థ పూజ, పెండిపోతులకు పెండ్లి, చీకటింటి నోము, కేదారేశు నోము, గజనిమ్మ నోములు ఐతమ్మ ఆచరించినది. బాలచంద్రుడు ఐతమ్మను-

''నీ మేనగోడల్ని నీవడిగినపుడు
నా మేనమామలు నా పెండ్లి నాడు,
మా కులంబున ఓలిమాదలు గలవు
తగినధనం బీక తామీయమనిరి,
ఆ మాట మీదట అమ్మరో నీవు
ముట్టడి వేసితి మూర్ఖత తోడ''

అని నిందిస్తాడు. ఓలి అనగా ఒక విధమైన కన్యాశుల్కం.

కాటమరాజు కథలో ఖడ్గ తిక్కన యుద్ధం నుండి పారివస్తే అతని భార్య స్నానానికి నీళ్లు తోడి.—

"అక్కడ మంచంబు నడ్డంబు పెట్టి
యుద్ధశేరు పసుపమరంగ నుంచి
కూర్చుండి స్నానంబు గొబ్బున జేయు" దని

చెప్పి వస్తుంది. పెరటి బయలులో స్నానం చేసినప్పుడు చాటు కోసం స్త్రీలు మంచం అడ్డుపెట్టుకొని స్నానం చేసేవారు. పురుషులు నిలుచుండి, స్త్రీలు కూర్చుండిస్నానాలు చేయటం పరిపాటి.

పల్నాటి వీరుల చరిత్రలో అనపోతు భార్య, కాటమరాజు కథలో ఖడ్గ తిక్కన భార్య, దేశింగరాజు కథలో అతని భార్య, పెద్దాపురం కోడి పందెముల కథలో జగపతి గజపతి రాజుల భార్యలు సాగుమానం చేసినట్లున్నది. సాగుమానం చేసిన వారు, అత్యాచారాలకు బలియైన పతివ్రతలు పేరంటాండ్లనే పేరుతో ఈనాటికి ఆరాధింప బడుతున్నారు. కామమ్మ, మందపేట పాపమ్మ, సన్యాసమ్మ, లక్ష్మమ్మ మొదలైన పేరంటాండ్ర కథల్లో మన సాంఘికాచారాలు ప్రతిబింబిస్తవి

"శాంత గోవింద నామాలు" అనే పాటలో వివాహ సమయంలోని వివిధాచారాలు విపులంగా వర్ణించబడినవి. గంపలో కూర్చోబెట్టటం, కాడినీళ్లుపోయటం, జీలకర్రబెల్లం నెత్తిపై పెట్టటం, లాజకట్లు విప్పటం, సన్నికల్లు త్రొక్కించటం, వంటి ఆచారాల ప్రసక్తి ఉన్నది. ఇంకా కొట్నాలు పెట్టటం, ఎదురుకోళ్ల నడపటం, పసుపులు నలపటం, అవిరేణులు నిలపటం, ప్రత్తివిత్తులు నాటటం, బూజం బంతులు, పానుపులు, అలక, దోపు, మెరవణి, అప్పగింతలు వంటి ఆచారాలు వాటిననుసరించిన వియ్యాలవారి పాటలు జానపద విజ్ఞానంలో నిలిచిపోయిన మరుగుపడిపోతున్న ఆచారాలు. రుక్మిణీదేవి సీమంతము, రుక్మిణీదేవి వేవిళ్లు, సుభద్రా కల్యాణం, లక్ష్మణదేవర నవ్వు పాటల్లో బాలింతలకు పెట్టే పదార్థాలు, సూడిదలు, ఆంధ్రుల కిష్టమైన తీరుతీరు పిండి వంటలు, పచ్చళ్లు, ఊరగాయలు, పరమాన్నాలు వర్ణించబడినవి. కౌసల్య బైకలు అనే పాటలో ప్రసూతి గృహాన్ని సమాయత్తం చేయటానికి చెలికత్తెలు-

"పీట వేసి చిన్నది ఒక మూల ఉనచారే
మేటిగ దీపము నొకచోటున ఉనచారే
అడ్డానింద వడ్లు పోసి ఉనచారోయమ్మా
పెద్దగుండునొకటి పైన ఉనచారోయమ్మా,
తడవు లేదు తాడు దూలాన వేసియ్యారమ్మా"

అంటారు. 'కుశలవకుచ్చల చరిత్ర' పాటలో ఋష్యాశ్రమంలో సీత ప్రసవించి నపుడు జన్మించిన శిశువుకు—

"పొలుపుగ దర్భలు బొడ్డుపై నుంచిరి
పూబోణులు బొడ్డు నొప్పగ గోసిరి,
మీరు పురుదురని మీ తండ్రిప్పుడు
బంగారపు చేటలు చేయించే,
అనుచును పుణుకులు చేటల పోసి
పట్టుచీరలు పొత్తిళ్ల పరచి,
పవళించబెట్టిరి బాలుణ్ణి
బిడ్డామాది గెడ్డామీది
అనుచు పలికిరి కాంతలు తాము"

ఇంకా-

"ముత్యాల పీటలు ముందుగా వేసిరి
రావే జానకి రమ్మని పిలిచిరి
నడికట్టు గట్టి సంతోషముగను
కుడి పాదమున కూర్చుండబెట్టిరి
ఉల్లి వేసి కాచిన నూనెలను
సీతకు శిరసంటిరి వారు
పచ్చాకు కర్పూరాలు వేసిన
ఒంటిపిండి వలుగులు పెట్టించి
కొట్టుకాయము కొట్టి తెచ్చిరి
అప్పుడు కాచిన ఆవుల పాలు
బంగారు గిన్నెలో పోయించిరి
పణతులు పావంబులు దొడిగించిరి
బొడ్డు కోసిన కత్తి చేతికిచ్చిరి
వేపకొమ్మలు వేలదికిచ్చిరి

తూర్పువైపున విలువ జానకి
మ్రొక్కవె జానకి భాస్కరుకైనా
ఏటనేట చూలింత బాలింతా
దయచేయుమి భాస్కరయనెను
అక్కడనున్న అతివల కెల్ల
పసుపు కుంకుమ పణతులు ఇచ్చిరి
ఆకులు పోకలు కాయలు పండ్లు
ఇచ్చెను జానకి వేడుకతోను''

అని పురుడు వేడుకలు వర్ణింపబడినవి. కుశలవ కుచ్చల చరిత్రలో బారసాలనాడు బావిలో చేదవేసే ఆచారం ఉన్నది.

"అందరు గ్రక్కున అరుదెంచి
బావి లోపల చేదలు వేసిరి
మూడు చేదలు ముందుగ వేసిరి
పొత్తిళ్ళ బట్టలు తడిపించిరి
ఆకులు మొగ్గలు అక్కడ పెట్టిరి
కప్పకు మ్రొక్కిరి కాంతలందరు"

కప్పకు మ్రొక్కె ఆచారంలోని అర్థమేమిటో ఈనాడు తెలియరాదు.

మనదేశంలో అనాదిగా వస్తున్న వర్ణవ్యవస్థ వృత్తి సౌలభ్యంకోసం మొదట నాలుగుగా విభజింపబడినా కాలక్రమాన ఈ చాతుర్వర్ణ్యంలో నూర్ల కొలది భేదాలు ఏర్పడి జాతులు కులాలుగా చీలిపోయినవి. వీరశైవులు కులభేదం పాటించనట్లే వీరవైష్ణవులు కూడ కులభేదం పాటించలేదు. పల్నాటివీర చరిత్రలో బ్రహ్మనాయుడు చాపకూళ్లు పెట్టిస్తాడు. బాలచంద్రునికి చాతుర్వర్ణ్యాల అనుజులన్నారు మాలవాడైన కన్నమనీడు బ్రహ్మనాయనికి బాలచంద్రుని కన్న మిన్న, జానపద వాఙ్మయంలో పెక్కుకులాల వారి వృత్తులు పరిశ్రమలు వర్ణింప బడినవి. కొమిరెల్లి మల్లన్న కథలో కరణాలు, కాపులు, ఆ కాపుల్లోని అంతర్భే

దాలు, పిచ్చుకకుంట్లు, గొల్లలు, కురుమలు, మొదలైన వారి ప్రస్తావన ఉన్నది. జాంబపురాణంలో మాల మాదిగ, దక్కలి, కనికుడుకుల, గంపదింపుల, బొల్లి కాయల మొదలైన అట్టడుగు కులాలు, కాపు, బొందిలి, బోగం, తెలగ, ముత్త రాసి, వడ్రంగి, కంసాలి, కంచరి, కోమటి, అట్కారి, కుమ్మరి, మేదరి, గౌండ్ల, బాలసంత, తుర్క, తంబళ, కుమ్మరి, మంగలి, వంజరి, మార్వాడి, ఆర్య, బైండ్లవారి ప్రసక్తి వారు చేసే వృత్తుల ప్రసక్తి ఉన్నది గంగా వివాహం పాటలో ఏలాపురం వీధులను వర్ణించేటప్పుడు 45 కులాలు చెప్పబడినవి. ఇందులో శ్రీవంతులు, సరగుంటలవాండ్లు, మహాకర్ణికులు, జట్టిసవారు. శాలింగులు, జడ్డివారు, పాండీలు, నెయ్యిలవారు, దేవనలుకలవారు, పండారవారు, చిట్టికర్ణాలు ఏ వృత్తులవారో తెలియదు బ్రహ్మనాయుడు గురిజాలమీదికి దండెత్తిపోతుంటే ఆయన తల్లి-"కష్టమోపులవారి కులకూలివారి, పసుల కాపరులను బలుసుకూరాకు, తిని యడవులలోన తిరిగేటి వారిని" చంపవద్దంటుంది. ఏ పనిపాటా లేక సులభంగా ధనం ఆర్జించే విధానం దొంగతనం. ఆ వృత్తి ఎన్నడో కళగా మారిపోయింది. మన చతుష్షష్టి కళల్లో చౌర్యం కూడ ఒకటి, రేచుక్క పగటి చుక్క కథలు ఆ కళలోని నైపుణ్యమును తెలుపుతవి. పలనాటి యుద్ధంలో సాక్షిగా నిలిచిన భూతరాట్ స్తంభము "ఇనుము పిత్తళి కంచు హేమతామ్రము" అనే పంచలోహాలతో చేయబడింది అనాటికే ఈ పరిశ్రమలు అభివృద్ధిలో ఉండేవని భావించవచ్చు. ఇంకా—

"సకల ధాన్యంబులు సకల రత్నములు
బంగారు వెండియు బహుధన వితతి
సరిగ వస్త్రంబులు సరసంపు పట్టు
పటములు ఘనతంతు పటములు మరియు
కాంస్య తామ్ర శ్వేత క్రమ భాండములు
రస వర్గముల నెల్ల రంజనం బొప్ప
క్రయ విక్రయమ్ముల గావించువారు"

అనాడుండినట్లు తెలుస్తున్నది.

రంగం పెట్టెలు, చీని చీనాంబరాలు, కాశీకావళ్లు, హురుముంజి ముత్యాలు, మలయజం వంటి మాటల మూలంగా దేశవిదేశాలతో నాడు సాగిన వర్తకవ్యాపారములు తెలుస్తున్నవి. మాంచాల—

"ముత్యాలు గూర్చిన ముంగొంగు మెరయ,
ప్రతిమలు వ్రాసిన పట్టువస్త్రంబు
కటియందు ధరియించి"

తల్లిచెంతకు పోయినట్లున్నది. కనుక ఆనాడు కలంకారీ పరిశ్రమ మంచిస్థితిలో ఉన్నట్లు భావించవచ్చు. బాలచంద్రుని వేశ్యాలోలుపత నాటి సంఘంలో వేశ్యల కున్నస్థానమును నిరూపిస్తున్నది కాటమరాజు కథలో వెట్టి వారు సైన్యాలకుకాపలా ఉన్నట్లు దివిటీలు పట్టినట్లున్నది. వినోదాల కోసం, పందెముల కోసం కోళ్లు, గొర్రెలు, దున్నలు, గుర్రాలు, ఏనుగులు, డేగలు, వేటపక్షులు పెంచటం గూడ ఆనాడు వృత్తులుగా ఉండేవి. పెద్దాపురం వత్సవాయిరాజుగారి పూలకోడి, "దేవాంగుల యిండ్లల్లోను ఎత్తిపెరిగినాదట."

మనుజుల అభిరుచులతోపాటు వేషభూషణాలు కూడ మారుతవి. ఒకనాటి వేషభూషణా లీనాడులేవు. ఒక్కొక్కప్పుడు పాత వేషభూషణాలు కొత్త రూపంతో వస్తవి. మన నాయనమ్మలు అమ్మమ్మలు ధరించిన ముక్కెర, బులాకీ, బవిరెలు కుంచెండ్లు, పిల్లెండ్లు ఈనాడు కనబవు. ఒకప్పుడు పల్లెటూరివాళ్లు ధరించిన పూసల రవికెలు, అద్దాల రవికెలు నాగరక స్త్రీలు ఈనాడు మరల ధరిస్తున్నారు. వేణీబంధాలు కూడ తీరుతీరుగా మారుతున్నవి అమరావతి నాగార్జున కొండ శిల్పాలలో కానవచ్చే తీరుతీరు వేణీ బంధాలు గాథా సప్తశతిలో వర్ణింపబడిన అంగరాగములు కాంతా కల్యాణం పుత్రకామేష్టి పాటల్లోని వర్ణనలతో పోల్చిచూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. నాటి స్త్రీ పురుషుల వేషభూషణా లేతీరుగా ఉండేవో జానపదవిజ్ఞానం తెలుపుతుంది. పల్నాటివీర చరిత్రలో నలగామరాజు—

"భుజియించిన తరువాత పునుగుజవ్వాది
కస్తూరి రసమును కలిపినయట్టి
శ్రీ చందనము మేన చెలువున బూసి
తగటు కూసంబులు ధరియించి తలకు,
ఒక వింత యుష్ణీష మొప్పుగా గట్టి
నవ రత్నమాల కంఠంబున వ్రేల

డంబుగా కర్ణకుండలములు మెరయ
భుజకీర్తులనియెడు భూషలు దాల్చి
మేనికి రక్షయై మించు తాయెతులు
దండచేతుల రెంట ధారణ చేసి
మురుగులు గొలుసులు ముంజేతులందు
శిరముగా వ్రేళ్ళ ముద్రికలను బెట్టి
బంగారు దుప్పటి పైనను గట్టి
పావుకోళ్ళను రెండు పదముల దొడిగి''

కొలువుకూటానికి వచ్చినాడు. చెలికత్తెలు మాంచాలను ఏ విధంగా అలంకరించినారో గమనించండి—

"దీర్ఘమై నునుపులై తీరైన కురుల
కూర్చి నున్నగ దువ్వి కొప్పుగీలించి
బంగారు పూచేర్లు బాగుగా జుట్టి
మదనకుంతమునకు సమంపు పాపటను
మణిహేమ మౌక్తిక మండితంబైన
చేర్చుక్క చేరిచి చిత్రంబుగాను
పొలుపొంద శశిరవిభూషణ యుగము
పాపట కిరువంక భాసిల్ల నిలిపి
మాణిక్యహాటకమయ బింబమొకటి
తలవెన్క మెరయంగ దట్టించిరెలమి"

ఇంకా కస్తూరీతిలకందిద్ది, ముక్కుకు ముత్యంపు ముంగరబెట్టి, గండ భాగముల కస్తూరికామకరికా పత్రాలు వ్రాసి చెవులకు—

''తాటంక భూషణ ద్వయము గీలించి
ముత్యాల కుచ్చులు మునుకొని వ్రేలు
బవిరెలు కుంపెండ్లు పసమీర బెట్టి

కర్ణాగ్రదేశముల్ కాంతులనీన
కుప్పెంల ముత్యాల కుచ్చుల రెండు
ఘన కుంతలంబుల గదియించి మరియు"

మేనికి కాశ్మీర కర్పూర కస్తూరులు కలిపిన మలయంజం అలది, బంగారు పూల పట్టు కంచుకం తొడిగి, దూముడి వేసి, ముత్యాలు రత్నాల పేర్లు, పతకాలు, బన్న సరాలు వక్షమున గీలించి, గళమున ముత్యాల పట్టెడ నలంకరించి, చేతులకు అంగదములు, దండకడియములు, దంట తాయెతులు కట్టి, మనికట్టు నెగువ నీలాల గాజులు తొడిగి, పచ్చల కంకణాలు దామల కడియాలు సంధింపజేసి, చేకట్లు తొడిగి, మాణిక్య తపనీయ మంజులోర్మికల నంగుళులకమర్చి, పాపట సవరించి, బంగారు తగటు ముయ్యంచు చేలము కటి యందు సంధించి, గజ్జెలు వ్రేలాడే తపనీయ కాంచిని ధట్టించి ముడిచి, అందెలు గొలుసులు భర్మవినిర్మిత బహువిధ దీప్త భూషణంబులు కాళ్ళకు కాలివ్రేళ్లకు పెట్టి, పాదాలకు లత్తుక రాచి, కండ్లకు కాటుకబెట్టి అలంకరించినారట.

కాటమరాజుకథలో చల్లపిన్నయ్య మొదలైనవారు—

"కానెలు బిగియించి గంధంబు పూసి
రాళ్ళు దాపినయట్టి రాకట్లు దాల్చి
ముత్యాల హారముల్ మురియుచు వేసి
చౌకట్లు కర్ణముల చయ్యనదొడిగి
దేదీప్యముగ వెల్గు దివ్యాంబరములు
నవరత్న భూషణములును దాల్చి
కడు సూర్యకాటార్ల ఘనముగా బూని
మహదేవ హరాహరా మహదేవ యనుచు"

యుద్ధభూమికి పోయినారట. అలుతమరాజు—

"వజ్రాంగి దొడిగెను వల్లవుల రాజు
వింతగా శిరమందు వీర జడయల్లి

విరజాజులను తురిమి వేడుకమీర
పరగ మాణిక్యాల పతకంబు దాల్చి
పచ్చల కడియముల్ పసిడుంగరములు
మెచ్చయిన నేవళము మెడనూలు వేసి
యదపకాడంతట ఆకు చుట్టీయ" బయలుదేరెను.

ఎఱ్ఱయ్య వీర వేషమీ తీరుగా ఉన్నది.

"అప్పుడు కట్టిరి హనుమంతు కాసె
వీరులై తలకురుల్ వీర జల్లి
విరజాజులను అతి వేగధరియించె".

కతియావులన్న

"ధీరుడై నెలవంక తిరుమణి దిద్ది
కరముల చేమపూ కడియముల్ బెట్టి
మేలైన రత్నాల మెడనూలు వేసి
డాకాలి పెండెంబు ధరియించినంత
బిరుదులు ధరియించి పరువడి వచ్చి
నలబై మూళ్ళదట్టి నడుమునకు గట్టి
వనలైన చెంగావి వలిపంబు గట్టి" బయలుదేరినాడట

నల్లసిద్ధి మీదికి యుద్ధానికి పోయే నలనన్న యెఱ్ఱయ్యలు-

"కట్టిరి హనుమంతు కాసెలు వేగ
హనుమంత కాసెపై రేమంతముండ్లు,
చేమంతి బంతులు చెలగుచు వేసి
కనక వడ్డాణంబు కట్టిరి మీద

మేలు తుమ్మెద రెక్క మీరినవన్నె
సంపంగి నూనె వంపించి కురులు,
వీరజడలల్లిరి వేడుక పడుచు
ముడిచిరి గేదగుల్ ముంచుకొని యుండ
ఫాలమున కస్తూరి బాగుగా దిద్ది
పచ్చల పులిగోరు పతకముల్ దాల్చి
సన్నపు రుద్రాక్ష సరులు ధరించి
వన్నెగా బిరుదులు వరుస ధరించి" నారట.

ఇవన్నీ రాజుల వేషభూషణాలు. ఇక సామాన్యులైన గోసంగి వీరుల వేషభూషణాలు గమనించండి.

"అమరంగ గోసంగులందరు నపుడు
తమ బిరుదులన్నియు ధరియించిరంత
కొమరొప్పగా నంత క్రొత్త చల్లడము
కమనీయమగు చంద్రకావి ధట్టీలు
పులితోలు బిరుదులు పూని కాసెలును
చెలువైన సరిపెనల్ చెంపగంధాలు
గాటంపు టరిగెలు గంట గాలమును
పిసైన కుడిసిగలు నిలువు నామములు
సిగల పువ్వుల చెండ్లు సింహపరిగెలును
వొకకాల వొరలేటి వొరగు రుమాళ్ళు
ఒరలు గోసిన కత్తులొనర జేపట్టి
కిరుచు చేకత్తులు గిరుగంధాలు
పొగడ పచ్చల పేర్లు బేజు బందువులు
తగిన గవ్వలపేర్లు దండ కడియాలు

వెలుగు తలాటములు వేడ్క భుజములను
నెలుగు చర్మంబులు నెన్నగా కటిని
నెడపగ బిరుదులన్నియు సవరించి
యెడమ చేతను కొమ్ము యిరవొక్కవేరు.
కోపంపు చూపును కోర మీసమును
దాపిన నవరత్న దండ కడియములు
వాలుకత్తులు సన్నవలిపె దుప్పట్లు
చెలువొప్ప సవరించి చెలగు తప్పెట్లు
అప్పుడు మ్రోయింప నగుభుగుల్ గాను
తప్పెట ధ్వనులకు తాళమానముల
నడుగుల చిందుల నాడేటి వారు
నాడుచో బాడుచు హరిహరాదులను
వినయాన గంతులు వేసేటి వారు
ఘనమైన సింహంబు గ్రచ్చుటరిగెలను
మొలకత్తి జళిపించి మురిసేటి వారు
నలకత్తులను ద్రిప్పి యంత మెరవళ్ల
నడ్డ బెళుకులతోడ నట వచ్చువారు
గడలను ద్రిప్పుచు కరులకై వడిని
మత్తుగా వచ్చుచు మరి మసలువారు
మొత్తమై గుమిగూడి ముందర నడిచి"రి.

"శాంత గోవింద నామా"లనే పాటలో శాంతను తన కుమారుడైన ఋశ్యశృంగునికి వివాహం చేసుకొనబోయే ముందు మాండవ్యఋషి కోడలికివ్వటానికి కట్నా లేమున్నాయని భార్యనడిగితే ఆమె—

"మొన్న ప్రొద్దుటివేళ, మూసివాయనంలోవి
మెట్టెలు పూత్రంబు, నా దగ్గరున్నవి
నాతికి పెడుతాను, గుండు ముత్యపునత్తు
కూతురు వద్దనుండె, అది పట్టుకవచ్చి

"కథలు చెప్పదాయె కబురులాడదాయె, కొంతలతో గూడదాయె
కుందెనగిరి యాడదు గుప్పచ్చియాడదు, గుడిగుడి గుంచెమైన
దాగుడు మూతలాడదు ఊగుటుయ్యేలాడదు, దాటుబిళ్లాడదాయె
నన్ను ముట్టుకోకు నామాలకాకియను, కన్నె యటాడదాయె
నెత్తనరాళ్లాడదు హత్తి చేతులు వేసి, కత్తి బద్దాటడదూ
వామనగుంటలూ పాచికలాటలూ, వాలలాడదు వరుసతో
బంతులాడదు పరచజల్లినయట్టి, చింతగింజా లాడదూ
బొమ్మలాటాడదూ బూజమాటాడదూ, విమ్మ లాటల నాడదూ
నాయప్ప నావలము నాకు నెమ్మలు నాట, నయముతో తానాడదూ
వానవాన వల్లప్ప వాకిలి దిరుగు చెల్లప్ప, వరసాటలాడదెపుడూ
చల్లోయమ్మ చల్లయని స్తంభముల్పట్టుకొని, గొల్లాటలాడదెపుడూ
వెన్నెలొత్తాడదూ వెలదులను గూడుకొని, వెపదుద్దుకదురాడదూ
కాళ్ళగజ్జియనుచు కంకాళమో యనుచు, కాంతతానాడదాయె
వేగులచుక్కోయని వెలగ మొగ్గోయని, వెలది తానాడదాయె
దోపిడి పుల్లయని దొంగాడి పుల్లయని, తొయ్యలి తానాడదూ
చిన్నచిన్నతొ గద్దు సింగార గొరెంత, గద్దు తాళెబే కెంతగద్దు
తామర మొగ్గల్లో యనుచు తద్దాటలాడదు, తరుణి బిల్లాటాడదు
చెమ్మచెక్కయని చారదేసి బుక్కయని, సఖియ తానాడదాయె
అట్లు పొయ్యంగనవి అరగించంగనవి, అతివ తా నాడదాయె
దాచుకో మూచుకో సంబారు బుడ్డియని, తరుణి తొడబంతాడదూ"

ఇక మగపిల్లలు ఆడుకొనే ఆటలు చిల్లగోనె, బొంగరాలాట, గోలీలు కోతి కొమ్మచ్చి, ఉప్పన బట్టెలు, చెడుగుడు, తొక్కుడుబిళ్ల, పరుగుపందెములు, పెద్ద వాళ్లు ఆడుకునే పచ్చీసు, పులి జూదం, చదరంగం, మేకలాట మొదలైనవి ఎన్నో ఉన్నవి.

ఈ విధంగా తెలుగుజాతి సంస్కృతికి, సాంఘిక జీవితానికి, సంబంధించిన వివిధాంశాలు మన జానపద విజ్ఞానంలో ప్రతిఫలిస్తున్నవి. ఈ విధంగా మనిషికి మనిషికి మధ్యన, మనిషికీ దేవునికీ మధ్యన, ఉండవలసిన అనుబంధమునూ సమాజసుస్థితికి అవసరమైన భయము భక్తి వైరాగ్యము ధర్మవీరము మొదలైన గుణాలను ప్రబోధిస్తూ మన జానపద విజ్ఞానం తొంబది శాతం జనానికి జీవితయాత్రలో పాథేయమునూ పరమార్థమునూ ప్రసాదిస్తున్నది.

-: o :——

''పని చేయడమే మన బాధ్యత
దాని పరిపూర్ణత మన చేతిలో లేదు''

యూదుల ధర్మశాస్త్ర ప్రాథమిక నిబంధన

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో భారతదేశంలో వికాసయుగం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఆధునిక యూరోపుకు పద్దెనిమిదో శతాబ్దం ఎటువంటిదో, ఆధునిక భారత దేశానికి పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థం అటువంటిది. ఫ్రాన్సుదేశంలో వోల్టైర్, రూసో, మాంటెస్క్యూ, ఇంకా విజ్ఞాన సర్వస్వ నిర్మాతలు సమాజవికాస జాగృతికి నారుపోసి నీరు పోసినకాలమది. ఫ్రెంచివిప్లవానికి వారి ప్రయత్నాలే దోహదం చేశాయి. జనావళిలో హేతువాదం తలయెత్తి స్వేచ్ఛాస్వాతంత్ర్య సమానత్వమనే త్రితయభావనా సంపుటి ప్రచారానికి అది దారితీసింది దీని ఆధారంగానే ఫ్రెంచి విప్లవం ప్రభవించింది. ఇంచుమించు ఒక శతాబ్ది తర్వాత భారతదేశంలోని విద్యాధికవర్గం వారి ఆలోచనా ధోరణిని హెర్బర్ట్ స్పెన్సర్, థామస్ హక్స్లే వంటి విజ్ఞానవేత్తల నవ్యభావ బీజావాపం ప్రభావితం చేసింది భారతీయుల రాజకీయభావాలుకూడా ఇంగ్లీషు వారి తాత్త్వికచింతనను ప్రతిపాదించే ఉద్గ్రంథాలనుంచి ముఖ్యంగా మిల్ రచించిన ఉదారవాదం, మోర్లే ప్రతిపాదించిన సామరస్యభూమికలద్వారా ప్రభావితమైనాయి. భారత జాతీయకాంగ్రెస్ ప్రాదుర్భావకాలమది.

భారతీయ ఆధునిక భావజగత్తు స్వరూపావగాహనకోసం- ఇప్పుడు మన భావన పొందుతున్నవిధంగా- చరిత్రలో మనం కొంచెం వెనక్కువెళ్ళి పరిశీలించాలి. ఈ అడుగుజాడలు పద్దెనిమిదో శతాబ్ది చివరిదశకంనుంచి పందొమ్మిదో శతాబ్ది మొదటి దశాబ్దాల వరకు మనకు కనిపిస్తాయి ఈ విషయం గురించి సాకల్యంగా తెలుసుకోవాలంటే భారతదేశమత ఆధ్యాత్మిక సాంస్కృ

తిక భూమికను మనం పూర్తిగా పరిహరించకూడదు. కేవలం రాజకీయ, ఆర్థిక దృక్పథంతోనే పరిశీలించేట్లయితే దాని తత్త్వం మనకు పూర్తిగా బోధపడదు. అంతేకాదు, ఆ కాలంలో కొందరు మహనీయులు సాగించిన కృషిని కూడా మనం తక్కువ అంచనా వేయలేము. వారు తమ సమకాలికులను, అనుయాయులను ప్రగాఢమైన తమ వ్యక్తిత్వమును వారిపైబరపి ఆయావ్యక్తుల జీవితాలను ఎంతగానో ప్రభావితంచేశారు. ఆకాలంలో ప్రదర్శితమైన ఉపజ్ఞా సహితమైన చింతన, సాంఘికమైన కృషి ఎందరో మహనీయుల పూనికయొక్క సమాహారఫలితం. వాళ్ళు త్యాగశీలురైన చింతనశీలురు. వాళ్లు త్రికరణశుద్ధితో, పరోపకారకారుణికత్వంతో, దృఢవిశ్వాసంతో, మొక్కవోని ధైర్యంతో తమ కృషి సాగించారు. దీనులపట్ల కరుణతో, తాము నమ్మినదానిని ఏ పరిస్థితుల్లోనూ విడవకుండా ఆచరణాత్మకమైన పూనిక వహించారు. ఈ శ్రేణిలో మొదటి మహాపురుషుడు రాజారామ మోహనరాయలు. బ్రహ్మసమాజ స్థాపకుడాయన. ఈ మహానుభావుణ్ణి "సత్యాన్వేషణ తత్పరతలో కొత్త ఖండాన్ని కనిపెట్టిన భారతదేశపు కొలంబస్" అనీ "నవభారత పిత" అనీ కీర్తించడం అతిశయోక్తి కాదు

బ్రహ్మసమాజ బోధలలో ఏకేశ్వరారాధనమే ప్రధాన ప్రాతిపదిక సూత్రమైనప్పటికీ రామమోహనరాయలవారి దూరదృష్టివల్ల ప్రజాసామాన్యంలో ముఖ్యంగా విద్యావంతులలో ఉన్నతాశయ ప్రాతిపదికమైన సాంఘిక దృక్పథాన్ని అలవరించడానికికూడా బ్రహ్మసమాజం పూనిక వహించింది. అమానుషసాంఘిక దురాచారమైన 'సతి'ని రూపుమాపడంలో రామమోహన్‌రాయలవారి పాత్ర అందరూ ఎరిగినదే. ఆకాలపు హిందూసమాజపు అగ్రవర్ణవర్గాలలో ఈ దురాచారం పాటించబడుతూ ఉండేది. రాజారామమోహనరాయలవారు సాధించిన ఘనకార్యాలలో అత్యంతప్రధానమైనది ఈ సంస్కరణమే అయినా, భారతీయ సామాజిక సంస్కరణపథంలో ప్రధానఘట్టమైన మైలురాయి ఇదే అయినా, ఆ మహాత్ముడు సాగించిన సంపూర్ణ సామాజిక కృషిలో ఇది ప్రముఖమట్టమేకాని ఆయన సమగ్రకీర్తిమూర్తికి ఇది మాత్రమే ఆధారంకాదు ఎన్నో ఘనకార్యాలు సాధించాడాయన. ఆయన సాంఘికాదర్శం సువిశాలమైనది సర్వసమగ్రమైనది. విద్యావివేకాల లాభాలను సంఘంలో వ్యాప్తినొందించాలని, అజ్ఞానాన్ని, మూఢవిశ్వాసాలను అంతమొందించాలని, దురభిమానాన్ని, మతతత్పరత దురహంకా

రాన్ని రూపుమాపాలని, మేధావులస్థాయి నింకా పెంచాలని, కాలదోషంపట్టిన నైతికసిద్ధాంతాల, ప్రమాణాల,దోషాలను సరిదిద్దాలని, గతకాలిక అంధవిశ్వాసాలు తొలగించాలని, సంఘాన్ని కలుషాలనుంచి క్షాళనంచేయాలని, వసుధైక కుటుంబాదర్శంతోకూడిన ఉదారదృక్పథాన్ని, ఆచరణాత్మకమైన ఉపకారబుద్ధిని మానవాళిలో పెంపొందించాలని రామమోహనరాయలు ఎంతగానో కృషిచేశారు.

బ్రహ్మసమాజ తాత్త్వికవికాసనాన్ని ఋషికల్పులైన మువ్వురు మహనీయుల ఆధ్యాత్మికదర్శనంపట్ల ఎంతగానో ప్రభావితం చేసింది. సంస్థాపన నిర్మాత అయిన రామోహనరాయలు ఈముగ్గురిలో ఆద్యులు. ఏకేశ్వరారాధనం పట్ల ఆయనకు ప్రత్యయం కలగడానికి చిన్ననాడాయన అధ్యయనం చేసిన ఇస్లాంమతధర్మాలుకూడా కొంతవరకు దోహదం చేసినట్లనిపిస్తుంది. రామానంద చటర్జీ (మోడరన్ రివ్యూ సంపాదకులు) చెప్పినట్లు "హైందవదర్శన శాస్త్రం బ్రహ్మజ్ఞానమూ, ఇస్లాం ఏకేశ్వరతత్త్వమూ ఆయనను తీర్చిదిద్దాయి" రెండో వారు మహర్షి దేవేంద్రనాథ ఠాగూర్ ఈయన "లౌకికాం హసాదువు". సర్వోపనిషద్ సముద్ధృత సారాంశంగా చెప్పదగిన ఈశావాస్యంలోని "ఈశావాస్యమిదం సర్వం" (ఈశ్వరుడు అంతటా ఆవరించి ఉన్నాడు) అనే భావంచేత దేవేంద్రనాథుడు ప్రభావితుడైనాడు మూడోమహనీయుడు కేశవచంద్రసేన్. బ్రహ్మవిజ్ఞాన సంగమవాహినికి మరో విజ్ఞానస్రోతస్విని చేర్చాడు కేశవ చంద్రులు. బ్రాహ్మసమాజాన్ని "సమస్తమానవాళి సౌదర్యక్షేత్రంగా" అభివర్ణిస్తూ క్రైస్తవమత ప్రాతిపదిక భావభూమికైన "సర్వలోకేశ్వరుని పితృభావము, సమస్తమానవాళి సోదరభావమూ" అనే సూత్రాలతో బ్రాహ్మధర్మాన్ని సమన్వయింపచేశాడు ఈవిధంగా బ్రాహ్మసమాజ దర్శనంలో రమణీయమైన, ఆనందప్రదమైన ఒక సంయోగంద్వారా (ఇది రాసాయనిక సంయోగంకాని; భౌతికసంయోగం కాదు) హిందూ, ఇస్లాం, క్రైస్తవ మౌలిక విశ్వాసాల సంయోజనం కనపడుతుంది అందువల్లనే రామమోహనరాయలుగారు విశ్వమత తులనాత్మక విజ్ఞానశాస్త్రీయాధ్యయనాన్ని చిత్తశుద్ధితో ప్రారంభించిన మహనీయుడిగా కీర్తితుడైనాడు వాస్తవానికి ఆ మహానుభావుడు ఏదో ఒకనాటికి సమస్తమానవాళి అనుసరించవలసిన విశ్వమానవమత ప్రాతిపదికను భావించగలిగాడు కూడాను. అయితే ఈ భావభూమిక ఆయన జీవితకాలంలో కార్య

రూపం ధరించలేదు. రామమోహనరాయలవారి ఆధ్యాత్మిక దృక్పథానికి అత్యంత బలమైన సాంఘిక దృక్పథంకూడా తోడైంది. భారతీయ సామాజికవ్యవస్థపైన వంగదేశంలో మాత్రమేకాకుండా యావద్భారత దేశంలోనూ రామమోహనుని సాంఘికోద్యమ ప్రభావం గాఢంగా ప్రసరించింది. ప్రాక్పశ్చిమభావధోరణులను ప్రజ్ఞాసహితంగా సమ్మిళితంచేసి సాంఘికాభ్యుదయధ్యేయంగా వ్యక్తివికాస పరిపూర్ణతను ఆయన లక్ష్యీకరించారు.

డా॥ బ్రజేంద్రనాథ్ సేన్ మహాశయుని విజ్ఞతాయుతమైన మాటలలో వివరించాలంటే

"ప్రాచ్యదేశ సాంఘికవ్యవస్థలో వ్యక్తికన్నా సమష్టికే అధికత అయితే పరమార్థసాధనలో వ్యక్తి సాంఘిక బంధాలకతీతుడు పాశ్చాత్య వ్యవస్థాత్మకమైన సామాజిక రాజ్యాంగంలో వ్యక్తిప్రయోజనమే ముఖ్యం. భగవద్రాజ్యంలో అంటే మతవిశ్వాసపరిధిలో సాంఘిక క్షేమదృష్టికి ప్రాధాన్యం రామమోహన రాయలవారు సాంఘికాభ్యుదయానికి వ్యక్తిపరిపూర్ణవికాసమే కొలబద్ద అని భావించారు. అయితే వ్యక్తిస్వేచ్ఛ, వికాసాలు సాంఘికోన్నతి. అభ్యుదయ గతి అనే పథగమనోన్ముఖంగా సాగాలి ఆ పరిస్థితులకు దోహదంచేయాలి"

పంజాబులో ఆర్యసమాజం పతాకంకింద వేదాల పరమప్రామాణ్యం, ఆధికారిక ప్రాభవం లక్ష్యంగా ఆధ్యాత్మిక సాంస్కృతికోద్యమం ఒకటి బయలు దేరింది. అయితే వ్యక్తి యొక్క సామాజిక బాధ్యతను కూడా ఈ ఉద్యమం అనుశాసించింది. మహారాష్ట్రంలో ఈ సామాజిక చైతన్యోద్భోధం భక్తి ఉద్యమ రూపంగా విస్తరించింది. (నామ్‌దేవ్, తుకారామ్, రామదాసస్వాములు భక్తి సంప్రదాయపంథాను పరిపుష్టంచేశారు.) పంతొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో ఈ భక్తి ఉద్యమం సంఘ సంస్కరణోద్యమంగా కూడా బయపడింది విశాలమైన హైందవమత సంప్రదాయశాఖగా ప్రార్థన సమాజం పేరున మహదేవ గోవింద రానడే దేశికత్వంలో ఈ సాంఘిక సంస్కరణ కార్యక్రమం రూపొందింది. దక్షిణ భారతదేశంలో స్థూలంగా ఆంధ్రదేశంలో ప్రత్యేకించిన్నీ ఈ సాంఘిక నవావతరణ చైతన్యోద్యమం వీరేశలింగంపంతులు నిర్వహించిన వివిధ ఉద్యమాల రూపంలో ఆవిష్కృతమైంది. వీరేశలింగం సాగించిన తీవ్రమైన సంస్కర

జోద్యమాలు ఆయన గొప్పనూత్నమత ప్రబోధకుడిగా తెలుగుదేశాన్ని ఆవేశింప చేశాయి

కందుకూరి వీరేశలింగం పంతులు రాజమహేంద్రవరంలో 1848వ సంవత్సరం ఏప్రియల్ 1 వ తేదిన జన్మించారు. 1919 మేనెల 27వ తేదిన డెబ్బైయొక్క ఏళ్ళవయసున పరమపదించారు. (బైబిల్‌లో చెప్పిన సప్తదశక పూర్ణపురుషాయుర్దాయానికి ఉదాహరణంగా) ఉపాధ్యాయుడిగా ఆయన జీవితం ప్రారంభించారు. ఉపాధ్యాయుడిగానే పదవీ విరమణచేశారు ఆయన జీవికా వృత్తిలో మరేమార్పులేదు ఏవృత్తిలో ప్రవేశించారో కడమవరకు దానినే నిర్వహించారు మద్రాసులోని ప్రెసిడెన్సీ కళాశాలసీనియర్ తెలుగు పండితుడిగా ఆయన పదవీ విరమణ చేశారు. పేరుప్రఖ్యాతులు పొందిన పత్రికా సంపాదకుడాయన. కొన్ని పత్రికలు స్వయంగా నిర్వహించారు ఆనాటి బ్రిటిష ప్రభుత్వం వీరేశలింగాన్నిరావు బహదర్ బిరుదంతో సత్కరించినా ఆయన ఆర్థిక స్థితిగతులలో చెప్పాల్సిన మార్పులేదు. ఏనాడూ మూడంకెలజీతం ఆయన తీసుకోలేదు అతి సామాన్యమైన ఆర్థిక అంతస్తు పంతులుగారిది. రాబడిన్నీ ఆయన ఆర్థిక వనరులున్నూ అంతంత మాత్రమే. దేహదార్ఢ్యం చూదామా అంటే చాలా బలహీనమైన శరీరారోగ్యమే ఆయనకు మొదటి నుంచిన్నీ ఉబ్బసంతో ఆయన తరచు సతమతమవుతూ ఉండేవారు. అయితే ఇన్ని ఘనకార్యాలు పంతులుగారెట్లా సాధించగలిగారు ? అందునా బలవత్తరమైన విరోధివర్గమూ స్వప్రయోజన పరాయణమైన, స్వార్థాహంకార పూరితమైన ప్రతిపక్షమూ అడుగడుగునా పంతులుగారిని సాధించినా బాధించినా ఆయనజంకలేదు. పూనినమహత్కార్యాలనుంచి వెనుకంజవేయలేదు అయితే మరి ఆయనకు అండదండలుగా ఎవరున్నారు? సహాయ సహకారాలందించిన శక్తులేవి? ఆ పరిస్థితులెటువంటివి ? మొట్టమొదటగా పేర్కొనవలసింది ఆయనలోని అచంచలమైన సాహసం. వెనుకంజవేయడమంటూలేని పట్టుదల వీరేశలింగంలోని ధార్మికాగ్రహం, తానుపూనినపని న్యాయం, ధర్మమన్న విశ్వాసం, త్రికరణశుద్ధి, ఆయన ఇన్ని ఘనకార్యాలు చేయటానికి ప్రేరకాలు దైవంపట్ల, సర్వకారుణ్య పరిపూర్ణుడైన ఆయన కటాక్షంపట్ల మొట్టమొదటనుంచిన్నీ వీరేశలింగానికి చెక్కుచెదరని విశ్వాసం సృష్టికర్త దృష్టిలో అందరూ సర్వసమానులే అయినప్పటికీ

ఇన్ని అన్యాయాలు ఇన్ని అసమానతలు మానవ సమాజంలో ఉండటానికి వీల్లేదని ఆయన వాదన. బడిపంతులుగా పత్రికా సంపాదకుడిగా తన సాంఘిక బాధ్యతను ఒకేదృక్కోణంతో నిర్వర్తించారు పంతులుగారు సాంఘిక సమస్య లన్నిటపట్లా ఆయన మౌలిక దృక్పథంలో తేడాలేదు ప్రగతి పథ గమనంలో హేతువాదం, లోకజ్ఞత, కేతనంగా దారిదివ్వెగా ఆయన సాగారు ఏ విషయా న్నైనా నమ్మినప్పుడు బాహాటంగా దానిని ప్రకటించటానికాయన ఏనాడూ వెనకాడలేదు. ఏది విశ్వసించాడో అదే చెప్పాడు ఏది చెప్పాడో అదే చేసి చూపాడు దీనికి వ్యతిక్రమం ఆయన జీవితంలో ఏనాడూ చోటు చేసుకోలేదు ఆయన కనపరచిన త్రికరణశుద్ధి అనుపమానం. పంతులుగారి వ్యక్తిత్వానికది ఒక గొప్పవన్నె చేకూర్చింది

రాజమహేంద్రవరంలోనే సంఘ సంస్కారోత్సాహం, చిత్తశుద్ధిగల మిత్రులు కొందరితో కలిసి (బసవరాజుగవర్రాజు, చల్లపల్లి బాపయ్య పంతులు మొ॥వారు) వీరేశలింగం బ్రాహ్మ సమాజ ప్రతిష్ఠాపకుడైన రామమోహన్‌రాయల వారి ప్రబోధాలచే ప్రభావితుడైనాడు ఈశ్వరచంద్ర విద్యాసాగరులవంటి సాహసోద్యమ సంస్కర్తలవల్ల స్ఫూర్తి పొందాడు. 1876వ సంవత్సరంలో యువ మిత్రులు కొందరు కలిసి రాజమండ్రిలో సంఘ సంస్కరణ సమాజం స్థాపించారు. ఆ తర్వాత కొద్దికాలంలోనే ఈ మిత్రమండలి వీరేశలింగం ఇంట్లోనే ప్రార్థనా సమాజం కూడా ప్రారంభించారు ఈ సమాజ సభ్యులు వారంవారం సమావేశమవుతూ ఉండే వాళ్ల నియతోపన్యాసకుడు వీరేశలింగమే. పరిశుద్ధాస్తిక మతాన్ని గూర్చి వ్యక్తిగత జీవితంలో నీతివర్తన ప్రాధాన్యం గురించీ వీరేశలింగం ప్రార్థన సమాజ సభ్యులను ఉద్బోధిస్తూ ఉండేవాడు తరవాత తరవాత స్త్రీలు, పురుషులు ఇతరులు కూడా ప్రార్థిన సమావేశాలకు వచ్చిలబ్ధి పొందారు.

సంఘ సంస్కారోద్యమ ప్రారంభదశలో వీరేశలింగమూ ఆయన యువ మిత్రులూ కూడా సంఘంలో ప్రచురంగా ఉన్న చిన్న చిన్న లోపాలను సరిదిద్దాలని నిశ్చయించుకున్నారు. యుక్తవయస్సు వచ్చిన తర్వాతనే ఆడపిల్లలకు పెళ్ళిళ్లు [illegible], సంఘంలోని పైవర్ణం వారిలో శాఖాంతర భోజన భాజనాలు, వివాహాలు,

శవస-సంస్కారంలో పాటించాల్సిన పద్ధతులు మొదలైనవాటికోసం కృషి జరిగింది. కాని వాళ్ళకంత ప్రోత్సాహకరమైన ఫలితాలు కన్పించలేదు

ఆగతికలైన తరుణవితంతువుల పునర్వివాహ సంస్కరణం ఆయన మనసులో బలపడుతూనే ఉన్నా తన బాల్యమిత్రుడు చల్లపల్లి బాపయ్యపంతులు గట్టిగా ప్రోత్సహించినదాకా ఆ విషయమై ఆయన పూనుకోలేదు. ఆనాటిస్థానిక పరిస్థితులన్నీ ఆయన అప్పుడు అంచనా వేసి చూసుకున్నారు.

అది 1879 ప్రాంతం ప్రథమంగా వంగదేశంలో, ఆమాటకువస్తే భారత దేశంలోనే అది ప్రథమ సంఘటనమై ఉంటుంది (856వ సంవత్సరం వితంతు వివాహచట్టం అమలులోకివచ్చింది) 1856వ సంవత్సరంలో ఈశ్వరచంద్ర విద్యా సాగరులవారు వితంతు వివాహం నిర్వహించారు ఆకాలంలోనూ అటుతర్వాత అనేకదశాబ్దాలవరకున్నూ భారతదేశ సాంఘిక రాజకీయచైతన్యోద్యమాలకు వంగ దేశమే మార్గదర్శకత్వం వహించి అగ్రగామిఅయివుంటూ వచ్చింది అయితేవిద్యా సాగరపండితులు ఈసమస్యపై రచించిన గ్రంథాలేవి వీరేశలింగానికానాడు లభ్యం కావడం అటుతర్వాత చాలా కాలానికిగాని అవి ఆయనచూడటం తటస్థించలేదు. కాని మహామహోపాధ్యాయ పరవస్తు వెంకటరంగాచార్యులయ్యవారగలు రచించిన స్త్రీ పునర్వివాహసంగ్రహమనేకరపత్రం వంటి చిన్నపుస్తకం వీరేశలింగానికిలభించింది. వెంకటరంగాచార్యులవారు గొప్పపండితుడు. స్త్రీపునర్వివాహం శాస్త్రవిరుద్ధం కాదని శ్రుతి స్మృతి పురాణ విహితమేననీ ఆయన వాదించి అందులో సాధించాడు.

ఈసంగ్రహంలోని ఆధారాలు, ఉపపత్తులు అన్నిబాగా ఉపయోగించుకోవ టమే కాకుండా మను, యాజ్ఞవల్క్య, పరాశరస్మృతులనుంచి కూడా ఉపబలకంగా సాధనసంపత్తి చేకూర్చుకున్నాడు వీరేశలింగం అంతేకాదు వాదవివాదాలు ఎదుర్కోవటంలో ప్రావీణ్యం ఉన్నవాడాయన తర్కించడంలో సహజ ప్రతిభా శాలి చిరకాలాగతమైన సంప్రదాయంపట్ల విశ్వాసంగలవారిని నొప్పించకుండా వారినికూడా ఒప్పింపచేయడానికే ఆయన ప్రయత్నించాడు. ఆ ఉద్దేశంతోనే వేదేతి హాస పురాణాలు, స్మృతులనుంచి ప్రమాణాలయన సేకరించాడు విద్యారణ్యా దుల వేద భాష్యంనుంచికూడా తనపక్షానికి వాదానుకూలమైన అంశాలు సంగ్రహిం

చుకున్నాడు వీరేశలింగం పురాణాలనుంచి సాక్ష్యంగా ఉలూచి అర్జునుణ్ణి వివాహ మాడిన ఘట్టం ఆయన ఉదాహరించి చూపాడు కాబట్టిపూర్వాచారసమ్మతమే వితంతు వివాహమని వీరేశలింగంవాదన అంతేకాని సంప్రదాయపరుల విశ్వాసాలను బదా బదలు చేసి వాళ్ళను నొప్పించాలనుకోలేదు నెమ్మదిగా, శాంతంగా, నాగరకంగా హితోక్తులద్వారా వాళ్ళమనఃపరివర్తనం సాధించాలని ఆయన తలపోశాడు. అప్రియ మైనా, హితంగానే వాళ్ళకు బోధించివాళ్ళచేత అంగీకరింప చేయాలన్నదే ఆయన తాపత్రయం. కార్యసాధకుల మేధావిత ఇటువంటి సందర్భాలలోనే గమనకువస్తుంది వీరేశలింగానిది చాలా పట్టుదల స్వభావం అనుకున్నది సాధించేవరకూ ప్రయ త్నాన్ని విడిచిపెట్టని తత్త్వం. ఈవిధంగా అప్పుడు పూర్తిగా వీరేశలింగం గ్రంధస్థాధారాలు ప్రమాణాలు మాత్రమే దృష్టిలో పెట్టుకొన్నాడనుకోవటం పొర పాటు వాస్తవంగా నీతి, న్యాయం సమానత్వం మానవత్వపు విలువలు ఆయన సాంఘిక సంస్కరణోద్యమానికి మౌలికమైన ప్రేరకశక్తులు

సంప్రదాయవర్గంవారు అంత సులభంగా మనఃపరివర్తనకు లోనవుతారా? వీరేశలింగం తలపెట్టిన ఈసంస్కరణ ప్రయత్నంద్వారా బాలవితంతువుల తల్లి దండ్రులకుమాత్రం ఆశారేఖ తళుక్కున మనోవీధిలో మెరిసింది. అవాచ్యమూ, అత్యంత ప్రతిషేధమూ అయిన విషయాన్ని ఊహలోకికూడా రానివటానికి వీలు లేని దాన్ని బాహాటమైన చర్చకు స్వీకరించి విప్పరేపాడు వీరేశలింగం. రాజ మహేంద్రవరంలోని విద్యార్థిజనత, యువతరం, మరి ఇతర పట్టణాలలోని యువ శక్తి వీరేశలింగానికి తమపూర్తి మద్దతు ప్రకటించటం జరిగింది వాళ్ళు ఆయన పిలుపందుకొని తమచేయూత నివ్వటానికి సర్వసంసిద్ధతను వ్యక్తంచేశారు కాని స్వప్రయోజన పరాయణులు కర్కశ సంప్రదాయ ప్రాతినిధ్య పీఠాధికారులు ఇందుకునేమిరా ఒప్పుకోక పోవటమేకాక వ్యతిరేక సమరానికి మోహరించారు. వీరేశలింగంకూడా సనాతనాచారపరాయణుల ఈసవాలును తనసహజ చైతన్యో త్తేజంతో శక్త్యుద్రేకాలతో స్వీకరించాడు. యువతరం అండదండలు ఆయన కుండనేఉన్నాయి.

రాజమండ్రిలోనేకాదు మద్రాసు రాష్ట్రానికంతకూ మొదటిదైన వితంతు వివాహం ఇంచుమించుగా దక్షిణభారత దేశమంతటికి ఇదేమొదటిది కావచ్చు 1881వ సంవత్సరం డిశంబర్ 11వ తేదీన వీరేశలింగం స్వయంగా నిర్వహిం

డాడు. ఈవివాహవరుడు గోగులపాటి శ్రీరాములు ఆకాలంలో అది ఎంత దుర్ఘట కార్యమో, అసంభవసంభవమో తెలుసుకోవటానికి ఒకేఒక చిన్న అంశం గమనిస్తే చాలు దాదాపు నూటయాభై మైళ్ళ దూరంనుంచి రాత్రి చీకటివేళ మాత్రమే ప్రయాణంచేస్తూ అతిప్రమాదకరమైన అద్భుతమైన పరిస్థితులలో పెళ్ళికూతురును పెళ్ళి ఇంటికి చేర్చవలసి వచ్చిందన్న విషయాన్నిబట్టి అదిఎంతటి సాహసకార్యమో తెలుసుకోవచ్చు అత్యంత విశ్వాసపాత్రులైన ఆయన అనుయాయులు బహు విధేయతతో జాగ్రత్తతో సూక్ష్మబుద్ధితో ఈకార్యాన్ని నిర్వహించారు. క్రి.దటి శతాబ్ది తీరాంధ్రదేశంలో ప్రయాణసౌకర్యాలు తలచుకొంటే ఇది ఎంతటిక్లిష్ట కార్యనిర్వహణమో ఊహించవచ్చు ఈఅనిశ్చిత పరిస్థితులకుతోడు పెళ్ళికొడుకు బంధుబలగమంతా అతణ్ణి ఎట్లానైనా ఈదుర్మార్గ సాహసంనుంచి మరలించాలని సమస్త సాధనాలతో ప్రయత్నించారు. ఆబంధువులంతా వణికి పోయినారు.

తరతరాలుగా సంఘసంస్కరణ ప్రయత్నపరులైన మహనీయులందరి వలెనే గాంధీమహాత్ముడుకూడా ఇందుకు అపవాదంకాదు. వీరేశలింగంకూడా కార్య సాధన తత్పరతకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవాడు తనవిశ్వాసాల విషయంలో చట్టులాగా వేనికీ చలించేవాడుకాడు సంఘసంస్కరణ ప్రయత్నం మెట్టుమెట్టుగా సాగవలసిందేకాని, ఒకేసారి సంపూర్ణంగా సాధ్యమనికాని సాధిస్తానని కానిఆయన అనుకోలేదు ఒకటి తర్వాత ఒకటి సాధించాలి అనుకున్నాడు కులవ్యవస్థనాయన అంగీకరించలేదు. అయితే చిరకాలాగత బంధంవల్ల దానినిపాటిస్తున్న వాళ్లను నిరసించి దానితో తెగతెంపులు చేసుకోలేదాయన కాబట్టే వితంతువివాహం వంటి సంస్కరణను బ్రాహ్మణులు వైశ్యులు మొదలైన పైకులాలవారికి మాత్రమే మొదట ఆయనవర్తింపచేశాడు బహుశా ఆవర్గాల వారిలోనే ఈసంస్కరణ అత్యంతావశ్యకమన్న విషయంకూడా ఆయన్ను ముందుగా ప్రేరేచి ఉండవచ్చు నిర్బంధవైధవ్య క్లేశం,సంఘంలో దిగువకులాలని చెప్పబడేవారిలో ఏనాడూ పాటించబడలేదు సాంఘికమైన సత్తువాట్లు దానికి కావలసిన సాధనోపాయాలు వాళ్లు ఎరుగనివికావు ఈదృష్టితో ఈప్రధానమైన సంఘసంస్కరణ ప్రయత్న సామంజస్యం మనం ఆలోచించకూడదు ప్రశ్నించకూడదు.

కాల ప్రవాహపు ఈ సుదూర తీరాన నిలిచిన మనం ఆనాటి సాంఘిక స్థితి గతులను అవగతం చేసుకొని ఆయన ప్రయత్న పరతను అంచనా వేయ

వలసి ఉంటుంది. ఇంతే కాకుండా అంతగా పట్టించుకోవలసినవి కాని విషయాలలో ఆయన సర్దుకొని పోవటం కూడా గమనించ వచ్చు మనం. సిద్ధాంత రీత్యా భోగం మేళాల కాయన తీవ్ర వ్యతిరేకి. అయినా మొట్టమొదటి సారి జరిగిన స్త్రీ పునర్వివాహ సందర్భంగా, ఉత్సాహపరులైన కొందరు మిత్రుల అభ్యర్థన మేరకు భోగం మేళం పెట్టటానికాయన అంగీకరించవలసి వచ్చింది. ఆ మిత్రుల కోరికను ఆయన పూర్తిగా త్రోసి పుచ్చలేకపోయినాడు. అయితే తన ఇంట్లోకి మాత్రం వారవనితల గానాబజానా బృందాన్ని అడుగు పెట్టనివ్వలేదు. నియమ పాలనంలో, అంతః కరణ శుద్ధిలో ఆయన కంతటి పట్టుదల.

తరువాత వీరేశలింగం జీవిత ఘట్టాలను, సన్నివేశాలను బట్టి చూస్తే ఆయన కోరిన సాంఘిక సంస్కరణం, సమగ్ర పరివర్తనాత్మకమైనదీ, సంపూర్ణమైనదీ అన్న విషయం మనకు బోధపడుతుంది. కుల వివక్ష ఆయన పాటించలేదు. ఈ కులభేదదృక్పథం హేతు విరుద్ధమని ఆయన తిరస్కరించాడు 1898వ సంవత్సరంలో, సుప్రసిద్ధ కవయిత్రి శ్రీమతి సరోజినీ దేవి వివాహానికి మద్రాసు నగరంలో వీరేశలింగం బ్రహ్మమత సంప్రదాయానుగుణమైన ఆర్త్విజ్యం వహించి ఆకులాంతర వివాహానికి పెద్దరికం నెరపి నిర్వహించాడు. (శ్రీమతి సరోజినీ చటోపాధ్యాయ బెంగాలీ బ్రాహ్మణ కన్య, వరుడు డా ముత్యాల గోవింద రాజులు నాయుడు తెలుగు బ్రాహ్మణేతరుడు) ఆటు తర్వాత 1906వ సంవత్సరంలో కులసంకేతమైన యజ్ఞోపవీతాన్ని పరిత్యజించి ఆయన అనుష్ఠానిక బ్రహ్మ దీక్షను కూడా స్వీకరించాడు వీరేశలింగాన్ని కేవలం సంఘ సంస్కర్తగానే అంచనా వేయకూడదు. ఆయన పరిపూర్ణ వ్యక్తిత్వానికది మాత్రమే పోషకం కాదు. వృత్తి రీత్యా వీరేశలింగం అధ్యాపకుడు. అటు తర్వాత పత్రికా రచయిత. తన తీరుబాటు కాలాన్నంతా పత్రికా సంపాదకత్వానికే పంతులుగారు వినియోగించుకున్నారు. పోనీ ఆయన్ను ప్రాబోధిక రచయిత అనవచ్చు ప్రచార రచయిత అన్నా వరవాలేదు.

వీరేశలింగం ఒక్క అధ్యాపకుడే కాదు గొప్ప విద్యాదాత అని చెప్పాలి. మార్టిన్ లూథర్, విలియం విల్బర్ ఫోర్స్, రామమోహన రాయ్, విద్యాసాగరుల వంటి ప్రబోధకుడు వీరేశలింగం, ప్రజాప్రబోధం నిమిత్తం వీరేశలింగం చేయవలసిందంతా చేశాడు. సర్వసాధనాలూ శక్తులూ వినియోగిం

నాడు. ప్రసంగాలు చేశాడు. లిఖిత రచనలు చేశాడు. ఆనాటి ప్రబోధ మాధ్యాలు ప్రముఖంగా ఆ రెండే. స్త్రీల విద్యాభివృద్ధి ద్వారా సంఘాన్ని ఉన్నతికి తీసుకొని రావాలని ఆయన ప్రయత్నించాడు. ఇరవై ఆరేళ్ళ వయస్సుననే 1874వ సంవత్సరంలో వీరేశలింగం ధవళేశ్వరంలో ఒక బాలికా పాఠశాల స్థాపనకు పూనుకొన్నాడు. తెలుగు దేశంలో ఒక వ్యక్తి పూనుకొని బాలికా పాఠశాల స్థాపించటం ఇదే ప్రథమం కావచ్చు.

ఆ రోజుల్లో విద్యాధికుల వర్గంలో, పండిత ప్రకాండుల్లో కొందరు స్త్రీ విద్యా వికాసానికి పూర్తిగా ప్రతి కూలురుగా ఉండేవారు. స్త్రీ విద్య అంటేనే పరమా సహ్యం గాను, ఘోరంగానూ, అప్రాచ్యంగానూ, చూసే వాళ్ళు. కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు ఈ వర్గంలో ప్రముఖులు. కరడు కట్టిన సనాతన సంప్రదాయ పరత ఆయనది. వెంకటరత్నం పంతులుగారు స్త్రీ విద్యను నిర సిస్తూనూ, ఆసలా ప్రయత్నాన్నే అపహాస విమర్శకు గురిచేస్తూనూ తన "ఆంధ్ర భాషా సంజీవని"లో ఆ కుకందని పోకకు పొందని, లోక విరుద్ధమైన వితర్కాలు ప్రచురించేవాడు. ఆ వాదాలలో ఏమీ పసలేదని, ఉపేక్షించడమే సరిపోతుందనీ వీరేశలింగానికి తెలియదా? తెలుసు. అయినా కొక్కొండ వారి వాదం అపహాస భాజనం చేయాలని తన పత్రిక వివేకవర్ధనికి హాస్యసంచికాను బంధమైన "హాస్య సంజీవని"లో (ఈ విభాగానికి కోదు భాషా సంజీవని అని ఆయన పేరు పెట్టాడు) వీరేశలింగం ఇట్లా అన్నాడు.

"మాపూర్వులెప్పుడున్నూ విద్య చదువుకోలేదు. కాబట్టి విద్యాభ్యాసము పూర్వాచార విరుద్ధము. పూర్వాచార విరుద్ధమైన పని యెన్నటికిన్నీ చేయరాదు. యుక్తిచేత చూచినా, విద్య నేర్చుకోవటం వల్ల చాలా నష్టాలు కనబడుతూ వున్నవి. ఇప్పుడు కోర్టులలో పుట్టే తప్పు దస్తావేజులున్నూ దొంగ పత్ర ములున్నూ చదువు మూలంగానే కదా పుట్టుతూవున్నవి. పూర్వకాలపు వారందరూ విద్య చదువుకోకపోయినందుచేత చచ్చిపోయినారా? చదువుకోకపోతే జీవనం జరగదా? కాలు మీద కాలువేసుకొని కలిగిన మాత్రంలో సుఖంగా కాలక్షేపం చెయ్యలేక తీరికూర్చుండి విద్య పేరు పెట్టుకొని వృధాగా శ్రమపడడం యెందుకు? ఇటువంటి విపరీత బుద్ధులు పుట్టుచున్నవి గనుకనే యీ కాలపు వాళ్ళందరూ అల్పాయుష్మంతులుగా వుంటూ వున్నారు. దొరతనం వారు మన గ్రామాలలో

బళ్ళు పెట్టించి పిల్ల వాళ్ళను పాడుచేస్తు యుండగా దేశాభిమానం గల వారం దరూ చూస్తూ వూరుకోవడం న్యాయమా? దొరతనం వారికి అందరూ దేశి మాకు విద్య వద్దని మహజరు అరీలను పంపించుకోరాదా?"

ఇందులోని ఎత్తి పొడుపు ఏకాస్త అక్షరజ్ఞులైనకైనా అందిపోతుంది ఆనాటి సంఘంలో ఇంకెన్నో దురన్యాయాలు, అక్రమాలు, దురాచారాలు, అవ లక్షణాలూ వుండేవి. సంఘంలో ఇంకా భూస్వామ్య వ్యవస్థ లక్షణాలుపోలేదు. అర్ధ భూస్వామ్య వ్యవస్థ సాగుతూనే వుంది. ప్రభుత్వోద్యోగంలో అవినీతి సర్వే సర్వత్రా వ్యాపించి వుండేది. లంచాలు తీసుకోవడం సర్వసామాన్యం. న్యాయ శాఖలో, కార్యనిర్వాహకశాఖలో మామూళ్లుపుచ్చుకోవడం అతిసహజంగాకనపడేది. దాన్ని ఎవ్వరూ వేలెత్తి చూపేవారుకాదు. వేశ్యాలంపటత్వంనాగరకతకు. రసికతకు, పరువుకు ఒక చిహ్నమైపోయింది భోగంమేళాలు సాంఘిక వినోదాలై పోయినవి. సంఘంలో సంపన్నవర్గం, అధికారవర్గం వేశ్యావృత్తికి పట్టుకొమ్మలై నారు పోషకులైనారుఅతిబాల్య వివాహాల అనర్థాలు, అక్రమాలు ఎవరికీ పట్టే వికావు బాలవితంతువుల దీనజీవితం వైపు ఎవరూ చూసేవారుకాదు. తల్లి దండ్రులు, దగ్గర బంధువులు, సంఘమూ అదంతా ఆ అగతికల ప్రారబ్ధం, ఏంచేస్తాం అన్నట్లు మిన్నకుండేవారు. వాళ్ళనలా పట్టించుకోకుండా వదిలేయటం మామూలై పోయింది. దంభంతో కూడిన శుష్క కర్మకాండకు ప్రాధాన్యం పెరిగింది

అక్షరాస్యత నోచుకొనే మూర్ధజనులు కపట పురోహితవర్గాన్ని అధ్యా త్మికాచార్య పురుషులుగావించి వారికి పశులై పోయినారు. ఈ పరిస్థితులను బాగు చేయటం ఇనుము నుంచి తైలంపిండటమేనని వీరేశలింగానికి తెలుసు. అయితే ఆయన తరుణరక్తం చైతన్యకపోష్టమై ఎల్లాగైనా ఈ సంఘాన్ని, ఈ అకటా వికటపు అస్తవ్యస్తపు వ్యవస్థను మార్చాలన్న దృఢనిశ్చయం కలిగించింది. స్థానికప్రభువులతో తలపడటమంటే ఆ రోజుల్లో లండన్‌లో సార్వభౌమాధికారం వహించిన రాజ్ఞిని ధిక్కరించటంకంటెనూ, కలకత్తాలోని రాజప్రతినిధి ఉత్త ర్వులు తృణీకరించటంకంటేనూ. ప్రమాదకరం ఏమంటే వాళ్ళు దూరంనుంచి అధికారదండాన్ని ప్రవర్తింపచేస్తారు. స్థానికాధికార ప్రముఖుడి విషయంలో అట్లాకాదు. ఈ విషయాన్నే ప్రస్తావిస్తు వివేకవర్ధని తొలినంచికలో ఒకచోట్లో

వీరేశలింగం ఇట్లాఅన్నారు. ఆయన పాగించినదానిలో వివేకవర్ధని ప్రబలాయుధం.

"లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము; వేశ్యాంగనాసంగము నీతిగాదన్న శృంగారనాయకులకు కోపము; పూర్వాచారమును మార్చుకోవలెనన్న పామరజనులకు కోపము; నీతిమాలిన బాహ్యవేషములు మతవిరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము. మాపత్రికోద్దేశమును నిశ్శంకముగా నిర్వహింపవలసినచో నిన్ని కోపములను సరకు చేయకుండవలెను." అయినా స్వార్థప్రయోజనపరాయణులు, ప్రబలులు అయిన అధికారవర్గంకాని, మతాధిపతులుకాని వీరేశలింగాన్ని నిశ్చయపథంనుంచి మరలించలేకపోయినారు తన వివేకవర్ధనిని వాడిఅయిన ఆయుధంగా చేసుకొని ఈ సాంఘికదురాచారాలన్నిటిమీదా తీవ్రమైన దాడిసాగించారు. మొట్టమొదట భోగంమేళాలనుగూర్చి తీవ్రంగా ఖండించారు గానాభినయాలవంటి లలితకళలు ప్రదర్శించి ఆస్వాదింపచేయటం కాక వ్యభిచారశిక్షణ కేంద్రాలుగా ఈ భోగంమేళాలుండేవి. ఆ రోజుల్లో, రసికపురుషులు న్యాయసభాస్థానాలలో, ప్రభుత్వ కార్యస్థానాలలో తమరాసిక్యాన్ని బాహాటంగా, డాంబికంగా చాటుకొనేవాళ్లు. వీళ్ళదురాగతాలు, దుశ్చర్యలు వీరేశలింగం, తన ప్రాణానికి ముప్పు వస్తుందేమోననికూడా లక్ష్యం చేయకుండా బట్టబయలు చేశారు

న్యాయశాఖలో ప్రచురంగా ఆనాడున్న అవినీతిని తీవ్రంగా ఎదుర్కొన్నారు. అక్రమార్జనకు, అవినీతికి పాల్పడుతున్న ఉన్నతాధికారులను తన తీవ్రవిమర్శకు గురిచేశారు ఆ వ్యక్తి భారతీయుడా, యూరోపియనా అన్న మీమాంస ఆయన పెట్టుకోలేదు. భారతీయుడైన జిల్లా మున్సిఫ్ అయినా, యూరోపియన్ అయిన జిల్లా జడ్జి అయినా ఆయన లెక్కచేయకుండా విమర్శకు గురిచేశారు. వీళ్ళనుగూర్చి అన్యాపదేశంగా (పేర్లు ప్రకటించకపోయినా, ప్రవర్తనను చిత్రిస్తూ) దుయ్యబడుతూవుండేవారు వీరేశలింగం తన వివేకవర్ధని పత్రికలో చిన్నచిన్న హాస్యసంభాషణలు, ప్రహసనాలరూపంలో ఆ పెద్ద మనుషుల, అధికారోద్యోగుల దుష్ప్రవర్తన వెల్లడించేవారాయన. దీని ఫలితాలు రాజమండ్రిని గగ్గోలెత్తించాయి. తీవ్రపరిణామాలు, సంచలనమూ కలిగించాయి. ఒక శిరస్తాదారుకు మతిచాంచల్యం కలిగింది. రికార్డుకీపరొకరు ఉద్యోగం ఊడ

గొట్టుకున్నాడు. ప్రభుత్వ న్యాయవాది ఒకరు ఆత్మహత్యపాలైనాడు. ఈ న్యాయవాదికి కావలసిన దగ్గర చుట్టం ఒకరికికూడా అదే గతిపట్టిందని, మతి భ్రంశంతో ఆయన ఆత్మహత్యపాలైనాడని అనుకున్నారు.

తాను న్యాయమూ ధర్మమూ అని తలచిన పోరాటంలో ఎప్పుడైతే తన పక్షానికి విజయం లభించిందో, సత్యం ఎప్పటికైనా జయించితీరుతుంది అనే దృఢమైన విశ్వాసం ఆయనకు ఏర్పడింది. "ఈశ్వరబలము ముందరను, సత్య బలము ముందరను మనుష్యబలమును ధనబలమును గవ్వకును కొరగావు. ఈశ్వరబలమున్న పక్షమున పూరిపుడకయు వజ్రాయుధమగును; ఈశ్వర బలములేనిచో వజ్రాయుధము సహితము పూరిపుడక యగును. లోకములో సత్యమును ధర్మబలమునే బలములుకాని యవిలేని యధికారబలమును విత్త బలమును బలములుకావు." అనే విశ్వాసం వీరేశలింగంలో దృఢపడింది. ప్రతి సంఘటనా, స్వీయానుభవమూ ఆయన ఆస్తికతను మరింత గట్టిపరచింది.

వితంతు వివాహోద్యమ సంస్కరణ కార్యక్రమంలో 1834వ సంవత్సరం గడచినకాలానికి పది వివాహాలాయన (వైశ్యులలోనూ, బ్రాహ్మణులలోని వివిధ శాఖలలోనూ కలిపి) జరిపించాడు. ఇంతమాత్రం నిర్వహించటం ఆయనకు కొంత సంతృప్తి కలిగించిందనే చెప్పాలి. ఆనాటి పరిస్థితులు, అవరోధాలు, పడినకష్టాలు స్మరిస్తూ తాను సాధించగలిగిన ఫలితాలగూర్చి కృతజ్ఞతాపూర్వకమైన, వినయపూరితమైన ధోరణిలో ఆయన ఈవిధంగా చెప్పుకున్నాడు.

"విశేష పాండిత్యమును విత్తమును లౌకికాధికారమును లేనివాడను దుర్బల శరీరుడను నగు నేనీ మహాకార్యమును నిర్వహింపగలుగుదునని నేనిందులో నడుగిడలేదు. ఇది యీశ్వరప్రేరితముగను నీశ్వరప్రీతికరముగనున్నందుచే నాకు పరమధర్మమునునన్న దృఢవిశ్వాసముతోనే సాధ్యాసాధ్యవిచారమును తలపెట్ట కనే నీపనిలో ప్రవేశించితిని. తనకు ధర్మమయిన పనిలో శక్తివంచనలేక కృషి చేయుట యొక్కటియే మనుష్యునిపని; దానిఫలాఫలముల నియ్యవలసిన వాడీశ్వరుడుగాన తద్విచారము మనుష్యునిదికాదు. ఈశ్వర ప్రీతికరమయిన సత్కార్యమునందు యథాశక్తిని కృషిచేసెను ఫలము కలుగకపోయిన పక్షమున మనుష్యుని లోపమేదియులేదు. మనుష్యుడు చేయవలసిన పనిని చేసినవాడగుటచేత అంతవరకే యతడు శ్లాఘార్హుడు."

భగవద్గీత విధించిన నిష్కామకర్మయోగం వీరేశలింగం విషయంలో సరిగ్గా సరిపోతున్నది. ఈ మనఃపరిపక్వతవల్లనే ఆయన వృద్ధాప్యంలో కలిగిన ఆశాభంగాలు, అపార్థాలు, అభియోగాలు, నిర్లిప్తంగా ఎదుర్కొనగలిగారు. ఎన్నో సంకటపరిస్థితులు, క్లిష్టఘట్టాలు. తన జీవితాశయసాధనలో ఆయన ఎదుర్కో-వలసివచ్చింది. ఆయన వెన్నంటి అన్నివిధాల సాయంచేసినవారు అనుసరించి వచ్చినవారు, ధనసాయం, మాటసాయంచేసి సంస్కరణ కార్యక్రమాలపట్ల ఆత్మఫీక శ్రద్ధాసక్తులు కనపరచినవారు సనాతన సంప్రదాయవర్గంవారి వత్తిళ్ళకు, బెదిరింపులకు భయపడి ఆయన్ను విడిచి ఆయన ప్రతికూలపక్షంలో చేరిపోయినా వీరేశలింగం జంకలేదు. అంతేకాదు వితంతువివాహదంపతులలోకూడా స్వార్థపరాయణులై కొద్దిమంది ఆయన్ను బాధించటానికి పూనుకొన్నారు. ఈబాధలకు తోడు రాజమహేంద్రవరంలో, అటు తరువాత మద్రాసులో ఆయన స్థాపించిన వివిధసంస్థల నిర్వహణభారంకూడా ఆయనకు సమస్యగా పరిణమించింది. వృద్ధాప్యంలో జవసత్వాలు క్షీణించి ఎవరిదైనా ఆసరా అవసరమైనకాలంలో ఆయన ఇల్లాలిని పోగొట్టుకున్నారు. ఆ తల్లి వీరేశలింగాన్ని తన జీవితకాలమంతా కంటికి రెప్పలాగా కాపాడింది. అన్నివిధాలా ఆ దొడ్డ ఇల్లాలాయనకు సహధర్మచారిణి. ఆప్తులనుకున్నవాళ్ళే, అనుచరవర్గంలోవాళ్లే ఆయన్ను అపనిందలపాలుచేసి, ఆయనపై అభియోగాలు మోపి వృద్ధాప్యంలో ఆయన్ను వేధించారు.

నిజంగా ఆయన జీవితంలో అది విషమ పరిస్థితుల కాలం, పరీక్షా సమయం. సాంఘిక చైతన్యావతరణంకోసం, స్వావలంబన దృష్టిని సంఘంలో పెంపొందింపచేయటంకోసం నిరంతరం ఆయనపాటు పడ్డారు. ఆయన జీవితకాలంలో చివరిపర్వంలో ఆయన కెదురైన అనుభవాలవంటివి మరొకరికెవరికైనా ఎదురై ఉంటే వాళ్లు బెంబేలు పడిపోయి మానవ సౌజన్యంపట్లనే ఆశాపహతులై పోయి ఉండేవారు నిరాశానిస్పృహలపాలై పొయ్యేవారు. కాని వీరేశలింగంతత్త్వం ఇందుకు పూర్తిగా విరుద్ధం. వీరేశలింగంలోకూడా తొందరపడి ఆగ్రహం ప్రదర్శించే లక్షణం, అసహనం, చిర్రుబుర్రులు ఉండేవి. అయితే న్యాయంకోసం ధర్మంకోసం ప్రకటించే తీవ్రాగ్రహంతో భాగాతే ఆయన బలహీనతలన్నీ. దూషణభూషణాలు, అనుకూల ప్రతికూలాలు ఆయన సమచిత్తంతో స్వీకరించేవారు. తన పూర్వసంస్కర్తలందరి విషయంలో

మాడిరగానే తన మార్గం కూడా సుగమంకాదనీ, గులాబీపూల బాటకాదనీ అయనకు తెలుసు, దుర్గమారణ్యచ్ఛేదం ఆయన చేయవలసి వచ్చింది. సుతి కెక్కిన విద్వాంసుడు, వీరేశలింగ మహాశయుని శిష్యకోటిలో చేరినవాడు అయిన వేత్త ఒకరు (డా॥ వి. రామకృష్ణారావు) వీరేశలింగం సాధించిన మహత్తర కృషిని మాట బొమ్మలలో చిత్రించారు. "విషవృక్షాలు నేలకూలుస్తూ, ముళ్ళ పొదలు నిర్మూలిస్తూ, క్రూరమృగాలమట్టు పెడుతూ, భయంకర విష సర్పాలను చంపివేస్తూ, దాటరానికొండలు తొలుచుకుంటూ, కంటకపథాలు శుభ్రంచేసుకుంటూ" వీరేశలింగం పురోగమించాడు. అన్నింటికన్నా కష్టసాధ్యం ఏమంటే చాలావరకు ఆయన ఈ పనులను ఒంటరిగా నిర్వహించాల్సి వచ్చింది. అయితే మానవాపకోపాలుకాని, ఇతర విషమసన్నివేశాలుకాని, ఏనాడూ వీరేశలింగాన్ని అధైర్యపరచలేదు ఆయన శరీరారోగ్యం మొదటినుంచీ అంతంత మాత్రమే చిన్నప్పటినుంచీ కాసవ్యాధి ఆయన్ను పీడిస్తూనే వచ్చింది. వయసు మళ్ళింతర్వాత దుర్బలమైన శరీరాన్ని మరింత ఆ వ్యాధి బాధించింది. భగవంతుని పట్ల అచంచల విశ్వాసంతో, తానుపూనిన మహత్కార్యం సమంజసమైనదన్న సంకల్పంతో ఆయన ముందుకు ముందుకుసాగాడు. ఆయనలోని ఈ వ్యక్తిత్వం విలక్షణస్ఫూర్తి ఆయన పనులకు వెన్నెముక అయింది.

వీరేశలింగం సాగించిన ఉద్యమ వ్యాపనంలో, ప్రజలను తన వైపుకు తిప్పుకోవడంలో ఒక విలక్షణాంశం ప్రస్తావించాలి ప్రజలను ఉర్రూతలూ గించగల, మాటగారడ ప్రదర్శించగల వాగ్ధోరణి వీరేశలింగంలో లేదు. ఈ విషయంలో ఆయన్ను బ్రాడ్లాతోనో, అనిబిసెంట్‌తోనో, కేశవచంద్రసేన్‌తోనో, బిపిన్ చంద్రపాల్‌తోనో పోలిక చెప్పగల అవకాశం ఎంత మాత్రమూలేదు. ఆయనలోకజ్ఞాన విషయాలు చెప్పి, హేతువాదాన్ని విప్పి చెప్పి, శ్రోతలను ఆకట్టుకొనేవాడు. అంతేకాని భావావేశపరత రెచ్చగొట్టేదికాదు ఆయన ఉపన్యాసం.

సాధారణ ప్రజానీకమంతా సంప్రదాయపు బరువుభారంతో, సాంఘికాచార శృంఖలా బద్ధమై అజ్ఞానవిశ్వనిద్రాంతమై ఉండగా వాళ్ళఅంతఃకరణను ప్రబో ధించి, నిద్రాముద్రితమైన చైతన్యాన్ని జాగృతంచేసి వాస్తవ పరిస్థితులనుచూపి, నచ్చచెప్పి, ఆయన శ్రోతలను ప్రభావితం చేసేవాడు అంతేకాని ఉద్ఘాటనల తోనూ, ఉద్రేకాలతోనూకాదు తానుపూనిన కార్యసాధన తత్పరత ఆయన

స్వభావంలో అంతర్భాగమే. అయినా ఆయన కుటుంబ వాతావరణం, సంస్కరణ ప్రేరణ నిచ్చేదేమీకాదు బాల్యజీవితమంతా సంప్రదాయబద్ధంగా గడిచిందాయనకు చదువు సంధ్యలుకూడా సంప్రదాయ పరంగానేసాగాయి వీరేశలింగం విషయంలో ఆయనవంశం, జన్మించిన కుటుంబం, అనాటి సాంఘిక వైషమ్యాలకు పాత్ర మైంది కాదని మనం గుర్తుంచుకొంటే ఈసంఘ సంస్కరణ భావబీజం ఆయనలో ఎప్పుడు ఎట్లామొలకెత్తిందా అని ఆశ్చర్యమవుతుంది. రాజారామ మోహనరాయుల వారిజీవితమూ ప్రబోధాలూ వీరేశలింగాన్ని ప్రభావితంచేశాయి. అట్లానే ఈశ్వరచంద్రవిద్యాసాగరులవారి సాహసోద్యమ ప్రవృత్తి ఆయనకు మార్గదర్శకమైంది. అయితే ఒకటి మనం గుర్తుంచుకోవాలి ఆయన మానసిక తత్త్వం ఆయన సాధించిన మహత్కార్యాలకు అనువైన క్షేత్రంగా ఉండబట్టే ఆమహాపురుషుల ఆదర్శాలు ఉద్యమాలు, ఆయనకు ప్రబోధకాలైనాయి. మార్గ దర్శకాలైనాయి. కిందటి శతాబ్దిసంప్రదాయ సాహిత్యాభిజ్ఞుడైన తెలుగు పండితు డిగా మాత్రమే ఆయన ఉండిపోతే ఆధునిక తెలుగు సాహిత్యయుగకర్తృత్వం ఆయన్ను వరించిఉండేదికాదు ప్రాచీన పౌరాణిక సంప్రదాయ సాహిత్య రీతులతో మాత్రమే ఆయన తృప్తిపడలేదు సమకాలీన సాంఘిక వికాసానికి అవసరమైన సాహిత్యసృష్టివేశాడు వల్లెవేయటం ఆర్జించిన పాండిత్యాన్ని యధాతథంగా మళ్ళీ మళ్ళీవేయడంతప్ప అనాటి పండితులలో సర్వసాధారణంగా విశేషమైన ఉపజ్ఞ ఏమీకనపడేదికాదు వీరేశలింగం అనాటి సాహిత్యవేత్తల పండితులకోవకి చెందిన వాడుకాడు వర్తమానకాలపు సాంఘిక విలువలను వ్యవస్థను నిలదీసి ప్రశ్నించా డాయన దుష్టవ్యవస్థతో ఢీకొన్నాడు ముక్కుపచ్చలారని బాలికలకు ముదివగ్గు లకు కట్టబెట్టడం తీవ్రంగా ఖండించాడు ఈవిధంగాచేయడం వల్లనే బాలవితంతు వుల దయనీయ జీవితాలు సంఘానికి సమస్య అయినవని గుర్తించాడు ఇంగ్లీషు భాషాపరిచయ అధ్యయనాలద్వారా పాశ్చాత్య భావవీచికలాయనను సోకాయికాబట్టే ఆయనలో ఈపరివర్తనము ఈనూత్నదృక్పధం చోటుచేసుకున్నాయి ఇంగ్లీషు విద్యకు స్వాగతం చెప్పడమేకాకదో, ఎంతగానో ప్రశంసించాడు వీరేశలింగం. భారతీయులు ఇంగ్లీషు నేర్చుకోవడంవల్ల దేశానికి కలిగిన మేళ్లను ఆయన ఈ విధంగా శ్లాఘించాడు

"ఆయసాక్ంతము సూదులనాకర్షించునట్లుగా విద్యాబుద్ధి సంపన్నులైన నూరులకొలది భిన్నదేశీయులను భిన్నమతస్థులను భిన్నభాషలవారిని నిర్బాక్క

స్థలముల కాకర్షించి యొక్కసభా మండపమునకొక్క భాషతో మృదుమధుర వాగ్గుంభనలతో దేశలాభము నిమిత్తమై వారిచేత ప్రసంగములు చేయించు చున్నది యింగ్లీషు విద్యయను సమ్మోహన మంత్రముగాక మరియేది? హిందూ దేశమునకు క్రొత్తప్రాణము పోయుచున్నది పాశ్చాత్యభాషారూపమయిన సంజీవనీ విద్యగాక మరియేది?

ఈ భాష యమృతవర్షము కురియునట్లుగా నెల్ల యెడల వెదచల్లుచున్న యుత్తమ జ్ఞానమును, పరిశుద్ధ నీతిని, నిర్మల ధర్మతత్వమును, మానుష స్వాతంత్ర్య స్వరూపమును, చవిగొన్న తరువాత నెవ్వరు తమతొంటి యజ్ఞాన జన్యమయిన యైకమత్య భావమును స్వార్థపరత్వమును దురభిమాన ద్వేషము లను త్యజించి పరస్పర భ్రాతృవాత్సల్యముతో సంఘీభవించి మానుష స్వభా వార్హములయిన స్వాతంత్ర్య ఫలములను పొందకుండ గోరుదురు? ఎల్ల వారల హృదయముల యందు నదృశ్యముగా నడుచుచున్న యీ యద్భుతమైన మార్పును జూడగా నిదియేమో మహేంద్ర జాలమువలె గానబడుచున్నది. ఇంగ్లీషు విద్య యొక్కయు నింగ్లీషు ప్రభుత్వము యొక్కయు ఘనతను, శక్తిని ఘోషించుటకై యింత కంటె వేరేమి కావలెను."

ప్రస్తుతం వినవచ్చే ఇంగ్లీషు బహిష్కార నినాదానికి ఆనాటి వీరేశలింగం పంతులు గారి అభిప్రాయాలకు ఎంత అంతరమున్నదో గమనించండి అనాటి ఆయన అభిప్రాయాలు, ఈనాడు ఇతర మానసిక ప్రవృత్తులను పురస్కరించు కొని అత్యుక్తిగా ఉత్ప్రేక్షగా అనిపిస్తాయేమో కాని ఆ యథార్థం మాత్రం ఎవరూ కాదనలేరు.

ఈ విధంగా ఆధునిక విజ్ఞాన ప్రభావితుడు కావటం వల్లనే మానవజీవి తంలో అత్యంత ప్రాథమిక విలువలైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సమానత్వం వ్యక్తిగత ప్రవర్తనలు నీతి నియమాలు మొదలైన వాటిని గురించి వీరేశలింగం లోతుగా ఆలోచించి తపనచెందటం సంభవించింది. అయితే ఒక విషయం గమ నార్హం. అనాదిగా భారతీయులు పూజార్హంగా భావిస్తున్న వేదాలు, ఉపనిషత్తులు, తదితర మత ఆధ్యాత్మిక గ్రంథాల ప్రామాణ్యాన్ని ఆయన తక్కువ పరచలేదు. ప్రశ్నించలేదు. త్రికరణ శుద్ధిగా ఆయన హిందువు పవిత్ర వర్తనుడు. పర

మాస్తికుడు. కాని మూఢ విశ్వాసాలను, సాంఘిక దురాచారాలను తీవ్రంగా గర్హించాడాయన. అంధ పరంపరగా నమ్ముతున్న, అనుసరిస్తున్న విలువలను, ఆ చారాలను తీవ్రంగా విమర్శించాడు. మనమత ధర్మాలలో వాటికేమీ స్థానం లేదు. ఆధారం లేదు. అయినా స్వార్థపరులు కల్పించిన, సృష్టించిన లేదా ప్రక్షిప్తం చేసిన ఆకరాలను సాకుగా చేసుకొని గతానుగతికంగా సంఘంలో చెలామణి అవుతున్నాయి. దీని నాయన గర్హించాడు. తిరస్కరించాడు. శృతి స్మృతుల ఆ భాగ ప్రామాణికతను, అమూలకాధారాలను ఆయన ఒప్పుకోలేదు కేవలం వాటి సత్తాను ప్రశ్నించి తిరస్కరించి గర్హించి ఆయన ఊరకుండిపోలేదు మేధా విలసనం, తార్కిక ప్రజ్ఞ, పాండిత్య ప్రతిభలతో సంతృప్తి పడలేదు. సమ్మోహితుడు కాలేదు. ఆచరణాత్మకమైన ప్రయోజనంలో సమస్యా పరిష్కార సాధనంగా ఉపయోగపడితేనే ఏతాత్త్విక దృక్పథంతోనైనా సిద్ధాంతంలోనైనా ఆయన ఏకీభావం కుదుర్చుకున్నాడు. వాస్తవిక, ఆచరణాత్మక దృక్పథంలో ఆయనకు మహాదేవ గోవిందరానడెతో సామ్యం కన్పిస్తుంది. రానడెపట్ల వీరేశలింగానికి చాలా గౌరవం కూడాను. హిందూసంఘాన్ని అన్నివిధాలా ఉద్ధరించాలనీ, సంస్కరించాలనీ ఇద్దరూ తలపోశారు. బోధించారు. సాంఘిక వ్యవస్థలో ప్రగతిని సాధించే చట్టరూపకమైన ప్రభుత్వ చర్యలతో పాటుగా వ్యక్తిగత ఉద్యమాలు, సాముదాయిక కృషి అవసరమని ఇద్దరూ భావించారు.

సాంఘిక సంస్కరణలను చట్టరూపంగా అమలులోకి తేవటమనేది పాశ్చాత్య భావానుకరణమని, విదేశీయ వాసనా వాసితమని ఒక విమర్శ వచ్చినప్పుడు రానడే ఈ విధమైన సంస్కరణాభిలాష విదేశీయ భావనా ప్రేరితమూ, నూతనా భినివేశ పూరితమూ కాదనీ, మనపురా సంస్కృతికి ఉత్కృష్ట స్థాయిని మళ్ళీ పునం సంఘం సాధించడానికి జేసే ప్రయత్నమనీ స్పష్టంచేశారు. క్రూరమైన, హృదయంలేని నియమ నిబంధనలు, కట్టుబాట్లు, అనంతర కాలపు క్షీణయుగ సంస్కృతి జన్యాలని, పతనావస్థ ప్రదర్శకములనీ రానడే సమాధానించారు. ఇంకా యీ విధంగా ఆయన ప్రబోధించారు. "ఇప్పుడు మనం ప్రభుత్వం అండదండలతో ఈ పతన దశ నుంచి పూర్వపు ఔన్నత్యదశకు, సమాజ్ని జీవవిలసితంగాను, చైతన్య వంతంగానూ పరివర్తనం చెయ్యాలి."

అనుకొన్న వెంటనే సాంఘిక వ్యవస్థ అంతా మారిపోవాలని భావించే తీవ్రవాదులను హెచ్చరిస్తూరానడే ఇట్లా బోధించారు. "నిజమైన సంస్కర్త ఎవ్వరూ

తుడిచి పెట్టిన పలక మీద రాయాల్సిన పనిలేదు సగం దాకా రాసి ఆగిపోయిన వాక్యాన్ని తరచుగా పూర్తిచేయాల్సిన సందర్భమే ఉంటుంది. సిద్ధమై ఉన్న వ్యవస్థ నుంచి అవ్యవస్థ సాయంతోనే ఆదర్శ స్థితిని సాధించాలి గతంతో పూర్తిగా మనం తెగతెంపులు చేసుకోలేము చేసుకోకూడదు కూడా సుసంపన్నమైన వారసత్వం కూడా మనకుంది. దాన్ని తలచుకొని మనం కించపడాల్సిన పనేమీ లేదు."

ఈ విధమైన విచార ధారనే వీరేశలింగం కూడా అంగీకరించినట్లు కనబడుతుంది. తొందర పడకుండా నెమ్మదిగా ముందుకు సాగాలి అనే దృక్పథంతో వీరేశలింగం ఏకీభవించాడు. ఉభయులవీ రాజకీయ సాంఘిక రంగాలలో సమానమైన అభిప్రాయాలు. భారతదేశ భావి భాగ్యోన్నతికి రాజకీయ ప్రతిపత్తిశా, సాంఘిక సంస్కరణమా, ఏది ముందు సాధించాలి అన్న విషయం కూడా ఆనాటి దేశభక్తుల దృక్పథంతో సన్నిహితంగా ముడిపడివుంది. 1889వ సంవత్సరంలో బొంబాయిలో జరిగిన అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సంస్థాపన సమావేశంలో ఈ విషయం గాఢంగా చర్చించటం జరిగింది. రెండు పక్షాలు పట్టుదలగా వాదించుకున్న తర్వాత చివరకు రాజకీయ పత్తిని సాధించటమే కర్తవ్యం అనే వారి మాట నెగ్గింది కాంగ్రెసు ప్రధాన ధ్యేయం రాజకీయ రంగంలో పనిచేయుటమే అని తీర్మానమైంది అప్పటికి ఈ రెండు పక్షాలు మధ్యే మార్గంగా ఒక సామరస్యపు ఏర్పాటును అంగీకరించడం జరిగింది. అది ఏమంటే భారత జాతీయ కాంగ్రెస్ అనువార్షిక సమావేశంతో పాటే అదే సభాస్థలిలో, భారత జాతీయ కాంగ్రెస్ ప్రతినిధుల సమావేశం ముగియగానే భారతీయ సాంఘిక సంస్కరణ మహాసభ కూడా జరగాలి అని సామరస్య ప్రతిపాదనకు రెండు పక్షాల వారూ అంగీకరించారు. రానడే, భండార్కర్, చిప్లంకర్ ప్రభృతులు ఈ సాంఘిక సంస్కార వ్రశీకతను గుర్తించిన పక్షానికి ప్రముఖ నాయకులు తర్వాత గోఖలే మహాశయుడు కూడా వీళ్ళలో చేరి ఈ వర్గానికి బలంచేకూర్చాడు. అవతలి పక్షం వారిలో తిలక్, ఆగార్కర్ మొదలైన వారు ప్రసిద్ధులు.

క్రమక్రమంగా ఈరెండుపక్షాలూ ఒకరికొకరు దూరమైపోయినారు. ఎవరికివారే వారికార్యక్షేత్రాలు వ్యూహాలు రూపొందించుకున్నారు. అతివాదులు

మితవాదులుగా విభాగమైపోయినారు. రాజకీయ విషయాలలో మితవాదమూ సాంఘిక సంస్కరణలలో తీవ్రవాదమూ మితవాదుల ప్రవృత్తి పిల్లవివాహోచిత వయస్సు వివాహచట్టం స్త్రీలఆస్తిహక్కు, అవిభక్త హిందూ కుటుంబాలలో మహిళల విద్యావికాసం మొదలైన సంస్కరణలకోసం అభిలషించారు రానడే ఈసంస్కరణ వాదుల పక్షానికి నాయకుడు ఈపక్ష జనకుడాయనే తర్వాత ఈ పక్షం దృక్పథంతో సర్వాత్మనా కృషిచేసిన వేత్తగోఖలే మహాశయుడు.

అసతలపక్షం అంటే అతివాదుల దృక్పథం రాజకీయంగా తీవ్రవాదమూ సాంఘిక సంస్కరణల విషయంలో మితవాదమూ ఈపక్షానికి ప్రముఖ నాయకుడు లోకమాన్య బాలగంగాధరతిలక్.

మిత వాదులలో మూర్ధన్యుడని యువరాజని కీర్తితుడైనరానడే సంఘాన్ని తన హక్కులు బాధ్యతలు గుర్తెరిగేట్లు వికాసోన్ముఖం చేయాలని, సంస్కరించాలని ప్రబోధించాడు రాజకీయ ప్రగతికి సాంఘిక సంస్కరణప్రగతికి రానడే సమానమైన ప్రాధాన్యం ఇచ్చాడు సిద్ధాంతపరంగా ఆచరణ సాధ్యంగా ఆయన ఆలోచించాడు. రాజకీయంగా సరియైన గుర్తింపు లేకుండా మంచి సాంఘిక వ్యవస్థను రూపొందించుకోలేము సాంఘిక సమానత న్యాయంలేకుండా రాజకీయమైన సౌకర్యాలు, హక్కులు ఆసంఘం అనుభవించలేదు" ఇహాకా రెండుపక్షాలలోని తీవ్రవాదుల నుద్దేశించిరానడే యీమాటలు పలికి ఉండవచ్చు.

రానడే, గోఖలేల మాదిరిగానే వీరేశలింగం కూడా నిజమైన మితవాది ఆయనలోకూడా రాజకీయల మితవాదిత్వం, సంఘసంస్కరణ తీవ్రవాదిత్వం పుంజీభవించాయి. బ్రిటిషు వారినుంచి భారతీయులు స్వీకరించవలసింది చాలా ఉన్నదని ఆయననమ్మాడు రాజుదైవాంశ సంభూతుడన్న మనసంప్రదాయ విశ్వాసంబట్టి రాజును దైవంగా పూజించడం మనకలవడింది. అందువల్ల నిజమైన పౌరస్వేచ్ఛా స్వాతంత్ర్యాల హక్కులగురించి మనకు తెలియదు బ్రిటిషువారి రాచరిక వ్యవస్థతో పోల్చిచూస్తే మనరాచరిక వ్యవస్థలోనిలోపాలు మనకు బాగా తెలిసివస్తాయి, ఇంగ్లండులో చక్రవర్తి అంటూ పాలించినప్పటికీ ఆపదవి రాజ్యాంగస్థాయికమూ పరిమితాధికార సంయుతమూ అయిఉండి నిజమైన అధికారాలు మంత్రులకు ప్రజలచే ఎన్నుకోబడిన అన్నివిధాలా ప్రజాప్రతినిధులైన ప్రజాప్రాతినిధ్యసభ వారికే దత్తం కావడమూ గమనార్హంకదా అన్నాడు వీరేశలింగం.

అందువల్ల వీరేశలింగం స్థానిక స్వపరిపాలన సంస్థల ప్రాముఖ్యాన్ని గాఢంగా భావించి నొక్కిచెప్పాడు. స్థానిక సంస్థలకు, రాష్ట్ర, దేశీయ ప్రాతి

నేర్వ శాసన సభలకు ప్రతినిధులను ఎన్నుకొనే విషయం ఆయన అభినివేశంతో ప్రస్తావించాడు ఆనాటి భారత జాతీయకాంగ్రెస్ ప్రాథమికాశయాలతో ఆయన పూర్తిగా ఏకీభవించాడు.

ప్రజలలో రాజకీయ పరిజ్ఞానం పెంపొందింప చేయటానికీ, మత సామరస్యం వృద్ధి చేయటానికి విద్యావంతులైన బ్రిటిషు ప్రజావర్గం వారి సుహృద్భావ, సామరస్య, సహకారాలు భారతీయుల సమస్యల పట్ల లభింప చేయటానికిచేస్తున్న ప్రయత్నాలు ఆయనగట్టిగా బలపరిచాడు.

వీరేశలింగం ప్రకటించిన అభిప్రాయాలు స్వదేశీ ఆందోళనలో పాల్గొన్న విద్యార్థులకు, ఆరోజుల్లో బిపిన్‌చంద్రపాల్ మొదలైన మహావక్తల, దేశనాయకుల ఉత్తేజకర ఉపన్యాసాలచే ప్రభావితులైనవారికి రుచించకపోవడం సహజమే. అందువల్ల వీరేశలింగాన్ని ఆనాటి యువతరం "రాజభక్తి పరాయణుడని" 'మార్పుసల్లనివాడని' ముద్రవేయటం జరిగింది. అయినా వీరేశలింగం ఏనాడూ తన అంతరాత్మకు విరుద్ధంగా, ఇతరుల మెప్పుకోసం అభిప్రాయాలు మార్చుకోనూలేదు. ప్రకటించనూలేదు. ఇతరులేమనుకొంటారో అనికాని లోకవిమర్శకు భయపడికాని ఆయన తన అభిప్రాయాలు మార్చుకోలేదు. దేశభక్తిని ప్రకటించటమంటే సులభమార్గంలో ప్రజల శ్లాఘాభినందనలు పొందటంకాదు ఆయన దృష్టిలో. సత్యమని నమ్మిన విషయాన్ని విస్మరించడానికి లోకంలో నలుగురి మెప్పుకోసం ఆయన ఏనాడూ తాపత్రయపడలేదు. దేశభక్తిని గురించి ఉదారంగా, ఉన్నతంగా, సమగ్రంగా ఆయన భావనచేశాడు. ఒకరి సంతోషం కోసం దేశప్రజలలోపాలు, దోషాలు ప్రకటించకుండా ఆయన ఉపేక్షించలేదు దేశభక్తిని గురించి దేశాభిమానాన్ని గురించి ఆయన వెలువరించిన భావాలలో నిర్ద్వంద్వంగా తనను తాను వ్యక్తపరచుకున్నాడు వీరేశలింగం. జాతీయమైన దోషాలను గుణాలుగా ప్రకటించుకుంటూ దురభిమానాన్ని దురహంకారాన్ని వెలువరించే భావాలనాయన తీవ్రంగా నిరసించాడు ముఖస్తుతులు ఆయనకు ససేమిరాగిట్టవు. సారంలేని పొగడ్తలంటే ఆయనకు కంటగింపు. మనజాతి చాలాగొప్పది ఇంతది అంతదిఅని అతిశయపరిపోషకమైన మాటలంటే ఆయనకు గిట్టవు దేశాభిమానం, దేశభక్తి, దేశీయుల కర్తవ్యం, గతమంతా ఘనమే అనటంలోని అనే చిత్రాలనగూర్చి వీరేశలింగం ఈవిధంగా హెచ్చరించాడు.

"ఒక దేశముయొక్క యభివృద్ధిని పాడుచేయుటకై గర్వముతో సమానమయిన శత్రువు లోకములో మరేదియులేదు దేశాభిమానమనగా దేశములోని జనులమీది యభిమానమే యగుటచేత దేశాభిమాన లేశముగల ప్రతి పురుషుడును

తన దేశమునందలి లోపములను తెలిపి తొలగించి జనులను మంచి స్థితిలోనికి దెచ్చుటకును, గుణాధిక్యమెందున్నను గ్రహించునట్లుచేసి స్వదేశజనులు విద్యా వివేకములగలవారి దృష్టియందు గౌరవార్హులగునట్లు చేయుటకును సర్వవిధముల ప్రయత్నము చేయవలయును.

మనపూర్వులు నిజముగా గొప్పవారేయయినను మన గొప్పతనము యిప్పటి యోగ్యతవలన రావలసినదేకాని మన పూర్వులు గొప్పవారని విర్రవీగుట వలన నిందుకేనియుకాదు

పూర్వాచారములను భూషించుటయు నూతనాచారములను దూషించుటయు దేశాభిమానము కాదు దేశమునకు భంగకరములుగానున్న దురాచారములను తొలగించుచు క్షేమకరములుగానున్న సదాచారములను నెలకొల్పుచు దేశాభి వృద్ధికై పాటుపడుటయే నిజమైన దేశాభిమానం.

అనర్థదాయకమైనయాచారము మనదైననుత్యజింపవలయుననియు శుభ కరమైనయాచార మన్యులదైనను భజింపవలయుననియు బోధించి దేశమునందు సత్యాదరమును పరోపకార బుద్ధియు ప్రబలునట్లు చేయుడు"

ఈ విధంగా శాస్త్రీయమైన దృక్పథంతో తర్కసహమైన ఆలోచనలతో కూడిన ఆయన ప్రబోధం ఈతరం యువమేధావులను, ఆలోచనాపరులను ప్రభావితంచేసి వారికి విశాల దృక్పథం అలవరిచింది. స్వీయ, అన్యసీమలభావ పరంపరను వాళ్లు సమన్వయంచేసుకోగల, స్వాగతం చెప్పగల శిక్షణ వాళ్ళకు అలవరిచింది ఆయన రానున్నతరాన్ని గురించి గాఢంగా ఆలోచించాడుగాని చేపట్టటానికుత్సహించే అధికారాన్ని చేకూర్చే ఎన్నికల గురించి తమకం చెందలేదు.

అయితే కాలానికి కూడా కొన్ని వైపరీత్యాలు తప్పవు. చరమ జీవిత ఘట్టంలోనే కానివ్వండి ఆయన జీవితకాలంలోనే 'ప్రత్యక్ష నారాయణుడని' 'మార్పుకి ఇష్టపడనివాడని' ఆయన్ను వర్ణించడం జరిగింది. 1919 మే 27వ తేది ఆయన పరమపదించి దశాబ్దాలు గడచిన తర్వాత రకరకాల పేర్లతో, విమర్శలతో ఆయన్ను చిత్రించటం జరిగింది. ప్రగతినిర్దేశకుడు, తీవ్రవాది, హేతువాది అనే ప్రశంసలతోపాటు, ఆయన జీవితతాత్విక దర్శనం కీర్తిత మైంది ఒకతరంకిందటే ఆయన్ను పూర్తిగా మార్క్సిస్టుగా-కేవలం అదే పేరుతో అనకపోయినా-భావించే ప్రయత్నం జరిగింది.

"భగవంతుణ్ణినమ్మే హేతువాది" అని కొందరు యుక్తిగా ఆయన్ను వర్ణించడంలో నిజానికి కొంత ఔచిత్యం ఉందేమో! అయితే ఆ మాటల కూర్పు

పరస్పర వ్యాఘాతం. దేవుడి పట్లనమ్మకమనేది హేతువాదానికందేదికాదు. విశ్వాస సంబంధి మాత్రమే ఈ విషయంలో వీరేశలింగం తనపాఠకులకు, అనుచరులకు తన ప్రవృత్తి స్పష్టంచేసే ఉన్నారు. చెప్పినదాని కన్నాచేసిన దానిని బట్టి విస్పష్టంగా ఈ విషయం నిరూపితమవుతూనే ఉన్నది. సర్వకారుణ్య పరిపూర్ణుడైన పరమపితపట్ల కృతజ్ఞత ఘటించకుండా ఆయన ఏపనీతలపెట్టలేదు. భగవంతుడిని తలచకుండా ఏపనీ మొదలు పెట్టలేదు. నిరంతరం ఈశ్వర సామీప్యం, చోదకత్వం, ప్రబోధం ఆయన భావిస్తూనే ఉండేవాడు ఏపని మొదలు పెట్టినా, పూర్తిచేసినా, "ఈశ్వరుడు నాపట్ల ఉన్నాడు. నిస్సందేహంగా నన్నాయన ఆదుకొంటున్నాడు. ఆయనకివే నాకైమోడ్పులు, జోహార్లు" రెండు మాటలలో ఆయన జీవితతాత్విక దర్శనమంతా ఇమడ్చవచ్చు ఆ రెండు మాటలు, చిత్తశుద్ధి, ఆస్తికత అనేవి.

స్వతహాగా ఆయన ఆస్తికుడు. అపైన ప్రార్థన సమాజ బృందసమావేశ ప్రభావం ఆయనపై ఉంది. ఈ ప్రార్థనకూటమి బ్రహ్మసమాజ విశ్వాసాలలో ప్రముఖమైనది.

ఆయన జీవితమూ కృషిగురించి తలచినప్పుడు సర్వతోముఖమైన ఆయన ప్రజ్ఞాప్రాభవాలు మనని ఆకర్షిస్తాయి. రచయితగా ఆయన కలం కత్తిలా వాడాడు సంఘంలోని దుష్టాంగాలనెన్నిటినో చికిత్సకుడిలా ఖండించివేశాడు. ఉద్యమవ్యాపనంలో, నిర్వహణలో ఆయన చూపినపట్టుదల, వ్యగ్రతలు ఇటీవలి చరిత్రలో అనన్యసదృశం.

ఆయన కేవలం సంఘసంస్కర్త మాత్రమేకాదు శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి మాటల్లో చెప్పాలంటే ఆయన వీరప్రవక్త. అవతారమూర్తి సంఘజీవన పరిశుద్ధత, ప్రజాహితజీవన నైర్మల్యాలకోసం నిరంతరపోరాటం సాగించాడు. జీవితంపట్ల దుష్టావగాహన తొలగించడం మూఢవిశ్వాసాలు పోకార్చే శాస్త్రీయహేతువాద దృక్పథం ప్రజలకు అలవరచడంకోసం విరామమెరుగక పరిశ్రమించాడు వీరేశలింగం.

సహేతుక విజ్ఞానజ్యోతి నాయన వెలిగించి తరవాతి తరాలవారికి సంక్రమింపచేశాడు. ఇవాళ మన సంఘంలో ఎన్నో అంధకూపాలున్నాయి వీటిని ఆయన మనకందించిన జ్యోతితో బయలుపరచాలి. ముందుకుసాగి ఆయన పోరాటం సఫలీకృతం చేయాలి.